A 5667
1910
TPLA107B
9

ఆడవంత బిజీగా వున్నా తిరిగి యింటి కొచ్చేసరికి - అంత పెద్దయింట్లో యిద్దరి నౌకర్లతో బిక్కుబిక్కు మంటూ వుంటుంది. అతను తనగదిలోకి రాగానే తల్లి ఫోటో దగ్గర కాసేపు నిలబడి వచ్చి మంచం మీద వాలాడంటే వంటరి తనం కాలికి బుద్ధిచెప్పాల్సిందే!

తల్లి జరీ అంచు చీరకట్టుకుని - నౌకర్లకి పనులు పురమాయిస్తూ - నిండుగా చెక్కుచెదరని చిరునవ్వుతో హడివిడిగా యిటు అటు తిరుగుతున్నట్లే అనిపిస్తుంది. తను ఒంటరిగా వున్నాననే భావన అతనికి ఎప్పుడూ అనిపించదు.

యీ రోజు అతను అలా ఎంత వూహించుకుందా మన్నా వూహాపథంలో అతనికి ఆ దృశ్యాలు కనిపించడంలేదు.

తల్లి చనిపోయేముందు అనారోగ్యంతో మంచంలో వున్నతల్లి - తల్లి మంచం పక్కనే దిగులుగా కూర్చున్న తండ్రి — మాటి మాటికి ఆ దృశ్యం గుర్తుకు రాసాగింది కృష్ణమోహన్‌కి.

* * *

శాంతకి చాలా చిన్నతనంలోనే వివాహం అయింది. ఎంతో చిన్నప్పుడంటే ఎనిమిది సంవత్సరాలకే వివాహం అయింది. మూడో తరగతితోనే చదువు ఆగిపోయింది. వాళ్ళ తాతయ్య దగ్గర సంస్కృతం నేర్చుకొనేది. కొన్నాళ్ళ ర్వాత అదీ జరగలేదు. నోములని, వ్రతాలని అత్తింటి టింట మధ్య తిరగడంలో అదీ కుంటుపడింది. పనిపాటల్లో చురుగ్గా వుండేది.

శాంత యింకా కాపరానికి వెళ్ళకుండానే అత్తవారు ఏదో ఒక వంకతో తీసుకెడుతుండేవారు. ఏటా కాన్పులతో, పిల్లలతో అవస్థపడే అత్తగారికి శాంత ఎన్నో పనులలో సాయపడేది. కోడలు వెళ్ళిపోతోంటే అత్తగారికి చెయ్యి విరిగినట్లుగానే అనిపించేది. ఆ అత్తగారు 'మా కోడలు పని మంతురాలు' అని పొరపాటునకూడా పైకి చెప్పుకొనేది కాదు. తను చేసే పనుల్లో యీ పనులో లెక్కా అన్నట్లు మాట్లాడేది.

శాంత రజస్వలయి కాపరానికి వచ్చింది.

శాంత భర్త భానుమూర్తికి హైదరాబాదులో ఉద్యోగం దొరికింది.

భానుమూర్తికి ఉద్యోగం దొరికిన సంవత్సరానికి శాంతని తీసుకెళ్ళి కొత్త కాపురం పెట్టించి, "వదినకి సాయంగా వుండండి" అని యిద్దరి పిల్లలని విడిచి అత్తగారు వెళ్ళిపోయింది.

ఆ యిద్దరు మాకు యిక్కడే బాగుంది. మేము యిక్కడే చదువుకొంటామన్నారు. భానుమూర్తి వాళ్ళని స్కూల్లో జేరిపించాడు. మళ్ళీ సంవత్సరానికి మరో యిద్దరు మరుదులు చదువు పేరుతో యిక్కడకి వచ్చారు.

మరో రెండు సంవత్సరాల తర్వాత, "యిక్కడ చేల గట్లంట తిరగడమేగాని బొత్తిగా చదవటంలేదురా అబ్బాయ్ పాండుని, రంగణ్ణి అక్కడే స్కూల్లో జేరిపిస్తే బాగుంటుందేమో అనిపిస్తోంది" అంది తల్లి.

"అదే మంచిదమ్మా! నేనే అందామనుకొంటున్నాను. నేనో, రామబ్రహ్మమో చెబుతూ వుంటాం. యిప్పుడు పంపేయకూడదూ!" అన్నాడు.

"నువ్వు అంతగా చెబుతోంటే ఎందుకు కాదంటాను? అలాగే తీసుకెళ్ళు" చమత్కారంగా అందావిడ.

"ఎప్పుడూ మగపిల్లల ధ్యాసేకాని నాకు చదువు అక్కరలేదా?" కాత్యాయని తల్లిని నిలేసి అడిగింది.

"ఎంతమందికి చెప్పించాలి చదువు? నీకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. దేవుడి దయవల్ల యీ యేడాది కుదిరిపోతేనూ..." తల్లి మాటలు పూర్తికాకుండానే కాళ్ళు నేలకేసి కొడుతున్నట్లుగా నడుస్తూ - "నేనేం పెళ్ళి చేసుకోను - నేనుకూడా చదువుకొంటాను." అని ఏడుస్తూ అక్కడ నుండి వెళ్ళిపోయింది.

"సంబంధాలు చూస్తున్నారా అమ్మా" భానుమూర్తి అడిగాడు.

"చూస్తున్నారు. వాళ్ళకి పొలం వద్దట. డబ్బు రూపంలో కట్నం కావాలిట. అది మీ నాన్నగారికి యిష్టం లేదు. పొలం అయితే మన పిల్లకే వుంటుందని ఆయన అభిప్రాయం. ఏం చేస్తారో ఏమో!" నిట్టూర్పు విడిచిందావిడ.

తర్వాత భానుమూర్తి చెల్లెలి కోపం పోగొట్టాలని చూశాడు. ఎంత బ్రతిమాలినా కాత్యాయని కోపం తగ్గలేదు. చివరికి ఓ చురక అంటించింది. "యింతమందికి ఒదిన

ఒక్కత్తి చేయాలని భయపడుతున్నట్టున్నావు - నేను చదువు కొంటున్నా పని చేస్తాను."

భానుమూర్తి తెల్లబోయాడు.

"పోనీ! వదిన్ని అడిగి - యీసారి వచ్చినప్పుడు తీసుకెళ్ళు" సరదా ఉత్సాహం లేకుండా అంది.

చదువుకోవాలనే అభిలాషతో చెల్లెలు అలా నిష్ఠూరంగా మాట్లాడుతోందనుకున్న భానుమూర్తి తల్లిని తండ్రిని ఒప్పించి, తమ్ముళ్ళతో బాటు చెల్లెలుని కూడా తీసుకెళ్ళాడు.

ఆరుగురు మరుదులు - ఆడపడుచు, తను - భర్త. మొత్తం తొమ్మిదిమంది. యింతమందికి శాంత నోరు మెదపకుండా చేసేది. శాంత ఎంత చేసినా ఒక్కొక్కరు ఒక్కో వంక పెట్టేవారు. ఎంత బాగా చేసినా వాళ్ళని మెప్పించలేక పోయేది. చదువుకొంటానంటూ వచ్చిన కాత్యాయిని చదువుకోలేదు - యింట్లో శాంతకి పనిలో సహాయంకూడా చేసేది కాదు. తినడం తిరగడం అంతే!

భానుమూర్తికి వరసకి అక్కగారు దుర్గమ్మ. ఆవిడ భర్తకి అక్కడే వుద్యోగం. మొదట శాంతని ఆవిడ అన్నగారికి చేసుకోవాలని అనుకొన్నారు. యిద్దరికీ పదిహేను సంవత్సరాల తేడా వుండడంతో శాంత తల్లి ఒప్పుకోలేదు. ఆ వెంటనే భానుమూర్తితో వివాహం జరిగింది. దుర్గమ్మ వదిన గయ్యాళి. ఎవరినీ గుమ్మంలోకి రానీయదు. శాంత ఓరిమి, సహనం చూస్తోంటే 'శాంత తన వదిన అయితే

ఎంత బాగుండేది' అనుకొనేది. శాంతే తన వదిన అయితే ఒక్కగానొక్క అన్నయ్యని చెల్లెళ్ళ ముఖం చూడకుండా వేరు తీసుకెళ్ళేది కాదు - యిప్పుడు ఆ అన్నగారు ఎవరినీ పట్టించుకోడు. శాంత తల్లిమీద కోపం శాంతమీద కసిగా బయలుదేరింది. దుర్గమ్మతో పుట్టింట ప్రేమకి మొహం వాచి మేము బాధపడుతోంటే శాంత ఎందుకు సుఖపడాలి? శాంత తల్లి 'అయ్యో, ఆ దుర్గమ్మ అన్నకిచ్చినా బాగుండేది' అనుకొనేలా చేయాలి అనుకుంది. అసలే గయ్యాళి - సాధింపు స్వభావం గలది. శాంతమీద అత్తగారికి నేరాలు చెప్పేది. పిల్లలు శెలవులకి యింటికి వస్తే "వదిన ఎలా చూస్తోంది?" అంటూ ఆరా తీసేది. దుర్గమ్మ శాంతమీద కల్పించి చెప్పిన వన్నీ అడిగేది. తల్లి అంత ప్రేమగా అడుగుతోంటే తల్లి స్వభావమే గల పిల్లలు 'నిజమే' అనేవారు. ఆవిడ కోడల్ని సాధించేది. చిన్నపిల్లలు వాళ్ళకి యిది వినోదంగా వుండేది.

రోజులు గడిచిపోతున్నాయి.

రామబ్రహ్మం ఉద్యోగంలో చేరాడు.

అందరి సాధింపులు ఒక ఎత్తు - రామబ్రహ్మం, కాత్యాయిని సాధింపులు ఒక ఎత్తుగా వుండేవి. ఆ యిద్దరూ సాధించడం మొదలుపెట్టారంటే శాంత కళ్ళమ్మట నీళ్ళు తిరగందే వదిలిపెట్టేవారు కాదు. ఎంత ఓర్చుకొందామన్నా సాధ్యం అయేది కాదు.

"నేనయితే యిలా వూరుకోను - నేనయితే అలా వదిలేయను" తనో ప్రత్యేకమయిన వ్యక్తిత్వంగల వాడన్నట్లు దర్పంగా మాట్లాడేవాడు. రామబ్రహ్మాన్ని అందరూ ఓ దేముళ్ళా కొలిచేవారు. మిగతా తమ్ముళ్ళు, కాత్యాయనికి అతను అప్పుడప్పుడు డబ్బులిస్తాడు. భానుమూర్తి ఎప్పుడూ డబ్బు యివ్వడని వాళ్ళకి చిరాకు. కాని, యింతమంది బరువు బాధ్యత భానుమూర్తిమీదే వుందని వాళ్ళకి తెలియదు. రామబ్రహ్మం నెలజీతం రాగానే తను 'యింత' అని కొంత డబ్బు దగ్గరుంచుకుని జీతం అన్నగారి చేతిలో పెట్టగానే దాంతో అతని బాధ్యత తీరిపోతుంది.

భార్యని తన ఎదురుగా తమ్ముళ్ళు చెల్లెలు విసుర్కొంటే భానుమూర్తి ఏమీ కలగజేసుకోడు. తనని కాస్సేపు వూరుకోనేవాడు. అన్నింటికి సహించిన శాంత భర్తలో యీ ఒక్క విషయాన్ని క్షమించలేకపోయేది. రాత్రనక పగలనక తను యింత చాకిరి చేస్తున్నా అందరూ సతాయిస్తారు. అయినా భర్త కలగజేసుకోడు అని బాధపడి మళ్ళా అంతలో సర్దేసుకొనేది. వాళ్ళకి తెలియాలిగాని ఆయనేం చేస్తారు? ఆయన కలగ చేసుకొంటే భార్యని వెనకేసుకొచ్చారని అదోరకంగా గొడవ లేవదీయరు అనుకొనేది.

శాంతకి మూడు సార్లు ఎబార్షన్ కావడంతో ఆరోగ్యం దెబ్బతింది. అదివరకంత ఓపిగ్గా పని చేయలేక పోతోంది. డాక్టరు రాసిచ్చిన మందులు ఎలాగో వాడుతున్నా డాక్టరు చెప్పిన బలమయిన ఆహారం తీసుకోలేక పోతోంది - ఆయన చెప్పిన విశ్రాంతి తీసుకోలేకపోతోంది. తనకి పసుపు

కుంకుమకింద పుట్టింటి వారిచ్చిన అరఎకరం పొలంమీద వచ్చే డబ్బు యింటి ఖర్చులకే అయిపోతుంది. ఆ పంటడబ్బుతో శాంత ఒక్కచీరకూడా ఎప్పుడూ కొనుక్కోలేదు. అప్పట్లో వున్న భానుమూర్తి భార్యకి కనీసం పళ్ళుకూడా కొనలేని స్థితిలో వున్నాడు.

* * *

రామబ్రహ్మం పెళ్ళి కుదిరింది. ఆ అమ్మాయి చదువుకుంది. పైగా సంగీతం వచ్చును. ఇంతవరకూ ఆ ఇంట్లో కోడళ్ళుగాని, ఆడపడుచులుగాని ఎవరూ చదువుకోలేదు. అందుకనే ఆ అమ్మాయి అందరికీ బాగా నచ్చింది. అందులో ఆ అమ్మాయి తండ్రి ప్లీడరు. రామబ్రహ్మం హోదా ఇంకా పెరిగింది ఇంట్లో.

శాంతకి యిప్పుడు అయిదో మాసం. రామబ్రహ్మం పెళ్ళికని వచ్చి - శాంతకి పురుడుపోసివెళ్ళింది. తను యిక్కడ వుండగా చిన్నకోడల్ని కాపరానికి తీసుకొద్దామని చాలా ప్రయత్నంచేసింది. భానుమూర్తి 'యిల్లు యిరుకు' అంటూ దాటేసేవాడు. యిక్కడ నాలుగు రోజులుంటే అత్తారింట్లో నాలుగు రోజులుండేవాడు.

తల్లి వెళ్ళిపోయింది.

తల్లి వెళ్ళిన వారానికే వేరింటి కాపురం పెట్టాడు రామబ్రహ్మం.

అతను వేరింటి కాపరం పెట్టిన వారంరోజుల వరకూ అతను వేరే వుంటున్నాడని ఎవరికీ తెలియదు. అత్తారింటికే వెళ్ళాడని అనుకొన్నారు.

బాబు పుట్టడంతో శాంత మరీ నీరసపడిపోయింది.

తోటికోడలు వస్తుంది - కాస్త పనిలో ఆసరా అవుతుంది అనుకున్న ఆశ అడియాస అయింది.

జీతంరాగానే వందరూపాయలు అన్నగారి చేతిలో పెట్టి ప్రతీనెలా యిలాగే తప్పకుండా యిస్తానని చెప్పాడు రామబ్రహ్మం.

భానుమూర్తి ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఆదివారం రామబ్రహ్మం యింటికి వెళ్తారు పిల్లలు. ఆ వదిన ఏ కొత్త రకం టిఫినో పెడుతుంది. అన్నగారు సినిమాకి వెళ్ళమని డబ్బు ఇస్తాడు - ఆ వదిన సరదాగా మాట్లాడుతుంది. అక్కడకి వెళ్తే ఆదివారం క్షణంలో వెళ్ళిపోయినట్టు వుంటుంది.

అక్కడి నుండి వచ్చి ఆ వదిన్ని యీ వదిన దగ్గర పొగుడుతారు. శాంత నవ్వుతూనే వింటుంది.

"ఆ వదిన దగ్గర నువ్వూ నేర్చుకో! ఎప్పుడూ పాత చింతకాయ పచ్చడి వంటలేనా?" ఇలాగే ఏదో ఒకటి అంటారు. శాంత మౌనంగానే విని వూరుకొంటుంది.

రామబ్రహ్మం చాలా తెలివితేటలయినవాడు. తమ్ముళ్ళకి పెన్ను కొనివ్వడం, చెప్పులు కొనివ్వడం - చెల్లెలికి, రిబ్బన్లు, జాకెట్టు బట్ట కొనివ్వడం లాంటివి చేస్తాడు. తల్లి వస్తే చీర పెడతాడు - తండ్రికి బట్టలు పంపిస్తాడు. కాని ఒక్క తమ్ముడినికూడా వచ్చి వుండమనిగాని, వదిన ఒక్కత్తె ఏం చేస్తుందనిగాని ఎప్పుడూ పొరపాటునకూడా అనడు. అది ఎవరికీ గ్రహింపులేదు. చిన్న అన్నయ్య దేవుడు. అంతే!

'వేరే వుంటేయేం? నెల వచ్చేసరికి వందరూపాయలు యిస్తున్నాడు' తల్లి సంబరపడుతుంది.

మరో నాలుగేళ్ళు గడిచిపోయినాయి - మరో యిద్దరు తమ్ముళ్ళు గట్టెక్కారు. రెండో తమ్ముడికికూడా పెళ్ళయింది. ఆఫీసుకి దూరం అంటూ అతనుకూడా వేరే యిల్లు చూసుకుని వెళ్ళిపోయాడు.

కాత్యాయినికి పెళ్ళి అయింది. యింకా కాపరానికి తీసుకెళ్ళలేదు. మా అబ్బాయికి చదువు పూర్తయితేగాని కాపరానికి తీసుకెళ్ళం. మీ అమ్మాయిచేత ఏదన్నా పరీక్షకి కట్టించండి అన్నారు.

కాత్యాయినిచేత మెట్రిక్ పరీక్షకి కట్టించారు. వారానికోసారి రామబ్రహ్మం యింటికి వెళ్ళి పాఠాలు చెప్పించుకొంటుంది.

కాత్యాయినికి పెళ్ళి అయినా - చదువుకొంటున్నా సాధింపుగుణం పోలేదు. ఒకరిమీద నేరాలు చెప్పే బుద్ధి పోలేదు.

రాత్రి భోజనాల దగ్గర మాటల్లో దుర్గమ్మ గురించి ప్రస్తావన వచ్చింది. దుర్గమ్మ భర్త స్వంత వూరిలో యిల్లు కూడా అమ్మేశాడని భానుమూర్తి అన్నాడు.

"అయ్యో పాపం! ఏటా కాన్పుతో ఆవిడ అసలే ఆరోగ్యం బాగుండక, భర్త చెడు తిరుగుళ్ళకే బెంగపెట్టుకుంది. పొలం అమ్మేయడం గాకుండా వుండడానికి యిల్లు కూడా లేకుండా అమ్మేస్తే ఆవిడెంత బాధపడుతోందో పాపం" శాంత జాలిగా అంది.

కాత్యాయని దుర్గమ్మ దగ్గర శాంత అన్నమాటలు మరో విధంగా మార్చి - యింకో నాలుగు మాటలు జేర్చి చెప్పింది. "బావ ఆడవాళ్ళతో తిరుగుతాడుట - తాగుతాడుట - నీకు ఏడాదికో పిల్ల పుడుతుందిట" అంటూ చెప్పింది.

మధ్యాహ్నం పని అంతా అయ్యాక చాప పరుచుకుని పడుకుంది శాంత.

'అందరి చదువులూ గట్టు ఎక్కినట్టే! ఒక్క సంవత్సరం కళ్ళు మూసుకొంటే పాండు, రంగడి చదువులుకూడా అయిపోతాయి — యిన్ని అప్పులు ఎలా తీరుతాయి?' శాంత ఆలోచిస్తూ పడుకుంది. కాత్యాయిని కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకొంటోంది.

వీధి తలుపు ఎవరో దబ దబ బాదుతున్నారు.

శాంత లేచేలోగా కాత్యాయిని లేచి తలుపు తీసింది. ఎదురుగా దుర్గమ్మ ఉగ్రరూపంచూసి, హడలిపోయి ఒకడుగు వెనక్కి వేసింది.

"మీ వదిన వుందిటే!" అంది కాత్యాయిని తలుపు తెరవగానే.

అప్పటికే లేచి నిలబడిన శాంత, "రండి" అంది ఎదురొస్తూ.

"నీ మర్యాదలు అందుకోవడానికి రాలేదు నేను. అసలు నీ ఉద్దేశ్యం ఏమిటో కనుక్కొందామని వచ్చాను" అంది రొప్పుతూ. చంకలో పిల్లాడు గోలపెట్టేస్తున్నాడు.

"ఏమిటండి?" అంది తెల్లబోతూ.

తను బయటపడిపోతానని భయపడ్డ కాత్యాయిని మెల్లగా పక్కింట్లోకి జారుకుంది. "ఏమిటి గొడవ ?" అని వాళ్ళు అడిగితే తనకి తెలియదంది.

"నా మొగుడు ఎవరితో తిరుగుతోంటే చూశావే నువ్వు - నా మొగుడు తాగితే నీకెందుకు? తందనాలాడితే నీకెందుకు? ఊరోళ్ళ మొగుళ్ళు ఎవరితో తిరుగుతున్నారో - ఏం చేస్తున్నారో చూడ్డమే నీ పనా?...

"ఏమిటి మీరంటున్నది" తెల్లబోతూ అయోమయంగా అడిగింది శాంత.

"ఎంత నంగనాచివే! నీ అత్తలా, ఆడబిడ్డలా నేనేం వెర్రిమొఖాన్ని కాదు, నీచేత అడ్డమయిన మాటలూ పడడానికి. నువ్వు ఏమీ ఎరుగనట్టు అమాయకంగా ముఖం పెట్టేసే పాపం వెర్రిది అంటూ వెళ్ళిపోతాననుకొంటున్నావేమో! అదేం కుదర్దు..."

"అసలు సంగతి చెప్పకుండా ఏమిటండి మీరు?" కాస్త గట్టిగానే అంది శాంత.

దుర్గమ్మ అసలు సంగతి చెప్పకుండా తన ధోరణిలో అరవసాగింది. "మా యిష్టం! మా పొలాలు, మా యిల్లు మా యిష్టం వచ్చినట్టు అమ్ముకొంటాం నీకెందుకు మధ్య! మమ్మల్ని యాగీ చేయడానికి నీకెవరిచ్చారు అధికారం. అసలు నీ కుళ్ళు నాకు తెలుసు. పిల్లలతల్లుల్ని రెండు కళ్ళెట్టుకుని తిన్నగా చూడలేవు. యీ విషయంలో నీ అత్తగారి మీదా నీ కళ్ళు పడ్డాయి. అందుకే రాయిలా తిరిగే మనిషి ఎలా అయిపోయింది...?"

"దుర్గమ్మగారూ..."

శాంతని ఆవిడేమీ చెప్పనీయలేదు. మళ్ళీ యిలా అంది : "నేను ఏటా ఏటా కంటే నీకెందుకు ? నువ్వు నాకేం పురుళ్ళు పోశావా, పుణ్యాలు పోశావా ? ఏడాదికి ఒకర్ని కాదు - యిద్దర్ని కంటాను! కడుపు పండాలంటే పెట్టి పుట్టాలి. కనాలంటే కనేయగలవా ? యిలాంటి కుళ్ళుబుద్ధులు వున్నాయి కాబట్టే ఒంటికాయ శొంఠికొమ్ములా ఒక్కడే పుట్టాడు. అసలు గొడ్రాలి ముఖమయినా చూడచ్చుగాని - ఒంటి గొడ్రాలి ముఖం చూడకూడదన్నారు. వూరికే అన్నారా ? పొద్దున్నే లేచి..."

"దుర్గమ్మా - వెళ్ళు - వెళ్ళిపో..." భళ్ళున తలుపులు మూసి కింద కూలబడిపోయింది శాంత.

కళ్ళు చీకట్లు కమ్మి గిర్రున తిరిగాయి.

దుర్గమ్మ యింకా కేకలేస్తూనే వుంది. చంకలో పిల్లాడు గోలపెట్టేస్తున్నా ఆవిడ లెక్కచేయడంలేదు.

పక్కవాటాలవాళ్ళు బయటకి రాకపోయినా ఏమిటా అని కుతూహలంగా కిటికీల్లోంచి చూస్తున్నారు. వాళ్ళని పిల్చి మరీ చెప్తోంది దుర్గమ్మ.

ఎవరు ఎన్నిమాటలు అన్నా ఎప్పుడూ భర్తకి చెప్ప లేదు. గాని యీ వేళ దుర్గమ్మ మాటలు భరించలేక భర్త రాగానే చెప్పి వెక్కి వెక్కి ఏడ్చేసింది.

దుర్గమ్మ ఇంటికొచ్చి ఇంత గొడవ చెస్తుందని కాత్యాయిని అనుకోలేదు. ఆవిడ తనని బయట పెట్టేస్తుందని

అనుకోలేదు. దుర్గమ్మ వెళ్ళగానే ఇంట్లోకి రాకుండా రామ బ్రహ్మం ఇంటికి వెళ్ళిపోయింది.

"కాత్యాయిని ఏది?" అని అడిగాడు.

"రామబ్రహ్మం ఇంటికి వెళ్ళిందిట. దుర్గమ్మ వెళ్ళాక యింక లోపలకి రాలేదు. అయినా మొన్న ఆవిడ మీద ద్వేషంతో ఏమీ అనలేను కదా!" శాంత గొంతు దుఃఖంతో పట్టుకు పోయింది.

కాత్యాయిని రామబ్రహ్మానికి ఏం చెప్పిందో అక్కడే వుండిపోయింది. యీ గొడవ జరిగిన నాలుగురోజులకి తల్లి వూరునుండి వచ్చింది. కోడల్ని నాలుగు దులిపింది. అయిన వాళ్ళతో యీ దెబ్బలాటలేమిటి? నలుగురిలో తలఎత్తుకుని తిరగాలా వద్దా అని. పదిరోజులుండి వెళ్ళేముందు కాత్యాయినిని తీసుకొచ్చి పెద్దకొడుకు ఇంట్లో దింపి అంది, "పరీక్షలు అవగానే తీసుకెళ్ళి పోతాను" అని.

కాత్యాయిని వదినగారిని తప్పుకు తిరుగుతోంది.
ఆ దెబ్బతో పెత్తనాలుకూడా మానేసింది.

* * *

ఇప్పుడు భానుమూర్తికి బాధ్యతలు తీరినాయి.
తలమునగా అప్పులభారం మిగిలింది.
కాత్యాయిని అత్తారింటికి వెళ్ళిపోయింది.

పాండు ఇంజనీర్ పాసయి బొంబాయిలో ఓ కంపెనీలో పనిచేస్తున్నాడు. రంగడు డాక్టరు పాసయి తన క్లాస్‌మేట్‌నే

పెళ్ళిచేసుకొన్నాడు. ఇద్దరూ రెండు చేతులా సంపాయించుకొంటూ హాయిగా సుఖంగా వున్నారు.

భానుమూర్తి తల్లి పోయింది. భానుమూర్తి తండ్రి భార్యపోగానే ఆఖరిపిల్లకి కూడా పెళ్ళిచేసేసి తనకి కొంత పొల వుంచుకుని మిగతాది పిల్లలకి పంచేశాడు. తనకి అక్కట పెట్టుకున్న కాస్త పొలం తన తదనంతరం ఆడపిల్లలకి చెందాలని రాసి చేతులు దులుపుకున్నాడు.

తన కొడుకులందరూ పెద్దకొడుకు దగ్గరేవుండి చదువుకొన్నారు. ఎప్పుడేనా పొలంలో పండిన పప్పులు - బియ్యం పంపడమేగా వాళ్ళు ఎలా బ్రతుకుతున్నారో తను చూడలేదు, ఎప్పుడూ డబ్బు పంపలేదు. అప్పుడు ఏమయినా ఉన్నాయా అని ఆయన ఏమీ అడగలేదు.

కొడుకులు మర్యాదకి తండ్రిని మాదగ్గరకి వచ్చేయ్ అన్నారు.

ఆయన ఆ వూరు విడిచి రానన్నాడు.

అప్పులు గురించి ఎవరూ కదపక పోయేసరికి నోట మాట రానివాడిలా వుండిపోయాడు భానుమూర్తి. తండ్రి అక్కడనుండి వెళ్ళిపోయాక రామబ్రహ్మంతో అన్నాడు భానుమూర్తి "చదువులకి చాలా అప్పు అయింది కదా! నాన్నగారు ఆ సంగతే ఎత్తలేదు."

"నేను యింట్లో వున్నన్నాళ్ళు జీతం అంతా నీ చేతుల్లోనే పోశాను - వేరే వెళ్ళినా అసలు యివ్వకుండా ఎప్పుడూ లేను - యింక అప్పు చేయవలసిన అవసరం ఎందుకొచ్చింది ?" అన్నాడు.

అక్కడ రంగడు వుండికూడా ఏమీ మాట్లాడలేదు.

దాంతో భానుమూర్తి కళ్ళు తెరిచాడు.

యింక ఆ సంగతి ఎవరితోనూ అనలేదు.

తమ్ముళ్ళు తనకి పరాయి వాళ్ళుకాదు. వాళ్ళు చదువు కొంటామన్నారు - తనకి చాతనయింది చెప్పించాడు. తనకి ఒక్క కొడుకు - పెంచలేక పోడు ......

తనవాటాకి వచ్చిన పొలం తమ్ముడినే తీసేసుకోమని డబ్బు తీసుకున్నాడు. అప్పులు సగం కూడా తీరలేదు - శాంత నగలు, శాంతకి పుట్టింటి వారిచ్చిన అరఎకరం పొలం కూడా అమ్మక తప్పలేదు. భానుమూర్తి ఆ పొలం అమ్మ డానికి వెనకాడాడు. శాంత అమ్మేయమంది. యీ వడ్డీలు మనల్ని మింగేస్తాయి. నేనే అమ్మమంటున్నానుగా అంది.

* * *

యిప్పుడు భానుమూర్తి యింటికి ఎవరూరారు. ఎవరి సంసారాలు వారివి. వాళ్ళ యిళ్ళల్లో ఏమయినా వేడుకలు జరుపుకొంటే పిలుస్తారు. ఏదోఒక కానుకకొని తీసుకెళ్తారు. ఎంతచిన్న వస్తువుకొన్నా. వీళ్ళకి అదే పెద్దఖర్చు- అది వాళ్ళకి పూచికపుల్లతో సమానం.

ఒక్క కొడుకు అయినా పెద్దగా, గొప్పగా పెంచలేక పోయినా - కనీసం మామూలుగా కూడా పెంచలేకపోతు న్నారు. శాంత ఆరోగ్యం పూర్తిగా పాడయింది. ఒంట్లో ఓపిక లేకపోయినా ఉన్నంతలో కొడుకుని జాగ్రత్తగా చూసుకో సాగింది. భానుమూర్తి డీలా పడిపోయినట్టుగా

అయినాడు. కాని, పైకి ఏమీ అనడు. కొడుకుని ముద్దుకైనా ఎప్పుడూ దగ్గరకి తీయడు. అతను మొదటి నుండి అంతే!

"వాడిని ఒక్కసారయినా దగ్గరకి తీయరేం? మీరు యింటికి వచ్చారంటే బిక్కుబిక్కు మంటూ వుంటాడు పాపం" ఓసారి శాంత నవ్వుతూ అంది.

"నేను వాడికి ఏం చేశాను? - ఏం చేయగలను?" నెమ్మదిగా అన్నాడు.

"అదేమిటి అలా మాట్లాడతారు? ఏదేనా చేస్తేనే పిల్లలని దగ్గరకి తీసి - లేకపోతే మానేస్తారా? మన ప్రేమాభిమానలే వాడికి శ్రీరామరక్ష." భర్త బాధపడుతున్నాడని గ్రహించి అంది.

"అప్పటినుండి ఎప్పుడేనా యిలారా, "కృష్ణా!" అంటూ పిల్చేవాడు. కాని, తండ్రి దగ్గర ఏమాత్రం చనువు లేని కృష్ణమోహన్ బెదురుగా - దూరంగా నిలబడేవాడు. ఆ భయం పోగొట్టి ఇంకోసారి అతను పిలిచేవాడుకాదు.

యిది చూసిన శాంత, "నాన్నగారు పిలిస్తే వెళ్ళద్దా బాబూ" అనేది.

సమాధానం చెప్పకుండా తల్లి పచ్చెళ్ళల్లో మొఖం దాచుకొనేవాడు.

శాంతకి వైద్యం వేరే డాక్టరు దగ్గరకే వెళ్తోంది.

వేరే డాక్టరు దగ్గరకి వెళ్తే బాగుండదని, మొదట రంగడు దగ్గరకే వెళ్ళారు. వారం రోజులు మందు యిచ్చిన రంగడు భార్య శాంత రావడంచూసి, చూడనట్టుగా శాంతకి వినపడేలా భర్తతో అంది: "మీ వదిన ఎప్పుడూ రోగిష్టిదే

ఎన్నాళ్ళని ఫ్రీగా చేయగలం. యిలాంటి కేసులు ఒక్క పది కేసులు తగిల్తే - బిచాణా ఎత్తేయచ్చు."

శాంత మాటనోక్కినట్టు ఆగిపోయింది. తన దగ్గర పెరిగిన రంగడు నోటివెంబడి వారింపుమాటలు వినపడతా యనుకున్న శాంతకి కళ్ళు తిరిగినట్టయింది. రంగడు అంటు న్నాడు "ఏమంటుంది చెప్పు! అదివాళ్ళు తెలుసుకోవాలిగాని, వైద్యం చేయమని చెప్పలేం! డబ్బు యిమ్మని అడగలేము."

ఇంక ఒక్కక్షణం కూడా అక్కడ నిలబడలేక గిరుక్కున తిరిగి యింటికి వచ్చేసింది.

అలా పదిరోజులు మందు లేదు. వదిన రాలేదేమని రంగడు అడగలేదు. భానుమూర్తి అడగ్గా అడగ్గా అసలు సంగతి చెప్పి, "యింకో డాక్టరు దగ్గరకి వెళ్దాం" అంది.

భానుమూర్తి ఏమంటాడు? నోరు మెదపలేదు.

* * *

మూడు రోజులనుండి అపస్మారకస్థితిలో వుంది శాంత. బంధువులకీ టెలిగ్రాములు వెళ్ళినాయి.

రంగడు యీమూడు రోజులనుండి వదినగారి మంచం దగ్గర నుండి కదల్లేదు. అతను ఏస్తూనే వదిన యీస్థితికి వచ్చే వరకూ మందు యిప్పించకుండా ఎలా వూరుకొన్నావు? ఆవిడకి వచ్చే ఓపికలేకపోతే - కబురుచేస్తే నేను రానా? అన్నగారితో నిష్టూరంగా అన్నాడు.

రామబ్రహ్మం దంపతులు రోజు వచ్చి చూసి వెళ్తు న్నారు. రామబ్రహ్మం భార్య యశోద కృష్ణని రమ్మని ఎంతో బ్రతిమలాడింది, చినపిల్లాడు తల్లిని చూసి భయపడతాడని.

కృష్ణ రానని తల అడ్డంగా వూపాడు. కృష్ణకి జ్ఞానం వచ్చింది. కుటుంబ విషయాలు కృష్ణకి బాగానే అర్థమవ సాగాయి. తన తల్లిదండ్రుల మీద వీళ్ళందరికీ ఎంతెంత గౌరవాలున్నాయో - తనంటే వీళ్ళందరికి ఎంతెంత అభిమాన ముంటుందో బాగానే గ్రహించుకొన్నాడు.

బావగారితో చెప్పింది కృష్ణని తనతో పంపమని.

"తల్లిదగ్గర వుండనీయమ్మా" అంటూ ముఖం దాచుకున్నాడు.

అతని మూడు రోజుల క్రితం శాంత అన్నమాటలు గుర్తొచ్చి కడుపులో దేవినట్టయింది.

భర్తని పక్కలో కూర్చోమని, నాదో చిన్నకోరిక తీరుస్తారా ?" అని అడిగింది.

"ఏమిటది ? చెప్పు శాంతా !" అన్నాడు.

"నేను యింక ఆట్టేరోజులు బ్రతకను......"

"శాంతా ! అలా అనకు. తల తాకట్టు పెట్టి అయినా నీకు మంచివైద్యం చేయిస్తాను. నామీద నీకా నమ్మకం లేదా" ఆవేదనగా - గబగబా అన్నాడు. శాంత పూర్తిగా మంచం లోంచి లేవలేనప్పటినుండి అతనికి మతిపోతున్నట్టుగా వుంది.

మీరు వైద్యం చేయించరని ఎప్పుడయినా అన్నానా? నేను చేప్పేది వినండి. నాకు తగ్గితే సంతోషమే! కృష్ణ పెళ్ళి అయేవరకేనా ఎలాగో అలాగ బ్రతుకు యీడుస్తాననుకొన్నాను......"

పువ్వులా వున్న శాంత చేయి తన చేతుల్లోకి తీసు

కున్నాడు. ఏదేనా మాట్లాడాలని వున్నా అతను మాట్లాడ లేకపోతున్నాడు.

"మీరు కంగారు పడకండి — ఒకవేళ - ఒకవేళ నాకు ఏదైనా అయితే కృష్ణని ఎవరి దగ్గరకీ పంపకుండా మీ దగ్గరే వుంచుకుని — మీరే వాడికి చదువు చెప్పించాలి - మీ అండనే వాడు ప్రయోజకుడు అవాలి - ఇది నా కోరిక - తప్పక తీరుస్తారు కదూ !"

"శాంతా ! వాడు నాకు బరువా ? వాడిని వదిలి నేను ఒక్క క్షణం వుండగలనా ? వాడికి నేను గొప్పగా ఏమీ చేయలేకపోవచ్చు - అంత మాత్రాన నేను వాడిని..." ఇంక అతను మాట్లాడలేకపోయాడు.

శాంత ఆ రాత్రి కొడుకుని పక్కలో కూర్చో పెట్టుకుని అంది, "కృష్ణా! నాకు తొందరగానే తగ్గిపోతుంది - నువ్వు శ్రద్ధగా చదువుకోవాలి - బాబయ్యలాగే పెద్దపెద్ద చదువులు చదువుకోవాలి."

బాబయ్యల సంగతి ఎత్తేసరికి కృష్ణ ముఖం తిప్పేసు కున్నాడు.

"నాన్నగారి దగ్గరికి వెళ్తుండాలిరా! అలా దూర దూరంగా తిరుగుతోంటే. నాన్నగారు ఎంత బాధపడు తున్నారో తెలుసా ?"

తల్లి ఏవేవో హితబోధలు చేస్తోంటే కృష్ణకి ఎంత నిగ్రహించుకొందామన్నా దుఃఖం ఆగలేదు. చాటుకివెళ్ళి దుఃఖం తీరేవరకూ ఏడ్చాడు.

శాంత ముగ్గురు అన్నగార్లు వచ్చారు.

కాత్యాయిని టెలిగ్రాం అందగానే వెంటనే వచ్చేసింది. "వదినకి ఒంట్లో బాగుండలేదని ఒక్క కార్డురాస్తే నేనురానా? ఇలా అయ్యేవరకు నాకు ఎందుకు తెలియపరచ లేదు?" అని ఏడ్చేసింది.

ఆ రోజు దుర్గమ్మ అంత గొడవ చేసి వెళ్ళినా వదిన గారు తిననేమీ అనకపోవడంతో అప్పుడే వదినంటే గౌరవం ఏర్పడింది. కాని నోరువిప్పి "క్షమించు వదినా" అని అనలేకపోయింది. అభిమానం అడ్డు వచ్చింది.

కాత్యాయిని వచ్చినప్పటినుండి శాంత దగ్గరే కూర్చుంది. ఎవరు భోజనానికి పిలిచినా "మా వదిన కళ్ళు తెరవందే నేను పచ్చిమంచినీళ్ళుకూడా తాగను" అంది.

ఆ రాత్రి గడిస్తే గండం గడిచినట్లే అనుకున్నారు.

కాని, అలా జరగలేదు –

సూర్యుడు ఉదయించేవేళ –

ఆ ఇంటి ఇల్లాలు అస్తమించింది –

కాత్యాయిని గొల్లుమంది –

కృష్ణ తల్లిని గట్టిగా వాటేసుకుని ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయాడు.

కృష్ణనీ గబగబా పక్కగదిలోకి తీసుకెళ్ళి ముఖం మీద నీళ్ళుచల్లి ఉపచారాలు చేశారు. కృష్ణ ఎంతో సేపటికి కాని తేరుకోలేదు. తెలివి వచ్చిన మరుక్షణం తల్లి శవంమీద పడి ఒక్కటే ఏడుపు–కృష్ణని పట్టుకోవడం ఎవరితరం కాలేదు.

భానుమూర్తి నేలమీద బోర్లాపడుకున్నాడు కొడుకు దుఃఖం చూడలేక – ఓదార్చలేక.

కాత్యాయిని కొంతసేపటికి తన దుఃఖాన్ని దిగమింగి అన్నగార్ని ఓదార్చింది. కృష్ణని మాత్రం శవం దగ్గరనుండి ఒక్క అంగుళంకుడా కదల్చ లేకపోయారు. 'ఏడవనీ ఆ దుఃఖ భారమయినా తీరుతుంది' అనుకుని కృష్ణ ఒంటి మీద చెయి వేసి అలాగే కూర్చుంది.

* * *

ఎక్కడి వాళ్ళక్కడ నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు.

కృష్ణ కటిక నేలమీద ఓ మూల ముడుచుకొని పడుకున్నాడు.

భానుమూర్తి కొడుకు ఒంటిమీద చేయి వేసి తల వంచుకుని, గోడకి జార్లపడి కూర్చున్నాడు. కృష్ణ ఒళ్ళు వెచ్చగా వుంది. యింకా వెక్కుతూనే వున్నాడు.

ఖర్మకాండ ఏ లోటూ లేకుండా యధావిధిగా చేశాడు భానుమూర్తి.

ఎక్కడివాళ్ళక్కడికి ప్రయాణాలు అయినారు.

అందరూ - "మా దగ్గరకి వచ్చి పదిరోజుల పాటు ఉండు" అని అడిగారు భానుమూర్తిని.

భానుమూర్తి ఎక్కడికీ రాలేనన్నాడు.

కాత్యాయిని అందరిలా ఒకసారి అడిగి వూరుకోలేదు. "అన్నయ్యా! నువ్వు - కృష్ణా నా దగ్గరకొచ్చి నెలరోజులపాటు ఉండండి. కృష్ణని నా దగ్గరే ఉంచుకొంటాను. అక్కడే చదువుకొంటాడు. ఆయన కూడా ఏమీ అనరు" అని ఎంతో బ్రతిమాలింది.

"నేను ఎక్కడికీ రాలేనమ్మా! ఏమీ అనుకోకు" అన్నాడు మెల్లగా.

"మీరు నన్ను అంత ప్రేమగా చూశారు. చిన్నతనంలో తెలిసీ తెలియక అవక తవకగా ఎలా ప్రవర్తించినా తల్లితండ్రులకన్న మిన్నగా కడుపులో దాచుకున్నట్టు చూశారు. ఎంతచేస్తే మీ ఋణం తీర్చుకోగలను అన్నయ్యా! నువ్వంటే నీకు చెల్లెలుని కాబట్టి సద్దుకొన్నావు - వదిన ఎంత అభిమానంతో చేసింది? నన్ను ఏదయినా చేయనీ అన్నయ్యా! అప్పుడేనా కాస్త మనసు కుదురుపడుతుందేమో! కాదనకు అన్నయ్యా!" ప్రాధేయపడుతున్నట్టుగా అడిగింది.

"మరోలా అనుకోకు తల్లీ! యీ యిల్లు విడిస్తే ఒక్క క్షణంకూడా నా ప్రాణం నిలవదమ్మా! కొద్దిరోజులు పోయాక వస్తాలే, మనసు కష్టపెట్టుకోకు" అన్నాడు చెల్లెలు తల నిమురుతూ.

భారమయిన మనసుతో వెళ్ళిపోయింది కాత్యాయిని.

శాంత ఆఖరి అన్నగారుకూడా రమ్మని ఎంతో బతిమాలి భానుమూర్తి రాననడంతో అతనుకూడా వెళ్ళిపోయాడు.

చీమ చిటుక్కుమంటే వినపడేంత నిశ్శబ్దం అలుముకుంది ఆ ఇంట్లో.

* * *

పరీక్షలు దగ్గర పడుతున్నాయి పుస్తకాలు ముందేసు

కొంటాడే కాని చదవబుద్ధి కాదు. తల్లి బాగా చదువుకోమని చెప్పిన మాటలు చెవిలో గింగురుమంటాయి. బలవంతంగా పుస్తకంలో తల దూరుస్తాడు కృష్ణ.

'అమ్మ చచ్చిపోకుండా వుంటే తను ఎన్నయినా చేయ గలిగేవాడు సప్తసముద్రాలు యీదమంటే ఈత నేర్చుకుని ధైర్యంగా యీదేవాడు. కొండల్ని పిండి చేయమంటే - సునాయాసంగా చేసేవాడు. అమ్మనీడలో కొండంత ధైర్యం- ఏమయినా సునాయాసంగా చేసేవాడు. అమ్మలేనిది నేను ఏమీ చేయలేను భగవాన్ ! నాకు అమ్మలేకుండా ఎందుకు చేశావ్ ! నేనేం పాపం చేశాను ? మా అమ్మ ఏం తప్పు చేసింది ? ఎందుకు మమ్మల్ని వేరు చేశావ్ ?' ఎంతసేపో ఏడ్చేవాడు - ఎంత ఏడ్చినా పోయిన తల్లిరాదు-

తండ్రి పిలవగానే రెండు ముద్దలు తిన్నాననిపించి వచ్చేసేవాడు.

భానుమూర్తికి ఓదార్చడం గాని - బ్రతిమాలడం గాని చేతరాదు. "అదేం తిండి కృష్ణా! కొంచెం వేసుకో! అంటాడు.

"తిన్నానండి - ఇంక వద్దు" అని వచ్చేస్తాడు.

కృష్ణ బాధగా వుండడం గమనించి ఏవో నాలుగు మాటలు చెప్పి ఓదార్చాలని వుంటుంది భానుమూర్తికి. తన బాధని దిగమింగి కొడుకు దగ్గరకి వెళ్ళేసరికి కృష్ణ తండ్రిని చూస్తూనే ముడుచుకుపోతాడు.

ఇలాగే రోజులు గడిచిపోతున్నాయి.

కృష్ణ స్కూల్ ఫైనల్ పరీక్షలు రాశాడు.

శాంత మూడో అన్నగారు ప్రకాశంవచ్చి తన ఇంటికి

వస్తే కాని వల్లకాదని బలవంతంపెట్టి దగ్గరుండి తీసుకెళ్ళాడు భానుమూర్తిని, కృష్ణని. ముళ్ళమీద ఉన్నట్టుగా రెండు రోజులున్నాడు. అలాగే చెల్లెలింటికివెళ్ళి రెండు రోజులుండి కొడుకుని తీసుకొని వచ్చేశాడు.

అన్నగారు గుమ్మంలోకి వచ్చినందుకే పొంగి పోయింది కాత్యాయిని

ఒక్కొక్క సారి అసలు భగవంతుడు వున్నాడా అని పిస్తుంది. కష్టాలన్నీ ఒకరికే వస్తూంటాయి. మొండిగా బ్రతికే వాళ్ళని మరీ పరీక్షిస్తూంటాడేమో మరి.

'రిజల్ట్సు తెలియడానికి ఇంకా టైమువుంది. కృష్ణ ఏం ఆలోచకుండా వున్నాడు. ఏ వూరయినా చూసిరమ్మని పంపితే కాస్త తేరుకొంటాడేమో! తీరా ఇప్పుడు పంపితే కాలేజీలు తెరిచేటయిముకి డబ్బు సమకూడుతుందా? ఇప్పుడు అప్పుచేసి పంపితే - అప్పుడు మళ్ళీ అప్పు దొరకక పోతే ___'

ఇలా ఆలోచిస్తూ పరాగ్గా నడుస్తున్న భానుమూర్తి భూతంలాంటి లారీ పదే పదే హారను కొట్టడంగాని - రంయ్‌న మలుపు తిరగడంగాని గమనించలేదు.

అతను కొడుకు గురించి ఆలోచిస్తూనే యీ లోకాన్ని వదిలాడు.

* * *

కృష్ణ మాటా పలుకూ లేకుండా రాయిలా కూర్చున్నాడు.

“తల్లి చస్తే అంత ఏడ్చాడు - తండ్రి చస్తే కంట తడే

పెట్టలేను." అంటూ వ్యాఖ్యానించారు దుర్గమ్మా, మరి కొందరు.

తమ్ముళ్ళందరూ కలిసి ఆ పదిరోజులూ చేయవలసిందంతా చేశారు.

కాత్యాయిని, "నాతో వచ్చేయరా కృష్ణా! నాకు అయిదుగురు పిల్లలనుకొంటాను. నిన్నెవరూ చిన్నచూపు చూడరు" అంటూ బ్రతిమాలింది. కాత్యాయిని అంత ఇదిగా చెప్తున్నా అక్కడ ఉన్న ఆమె భర్త నోరు మెదప లేదు. ఇది కృష్ణ గ్రహించాడు.

మేనమామ ప్రకాశరావ్ "కృష్ణా, పిల్లలతో బాటు చదువుకొందువుగాని, మా ఇంటికి రా" అన్నాడు. అతని భార్యకూడా అదేమాట ఎంతో అభిమానంగా చెప్పింది.

వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు ఆవిడ చూపిన ఆదరణ కృష్ణ మర్చిపోలేదు.

బాబయ్యలందరూ అందరూ తలోఖర్చు భరించి, ఒకరింట్లో భోజనం పెట్టి, కృష్ణ 'ఇంక చాలు' అనేవరకూ చదువు చెప్పించాలని మాట్లాడుకున్నారు. యీ మాటలు వింటోంటే కృష్ణకి వాళ్ళమీద వుండే గౌరవభావంకూడా ఆ సమయంలో తొలగిపోయింది.

'నేను పుస్తకాలు కొంటాను' - 'నేను ఫీజు కడతాను' 'నేను కావలసిన బట్టలు కొంటాను' -

ఇలా అందరూ తలోక మాటా అన్నవారే కాని, భోజనం పెట్టి చాకిరీ చేసేది ఎవరో వాళ్ళల్లో వాళ్ళు తేల్చు కోలేకపోయారు - 'మాయింట్లో వుంటాడు' అని ఎవరూ అన

లేదు. వాళ్ళ పిల్లలతోపాటు గుప్పెడు మెతుకులు పెట్ట డానికి అందరికీ బరువే!

'మా ఇంటికి వచ్చేయ్! మాపిల్లలతోపాటే నువ్వూను' అనే వాళ్ళు ఇద్దరే! మేనత్త - మేనమామ.

అసలు కృష్ణకి ఎక్కడికీ వెళ్ళాలనీ లేదు. కాని, తల్లి పోయిన ఈ ఆరునెలల్లోనే ఎంతో వంటరితనం భరించాడు. వంటరిగా వుంటే తను చదువుకోలేడు. అమ్మ ఆశయం నెర వేరాలంటే తను బాగా చదువుకోవాలి. తను ఒంటరిగా వుంటే చదువుకోలేడు. మేనత్త మనస్ఫూర్తిగా ఆహ్వానించినా ఆమె భర్తకి ఇష్టంలేదు - ఇష్టంలేనిచోట తను ఇనుడలేడు.

ఆఖరికి మేనమామతో వెళ్ళడానికే నిశ్చయించు కున్నాడు.

'పుస్తకాలు కొనిస్తాం - ఫీజులు కొనిస్తాం' పినతండ్రులు పాఠం మొదలెట్టారు.

"మా పిల్లలతోపాటే - నా శక్తిమేరకు చేస్తాను - అవసరమయినప్పుడు మీకు తప్పకుండా రాస్తాను - ఏమీ అనుకోకండి" వినయంగానే అన్నాడు ప్రకాశరావ్.

"మా ఇంటికి రావా కృష్ణా! ... మామయ్య చెప్ప లేదనా?" అడగలేక అడగలేక అడిగింది. కాత్యాయినికి తెలుసు భర్తకి యిష్టంలేదని. కృష్ణని యింటికి తీసుకెళ్ళిపోతే నాలుగురోజులు సణిగి తనేవూరుకొంటాడని ధైర్యం చేసింది- కృష్ణని తీసుకెళ్ళడానికి.

"నువ్వు ఈ యింటి ఆడపడుచువి - నీమీద భారం పెట్టడం అమ్మా, నాన్నగార్లకి యిష్టం వుంటుందా,

అత్తయ్యా! శలవులకి తప్పకుండా వస్తాను - నేను బాగా చదువుకోవాలని అమ్మ కోరిక - అసలు ఎక్కడికీ వెళ్ళాలని లేదు - కాని, ఒంటరిగా వుండి చదవలేనని..."

"ఒరే, ఈ ఆరునెలల్లో ఎంత ఎదిగిపోయావురా! విత్తనం ఒకచోట వేస్తే — మొక్కొకటి మొలుస్తుందాని - ఆ తల్లి గుణమే నీకూ అబ్బిందిరా! ఎక్కడున్నా నూరేళ్ళు సుఖంగా వుండు" అంటూ కృష్ణ చెంపలు నిమిరి ముద్దుపెట్టుకుంది.

* * *

ఒక్కడూ వుండలేక మేనమామతో, మేనత్తతో బయలుదేరాడేగాని తీరా ఆ వూరు దగ్గరపడుతోంటే ఏదో తెలియని భయం పట్టుకుంది కృష్ణకి. 'తను యింకోచోట వుండ గలడా? అక్కడే వుండిపోవలసిందేమో!' అనుకొన్నాడు.

ప్రకాశరావ్ పిల్లలు కృష్ణని కొత్తగా కుతూహలంగా చూశారు. అప్పుడు కృష్ణ తండ్రితో వచ్చినప్పుడు పిల్లలు శలవులకి తాతగారింటికి వెళ్ళారు.

"అలా దూర దూరంగా వుంటారేమిటి? బావ! మర్చిపోయారా? యిలా రండి" అని వాళ్ళని పిలిచి, "యిది పెద్దపిల్ల రాధిక, వీడు రాజేష్, వీడు సతీష్" అంటూ ముగ్గురు పిల్లలని పరిచయం చేశాడు.

ఆ ఇంట్లో భోజనం చేయాలంటే మొహమాటం - ఎవరితోనన్నా మాట్లాడాలంటే భయం -

ఇలా వారంరోజులు గడిచిపోయినాయి.

రాజేష్, సతీష్ గదిలోనే కృష్ణకి పక్కవేశారు. కృష్ణని

ఒక్కడిని ఓ గదిలో పడుకోమంటే అసలే దిగులుగావున్న కృష్ణ భయపడతాడని అలా చేశారు. రాధిక పక్క వేరే గదిలోకి మారింది. రాధిక, రాజేష్, సతీష్ ముగ్గురూ ఓ గదిలోనే పడుకుంటారు. ఇప్పుడు రాధిక ఒక్కతీ వేరే గదిలో పడుకోలేక సతీష్‌ని తన గదిలో పడుకోబెట్టుకుంది.

ఆ రోజు స్కూల్ ఫైనల్ రిజల్ట్సు వచ్చాయి.

ప్రకాశరావ్ పేపరు తెచ్చి, "కృష్ణా! నీ నెంబరెంత?" అని అడిగాడు.

కృష్ణ చెప్పాడు.

ప్రకాశరావ్ నెంబరు చూసి, "కంగ్రాచ్యులేషన్స్ కృష్ణా! సెకండ్ క్లాస్" అన్నాడు.

"థ్యాంక్యూ" అనేసి లోపలకి వెళ్ళిపోయాడు కృష్ణ.

బయటకి చూస్తూ చాలాసేపు కిటికీ దగ్గర నిలబడ్డాడు.

ఎవరిదో భుజంమీద చెయి పడడంతో ఉలికిపడి ఇటు తిరిగాడు.

కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి - పెదాలు అదురుతున్నాయి.

"కృష్ణా! నువ్విలా వుండడం అమ్మ మనసు సహిస్తుందా? నువ్వు ధైర్యంగా, సంతోషంగా వుంటేనే అమ్మ ఏ లోకంలో వున్నా నిశ్చింతగా వుంటుంది. వెళ్ళి స్నానం చేసిరా" అన్నాడు ప్రకాశరావు. రాజేష్, సతీష్ దూరంగా నిలబడి ఇటే చూస్తున్నారు.

కృష్ణ గబగబా బాత్రూంలోకి వెళ్ళిపోయాడు.

ఆ రోజు పార్వతి సేమ్యా పరవాన్నం చేసి, బజ్జీలు చేసింది.

ప్రకాశరావు సినిమా ప్రోగ్రాం పెట్టాడు.

ఎవరు ఎంత నవ్వించినా కృష్ణ మనసు మూగగా రోధిస్తూనే వుంది.

కృష్ణ అలావుంటే అందరితో బాటు రాధికకి కూడా ఎంతో బాధనిపించింది. అంతవరకూ అతనికి దూరదూరంగా-కొత్తగా తిరుగున్న రాధిక ఆ రోజు నుండి కృష్ణతో మాటలో మాట కలపసాగింది.

ఆ రాత్రి కృష్ణ పడుకొన్నాడేగాని కంటిమీద కును కన్నది రాలేదు.

ప్రకాశరావు ఉత్సాహంగా కాలేజీలో జేర్పించడం గురించి మాట్లాడుతోంటే అప్పుడే ఆ విషయం గురించి కృష్ణ చాలా దిగులుపడ్డాడు.

'చదువుకోవాలని ఉత్సహంగా అనుకొన్నాడేగాని, పూర్తిగా - కట్టు బట్టల దగ్గర నుండి పెన్ను, ఇంకు వరకూ తను వీళ్ళమీదే ఆధారపడి ఉన్నానన్న జ్ఞానమే లేక పోయిందేం ? ఒక మనిషిని పోషించటమే గాక ఖర్చులన్నీ భరించి చదువు చెప్పించడం మాటలా !' అనుకోసాగాడు.

కృష్ణకి ఏ తెల్లవారుజామునో నిద్రపట్టింది.

తల్లి జరీ అంచు చీర కట్టుకుని ఇల్లంతా హడవిడిగా తిరుగుతోంది. నౌకర్లకి ఏవేవో పురమాయిస్తూ తండ్రిని

కూడా తెమలమని తొందర చేస్తోంది. - ఓ పక్క గుమ్మాలకి తోరణాలు కడుతున్నారు. తల్లి ఓ పెద్ద టేబుల్ మీద, పెద్ద పెద్ద పువ్వులున్న బట్టపరిచి, రకరకాల పూలగుత్తులు అందంగా అమర్చింది. ఓ పెద్ద పళ్ళెంనిండా పళ్ళు తీసుకొచ్చి పెట్టింది. తండ్రి పెద్ద పెద్ద పుస్తకాలు తీసుకొచ్చి, తల్లి పెట్టమన్నచోట పెట్టాడు. బ్రాహ్మడు చేతిలో పంచాంగంతో వచ్చి అక్కడ నిలబడ్డాడు. తల్లి పురోహితుడితో ఏదో చేస్తోంది.

తల్లి రమ్మని పిలిచినా తను సిగ్గుపడి దూరంగా వెళ్ళి పోతున్నాడు.

తల్లి దగ్గరగా వచ్చి చేయి పట్టుకుంది—

కృష్ణ ఉలికిపడి లేచాడు.

"నేనే పడుకో! వర్షం పడుతోంది. దుప్పటి కప్పుదామని వచ్చాను" అన్నాడు ప్రకాశరావు, కృష్ణకి దుప్పటి కప్పుతూ.

కృష్ణకి ఇంక నిద్దరా లేదు. తల్లి నిజంగా చెయ్యి పట్టుకున్నట్టే అనిపించింది. ఇంకా తల్లి ఏం చేసేదో! కల పాడు చేసిన మామయ్య మీద మొదట కోపం వచ్చింది. కాని వెంటనే అనుకొన్నాడు. అమ్మ తర్వాత అమ్మలా అభిమానించేది మామయ్య ఒక్కడే!

కృష్ణ ఆరోజునుండి తల్లి జరీ అంచు చీర కట్టుకుని యిల్లంతా ఎంతో హడావిడిగా అలా తిరుగుతున్నట్టే వూహించుకొనేవాడు. దాంతో మనసుకి ఎంతో వూరటగా అనిపించేది.

మర్నాడు ప్రకాశరావు "ఏం చదవాలను కొంటు న్నావు - ఏ గ్రూప్ తీసుకోవాలనుకొంటున్నావు" అని అడిగి నప్పుడు "నాకు చదవాలని లేదు మామయ్యా" అన్నాడు.

"అదేమిట్రా" అంటూ తెల్లబోయాడు. "ఏం ఎందుకు చదవవు? నీకు ఇక్కడ బాగాలేదా? ఎవరయినా ఏదయినా అన్నారా?" అని ఆత్రుతగా అడిగాడు

"అబ్బే! నన్ను ఎవరూ ఏమీ అనలేదు - ఎందుకో నాకు చదవాలని లేదు - ఏదేనా పని చేయాలని వుంది"... ... నేలచూపులు చూస్తూ అన్నాడు.

"ఏమిట్రా కృష్ణా" అంటూ కృష్ణ పక్కన కూర్చు న్నాడు ప్రకాశరావు.

"నీకు ఉద్యోగం చేసేవయసు వచ్చేసిందనుకొంటు న్నావా? నాకన్న పొడుగున్నంతమాత్రన.. గడ్డం, మీసం వస్తున్నంతమాత్రాన పెద్దవాడ్ని అయిపోయావను కొంటు న్నావా?" అంటూ క్షణం ఆగి, "కృష్ణా నిన్న నీకు ఏమని చెప్పాను? నువ్వు ధైర్యంగా వుండి - ఉత్సాహంతో చదువు కొంటూ వృద్ధిలోకి వస్తే అమ్మానాన్నల ఆత్మలు సంతో షిస్తాయి. అమ్మకి నువ్వు బాగా చదువుకుని వృద్ధిలోకిరావాలని కదా కోరుకుంది, ఇంక నువ్వు ఏ విషయాల గురించి ఆలో చించకూడదు. అమ్మా నాన్నల అభయహస్తాలు నీకు ఎప్పుడూ అండగా ఉంటాయి. నువ్వు కార్యదీక్షతో ముందుకి సాగిపోవడమే! 'చదువుకోను' అన్నమాట ఇంక నీ నోటి వెంట ఇంక నేను వినకూడదు. మీ బాబయ్యలు అందరూ కలిసి చదివిస్తానంటే నేను తీసుకొచ్చాను. ఇప్పుడు నువ్వు

చదువుకోనని - ఏదయినా పనిచేస్తానంటే వాళ్ళంతా ఏమంటారు? మేము చదివిస్తానంటే గొప్పగా తీసుకెళ్ళాడు- ఏమీ చేయలేక పనిలో ఇరికించాడు. అని నిందవేస్తే నేను భరించగలనా? అయినా అమ్మ నన్ను క్షమిస్తుందా ?... నిన్న యీ ఇంటికి తీసుకొచ్చిన క్షణంనించి అమ్మా, నాన్నా, మామయ్యా - నీకు అన్నీ నేనే అనుకొన్నారా......"

"మామయ్యా!" ఖంగారుగా అన్నాడు కృష్ణ మేన మామ గొంతులో బాధని గ్రహించి.

"నువు చెప్పినట్టే చదువుకొంటాను మామయ్యా!" అన్నాడు చివరికి.

* * *

కృష్ణకి వేరేగది ఏర్పాటు చేశారు. అతని మంచం, పెట్టె - అతనికి ఓ టేబుల్, కుర్చీ ఏ లోటు లేకుండా అమర్చారు.

మేనమామతోటి - రాజేష్, సతీష్‌లతో మాట్లాడినట్టు మేనత్తతో, రాధికతో మాట్లాడడు.

పార్వతి కృష్ణని ఏదో ఒకటి మాట్లాడిస్తూనే వుంటుంది. రాధిక మాత్రం దూర దూరంగానే తిరుగుతోంది అసలు ఆ ముగ్గురిపిల్లలలోకి రాధికదే అల్లరి హడవిడీను. కృష్ణకి తల్లి, తండ్రి కూడా పోయారని - కృష్ణ అదోలా వుండడంతో చనువుగా మాట్లాడించడం లేదు.

స్కూళ్ళు తెరవడంతో రాజేష్, సతీష్ కృష్ణ చేత పాఠాలు చెప్పించుకొనేవారు.

ఓ రోజు రాధిక అంది, "ఒరేయ్ సతీష్! మీ మేస్టారు నాకూడా చదువు చెప్తారేమో! అడుగు."

సతీష్ వచ్చి కృష్ణని అడిగాడు.

మొదట తెల్లబోయిన కృష్ణ "ఎందుకు చెప్పను?" అన్నాడు.

వాడువచ్చి రాధికకి చెప్పాడు.

"లెక్కలు చెప్పగలడేమో అడుగు" అంది.

వాడు మళ్ళీ పరుగెట్టి — వెంటనే తిరిగొచ్చి, "ఏం కావాలన్నా చెబుతాడుట" అన్నాడు.

"ఎప్పుడు చెబుతాడో అడుగు" అంది.

సతీష్‌వచ్చి అడగ్గానే 'ఏమిటీ అమ్మాయి' అనుకుని "తనిష్టం అనిచెప్పు" అన్నాడు.

సతీష్ రాధికకి కృష్ణ అన్నమాట చెప్పి తల్లిదగ్గర కొచ్చి జరిగిందంతా చెప్పాడు.

పార్వతి రాధికని పిలిచి మందలించింది. "కావలి స్తేపాఠం చెప్పించుకోవాలిగాని, ఏమిటా తింగరివేషాలు? ఆ అబ్బాయి ఏమనుకొంటాడు? అసలే మనసు బాగుండకవున్నాడు" అంది.

రాధిక లెక్కలు చెప్పించుకోవడానికి రాలేదుగాని, కృష్ణని భోజనంచేసివచ్చేసరికి కృష్ణ నోటుబుక్కుమీద చిన్న కాగితం మడతవుంది.

కృష్ణ నోటుబుక్కు తీసుకొంటూ ఆ కాగితం మడత చూశాడు. ఏమిటా అని మడతవిప్పి చూశాడు. అది రాజేష్, సతీష్‌ల హాండ్ రైటింగే కాదు. అందులో ఇలావుంది - "నిన్ను మాట్లాడించాలని అలా చేశాను - ఏమీ అనుకోవద్దు."

'ఇది రాధిక రాసిందే! ఇదేమిటి ఇలారాసింది? తనేమను

కొన్నాడని !' అని అనుకొంటుండగానే, "నాన్నగారు రమ్మంటున్నారు" అని వినపడేసరికి తలఎత్తాడు - రాధిక నిలబడివుంది.

"నువ్వేనా ఇది రాసింది ?" ధైర్యంచేసి అడిగేశాడు.

'అవును' అన్నట్లు తలవూపింది. కళ్ళు ఎర్రగా వుబ్బి వున్నాయి.

"ఇలా ఎందుకు రాశావ్ ! నేను ఏమనుకొంటాను ?"

"నువ్వు అదోలా వున్నావు - నువు మాట్లాడటం లేదని—నిన్ను మాట్లాడించాలని అలా చేశాను. అమ్మ నన్ను తిట్టింది - అది తప్పేమో—నువ్వు ఏమనుకొన్నావోనని..." తల దించుకొని - ఓణీకొంగు వేలికి మెలిపెడుతూ నెమ్మదిగా చెప్పింది.

"నువ్వుకూడా చదువు చెప్పించుకో చెప్తాను. నేను ఏమీ అనుకోలేదు. కాని, ఇంకెప్పుడూ ఇలా రాయద్దు" చివరి మాటంటూ ఆ కాగితాన్ని ముక్కలుకింద చింపేశాడు.

నాలుగు రోజులు కాస్త కొత్తగా బెరుగ్గా మసిలినా తర్వాత రాధిక అల్లరికీ, ఆగడాలకి అంతులేదు. తల్లి అప్పుడప్పుడు మందలిస్తూ వుండేది.

కృష్ణ ఎవరికీ చెప్పకుండా ఏడో తరగతి ఎనిమిదో తరగతి పిల్లలకి ప్రయివేట్లు చెప్పడానికి ఓ స్నేహితుడిద్వారా ఒప్పుకున్నాడు. అన్నింటికి మేనమామమీద ఆధారపడడానికి కృష్ణకి మనస్కరించలేదు.

* * *

దేనికోసం ఆగని కాలచక్రం గిర్రున తిరుగుతోంది.

కృష్ణమోహన్ ఇంజనీరింగ్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాడు.

మేనమామకి ఆశ్రే భారంకాకుండా స్కాలర్‌షిప్పాతే గాకుండా రెండుమూడు ప్రయివేట్లుకూడా చెప్పుకుని రోజులు సాఫీగానే గడిపాడు.

ఆనాడు చదువు చెప్పిస్తామన్న బాబయ్యాలు కృష్ణ యిక్కడికి వచ్చాక ఒకసారి రమ్మనడంగాని - ఏం చదువు తున్నాడో తెలుసుకోవడంగాని ఎవరూ చేయలేదు. మొదట్లో రెండు మూడు ఉత్తరాలు ప్రకాశరావే రాశాడు. వాటికి రంగడు మాత్రం మొదటి ఉత్తరానికి జవాబు ఇచ్చాడు. తర్వాత అతనూ రాయలేదు. ఇంక ప్రకాశరావు కూడా ఎవరికీ వుత్తరాలు రాయలేదు.

కాత్యాయిని మాత్రం అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూండేది శలవలకి రమ్మని.

కృష్ణ వేసంకాలం శలవులకి వెళ్ళి వారం రోజులు వుండి వచ్చేవాడు.

కాత్యాయిని ఎంతో సంతోషపడేది. అభిమానంగా ఆహ్వానించేది. ఆమె భర్తకి భయంగావుండి, కృష్ణని ముభావంగానే పలకరించేవాడు. కృష్ణ ఓ నాలుగు రోజులుండడానికి ఆయనకి అభ్యంతరం వుండేదికాదు. తను కాస్త మంచిగా మాట్లాడితే కృష్ణ ఎక్కడవుండిపోతాడో - భార్య అతన్ని ఎక్కడ వుండిపొమ్మంటుందోనని ముభావంగానే వుండే వాడు.

ఒకసారి కృష్ణ వెళ్తూ రాజేష్‌ని, సతీష్‌ని తీసుకెళ్తానని అన్నాడు మేనమామతో.

యిది విన్న రాధిక కృష్ణతో అంది "అంతేలే! నన్నెందుకు రమ్మంటావ్" బుంగమూతి పెట్టింది.

కృష్ణ తెల్లబోయాడు. తర్వాత నెమ్మదిగా అన్నాడు. "వస్తే తీసుకెళ్తాను. మీ అమ్మానాన్నని అడుగు."

"నువ్వే అడుగు" అంది.

"నేనా !?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఆఁ, నువ్వే ! ఏం, భయమా అడగడానికి ?" అంది.

'అబ్బ ! యీ రాధిక ప్రతీదానికి చిక్కుముళ్ళు వేస్తూనే వుంటుంది.' అని మనసులోనే విసుక్కున్నాడు. తను ఎలా అడుగుతాడు. తను అడగకపోతే పిరికివాడు అంటుంది. కృష్ణకి ఏం చేయాలో తోచలేదు. కాసేపు ఆలోచించాడు. తర్వాత మెల్లగా రాజేష్‌ని పిలిచి, "రాధికని కూడా పంపుతారేమో మీ అమ్మని అడుగు" అన్నాడు. అతని గుండెలు దడదడలాడాయి.

ఇదివిన్న రాధిక, వెంటనే అంది "నేను అడుగుతాలే! మధ్యన వాడెందుకు ? యీ మాట నాతోనే చెబితేపోలా !" అంటూ తల్లి దగ్గర కెళ్ళింది. "అమ్మా ! బావ నన్నుకూడా సరదాగా వాళ్ళ అత్తయ్యగారింటికి రమ్మంటున్నాడు" అంది.

కృష్ణ ఆశ్చర్యంగా నోరు వెళ్ళబెట్టి చూశాడు రాధికకేసి.

రాధిక నాలుక బయటపెట్టి వెక్కిరించింది.

'అసాధ్యురాలు' అనుకున్నాడు.

రాధిక ఎన్ని కొంటెపనులు చేసినా కృష్ణ మౌనంగానే

వుండిపోతాడు తన చదువేదో - తన పనేదో ఆ ధోరణి లోనే వుంటాడు.

పార్వతి భర్తకి కృష్ణ ఇలా అన్నాడుట అని చెప్పి, "అదెందుకు?" అంది.

"పోనీలే! సరదా పడుతున్నారు - రెండు రోజుల్లో వచ్చేస్తారు." అన్నాడు ప్రకాశరావు.

సరిగ్గా పిళ్ళు వెళ్ళేసరికి రామబ్రహ్మం అక్కడ వున్నాడు.

రామబ్రహ్మం కృష్ణని చూడగానే "ఏంవోయ్! ఏం చదువుతున్నావ్? ఎలా సాగుతోంది చదువు?" అంటూ కనుబొమ్మలు ఎగరేశాడు.

రామబ్రహ్మన్ని చూస్తూనే కృష్ణ మనసు ముడుచుకు పోయింది. అతని పలకరింపులో ఆప్యాయత కనపడదు. ప్రతీ మాటలోనూ తనే పెద్ద తెలివయిన వాడని - తను ఏ పని చేసినా ఒకరు వేలెత్తి చూపే సావకాశం రాదన్నట్లుగా మాట్లాడతాడు. ఎదుటివారిని ఏదేనా అడిగినప్పుడు కూడా ఎదుటి వ్యక్తిని తికమక పెట్టి ఖంగారుని కలగజేస్తాడు.

రాధికని వాళ్ళనికూడా తీసుకొచ్చినందుకు కాత్యాయిని చాలా సంతోషించింది. అదివరకు మూడుసార్లు చెప్పింది యీసారి వచ్చినప్పుడు వాళ్ళనికూడా తీసుకురాలని. అందుకే కృష్ణ రాజేష్ వాళ్ళని ప్రయాణం చేశాడు.

తర్వాత కృష్ణ నిసేలా రామబ్రహ్మం కాత్యాయినితో అన్నాడు, "ఏమో అనుకొన్నాను - ప్రకాశరావు తెలివి

6)

తక్కువవాడు కాడు. పెద్దఎత్తులోనే కృష్ణని తీసుకు వెళ్ళాడన్న మాట."

మొదట అర్థంచేసుకోలేకపోయింది కాత్యాయని. అన్నగారి మాటలు అర్థంఅయినాక అంది, "అలా ఎందుకు అనుకోవాలన్నయ్యా! ఆ వుద్దేశ్యమే వుంటే - ఉన్న అన్నగార్లకి వున్నారు ఆడపిల్లలు. వాళ్ళు తీసుకెళ్ళారా? అతని మనసు మంచిది. వదిన అంటే అతనికి ఎంతో అభిమానం. ఆ అభిమానంతోనే అతను కృష్ణని తీసుకెళ్ళి - ఆ భారం వహించాడు."

"ఇతనికి వున్న ముందుచూపు వున్నవాళ్ళకి లేదు. మొత్తానికి నరాంతకుడు" తన అంచనా తప్పుకాదన్నట్లు చెల్లెలి మాటని కొట్టిపారేశాడు.

ఇంక కాత్యాయిని తర్కించలేదు.

పినతండ్రి మాటకి అసహ్యం పుట్టింది కృష్ణకి. రాధిక వాళ్ళు యీ మాటలు విన్నారేమోనని భయపడ్డాడు. వాళ్ళు కారమ్స్ ఆడుకొంటున్నారు. 'హమ్మయ్య' అనుకొన్నాడు.

మేనత్త ఎంత ప్రతిమాలుతున్నా వినకుండా మర్నాడే రాధికని వాళ్ళని తీసుకుని తిరుగుప్రయాణమయ్యాడు.

అప్పటినుండి అతనికి అప్పుడప్పుడు అనిపించేది, నిజంగా వాళ్ళు ఆ అభిప్రాయంతోనే తీసుకొచ్చారా అని. ఎంత తరిచి చూసినా వాళ్ళలో అలాంటి ఛాయలేమీ కనపడ లేదు. వాళ్ళ అభిమానాన్ని తను అంత అర్థం చేసుకోలేడా? బాబయ్య గుణం తెలియంది ఎవరికి. అనవసరంగా తన మనసు పాడుచేసుకుని వాళ్ళని శంకించటం పొరపాటు.

రాధిక ఎంత దగ్గరకి వస్తున్నా కృష్ణ, తను ఒకచోట - ఒకరి అండన తను ఇంతవాడయ్యాడన్న జ్ఞానంలో చాలా జాగ్రత్తగా వుండేవాడు.

రాధిక స్నేహితురాలి పెళ్ళికని వెళ్ళి నాలుగురోజులు రాకపోయేసరికి అతని మనసు ఒడ్డునపడ్డ చేపలా గిలగిలకొట్టు కుంది. రాధిక తనకి ఎంతదగ్గరయిందో అప్పుడుగాని గ్రహిం చుకోలేక పోయాడు.

అప్పటినుండి రాధికకి మరింత దూరంగా మసల సాగాడు.

అప్పటివరకూ అతని నిర్లిప్తభావాన్ని - మొహ మాటాన్ని మరోలా భావించుకొన్న రాధిక తను నాలుగు రోజులు తర్వాత కనిపిస్తే ఆత్రంగా ఎదురొచ్చేదిపోయి మరింత దూరంగా మసలటంతో తనంటే అతనికి యిదేం లేదనుకుంది. రాధిక మనసు దెబ్బతిన్నట్టయింది.

నాలుగురోజులు అతని కంటపడకుండా తిరిగింది.

కనీసం దూర దూరంగాకూడా రాధిక కనపడకపోయే సరికి కృష్ణ మరింత బాధపడ్డాడు. ఏమీ తోచకుండా - మనసంతా వెల్తిగా అయిపోయింది.

ఓ రోజు రాధిక కనపడినప్పుడు "ఒంట్లో బాగుండ లేదా రాధికా!" అని అడిగాడు.

"ఒంట్లో బాగుండకేం రోగం? శుభ్రంగా వుంది." అంది కోపాన్ని అణచుకొంటూ. కళ్ళల్లో నీళ్ళు తిరగ బోయాయి. అతిప్రయత్నంమీద నిగ్రహించుకొంది.

రాధిక ఎలాగో వుండడంతో ఇంకేం అనాలో అర్థం కాలేదు కృష్ణకి. మౌనంగా నిలబడిపోయాడు.

అతను చొరవగా ఇంకేమయినా మాట్లాడితే బాగుండనని రాధిక అనుకుంది.

రాధిక ఇంకేమీ మాట్లాడకపోయేసరికి వెనుదిరిగి మెల్లగా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

రాధికకి ఒళ్ళు మండిపోయింది.

'శుద్ధ మొద్దు - ఒట్టి బుద్ధావతారం' కసిగా అనుకుని విసవిసా తన గదిలోకి పోయింది. తలపోటు అని వంకపెట్టి రాత్రి. భోజనం చేయలేదు - మర్నాడు నిజంగానే తల నొప్పితో లేవలేకపోయింది.

రాధికకి ఒంట్లో బాగుండలేదని తెలిసి కృష్ణ నిలవలేక పోయాడు. ఎవరూ లేనప్పుడు చూసి రాధికని పలకరించాడు ఎలా వుందని.

"తలనొప్పి వస్తే ఎలా వుంటుంది?" అని అడిగింది. 'అసలు కృష్ణకి తనసంటే ఎలాంటి అభిప్రాయం వుందో తెలుసు కోవాలి' అనుకుంది.

ఇదేం ప్రశ్న - పిచ్చిప్రశ్న అన్నట్టు చూశాడు కృష్ణ.

"మాట్లాడవేం?" రెట్టించింది.

"అదేం ప్రశ్న రాధా! తలనొప్పి వస్తే బాధగా వుంటుంది. అది నచ్చినదానికి నీకు తెలియదా? ఇప్పుడు ఎలావుందని అడుగుతున్నాను" మామూలుగానే అన్నాడు.

రాధిక అతని కళ్ళల్లోకి చూసింది. అతని కళ్ళు స్నేహ పూరితంగానే వున్నాయి. ముఖం అమాయకంగానే వుంది. 'అమ్మో! యితన్ని ఒక పట్టాన పట్టుకోలేం! దొంగ! ఏమీ ఎరుగనట్టు బుజ్జి పాపాయిలా ఎలా నిలబడ్డాడో! అసలు యింత నిగ్రహం యితనికి ఎలా వచ్చిందబ్బా' అని ఆశ్చర్యపోయింది.

"అంతా తగ్గిపోయింది" అంది ఎంతో అమాయకంగా ముఖం పెట్టి.

కృష్ణ రాధిక కళ్ళల్లోకి ఓసారి చూసి "సరే పడుకో" అని వెళ్ళిపోయాడు.

తనంటే కృష్ణకి అభిమానం వుందని గ్రహించి, అంత వరకూ అతనిమీద వుండే కోపాన్ని మర్చిపోయింది. అప్పటి నుండి అతన్ని ఆట పట్టించసాగింది.

రాధిక ఎంత చనువు చూపించినా కృష్ణ అది గ్రహించనట్టే మసులుకొనేవాడు.

పార్వతి చెల్లెలు వాళ్ళు వచ్చారు.

ఓ రోజు అందరూ కబుర్లు చెప్పుకొంటూ అందరూ హాల్లో కూర్చున్నారు.

పార్వతి చెల్లెలు పిల్లలకి జడలు వేస్తోంది. ఆ పిల్లల తల్లో పుట్లల్లా వున్నాయి పేలు. ఆవిడ పేలుతీసి నేలనేసి చిటుకు చిటుకు కుక్కుతోంది.

"చంపకు అవతల పారేయ్ పిన్నీ!" అంది రాధిక.

"ఒకటా, రెండా పారేయడానికి. ఎన్నిసార్లు తిరగను?

ఎంత చూసినా మళ్ళీ సగ్గూలును నెక్లేసనిపించలేదు" విసుగ్గా అందావిడ.

సతీష్ లోపలకి వెళ్ళి చిన్న ప్లాస్టిక్ భరిణె తీసు కొచ్చాడు. "అన్నీ దీంట్లో పోసేయి. తర్వాత పారేయచ్చు" అన్నాడు. వాళ్ళకి అలవాటులేక ఏమిటోలా వుంది.

అలాగే చూస్తూ కూర్చున్న రాధికకి ఓ చిలిపి ఆలోచన తట్టింది. వెంటనే అది అమల్లో పెట్టడానికి లేచింది.

లేచి కృష్ణ పడుకున్న గదికేసి వెళ్ళి ఏం చేస్తున్నాడో నని చూసింది. కృష్ణ మంచి నిద్రలో వున్నాడు.

పరీక్షలు అయిపోయినాయి - నిశ్చింతగా నిద్ర పోతున్నాడు.

మళ్ళీ రాధిక హాల్లోకి వచ్చింది. భరిణె తీసుకుని బయటకి వచ్చింది. అవి పారేస్తూ రెండు పేలని తీసుకుని, తిరిగి భరిణె వాళ్ళ పిన్నికి యిచ్చి నెమ్మదిగా కృష్ణ గదిలోకి వచ్చింది.

నెమ్మదిగా అతని తలవేపుకి వెళ్ళింది.

కృష్ణ మంచి నిద్రలో వున్నాడు.

తేలిగ్గా వూపిరి పీల్చుకుని - అవి అతని తలలో వేసేసి గబగబా ఎవర్నో తరుముకొస్తున్నట్టు యివతలకి వచ్చేసింది.

ఎప్పుడెప్పుడు కృష్ణ లేస్తాడా - ఎప్పుడెప్పుడు తల కంపరంగా గోక్కుంటాడా అని ఆ సీనుని వూహించుకుని నవ్వుకుంది.

"ఏమిటే రాధికా, నీలో నువ్వే నవ్వుకొంటున్నావ్?" అని అడిగింది పిన్ని.

"అబ్బే! ఏం లేదు" అని యివతలకి వచ్చేసింది రాధిక.

పార్వతి టిఫిన్ చేసింది. రాధిక అందరికీ ప్లేట్లలో సర్ది యిస్తోంది.

అందరికీ యిచ్చాక కృష్ణకి కూడా ప్లేటులో పెట్టి అతని గదిలోకి తీసుకొచ్చింది.

కృష్ణ అద్దంముందు నిలబడి తల దువ్వుకొంటున్నాడు.

రాధిక రాబోయే నవ్వుని ఆపుకొంటూ "ఎంతసేపు దువ్వుతావు బాబు! ఆడవాళ్ళే నయం బారెడు జుట్టుని రెండు నిముషాల్లో దువ్వి జడ వేసుకొంటారు" అంది.

కృష్ణ రాధిక మాటలు వినిపించుకొన్నట్లు లేదు, తలని యింకా గట్టిగా అలా దువ్వుకొంటూనే వున్నాడు.

రాధిక టిఫిన్ ప్లేటు టేబుల్ మీద పెట్టి లోపలకి వెళ్ళి మంచినీళ్ళ గ్లాసుతో తిరిగి వచ్చేసరికి కృష్ణ యింకా క్రాఫ్ దువ్వుకొంటూనే వున్నాడు. అప్పుడప్పుడు చూపుడువేలితో తల గోక్కుంటున్నాడు.

"ఇంకా అవలేదూ? నీ క్రాఫ్ చాలా చూడ ముచ్చటగానే వుందిగాని, ముందు యీ ఫలహారం సేవించు" అంది నవ్వు ఆపుకొంటూ.

"అక్కడ పెట్టి వెళ్ళు" అన్నాడు యిటు తిరక్కుండానే.

"సర్లే, వెళతాను. ఇక్కడ కూర్చోవడానికి రాలేదు. యిందాకటినుండి చూస్తున్నాను. ఏమిటి తలని అలా చెక్క

స్తున్నావ్" అంది. అతని అవస్థ చూస్తుంటే చచ్చే నవ్వు వస్తుంది.

"నీ మొహం! రెండు సార్లు ఎక్కువ నవ్వుకొంటే తల చెక్కడమేనేమిటి" అన్నాడు దువ్వెన గూట్లో పెట్టి యిటు తిరుగుతూ.

మొహంమీద ఏదో పాకినట్టు అయి చేత్తో రాసుకున్నాడు.

పాపం తను నేస్తాలు కనపడక - ఆ గ్రాఫ్‌లో ఇమడలేక ఓ పేను ఎలాగయితేనేం చెవివరకూ వచ్చింది.

రాధిక ఆశ్చర్యంగా చూస్తూ కృష్ణ దగ్గరగా వచ్చింది.

"ఏమిటి, ఏమయింది" అన్నాడు రాధిక అలా ఆశ్చర్యంగా చూస్తూ దగ్గరకి రావడంతో ఏమిటో అర్థంకాక.

రాధిక కళ్ళు వెడల్పు చేసుకుని దేన్నో వింతవస్తువుని చూస్తున్నంత ఆశ్చర్యంగా చూడసాగింది.

"ఏమిటి రాధా! ఏమిటా చూడ్డం?" అన్నాడు ఏమిటో అర్థంకాక.

"నిన్నేం కామిలే!" అంటూ కృష్ణ చెవిదగ్గరున్న దొంగలాంటి పేనుని తీసింది. తీయకుండా అలా వెంటనే తీయలేదు. వేళ్ళతో మెడమీద సున్నితంగా రాసి మరీ తీసింది.

"ఏమిటి" అన్నాడు. అతనికి చక్కిలిగింతలు పెట్టినట్టుగా వుంది.

"పేను! నీ తల్లో పేలా!?" ఎంతో ఆశ్చర్యం నటించింది.

కృష్ణ అదిరిపడ్డాడు. తర్వాత అన్నాడు "నీకేం మతి పోయిందా? నా తల్లో పేలేమిటి? అసలు అవి ఎలా వుంటాయో కూడా నాకు తెలియదు..."

"ఆహా అలాగా! సరే, యిప్పుడు చూడు" అంటూ అతని చెయి తీసి పెట్టింది.

నిజంగానే! ఒకటికాదు; రెండు -

కృష్ణ ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"అప్పు తల్లో - నా తలలో ఒక్కటంటే ఒక్కటి లేదు. ఏదో మంచాలకి నల్లులు పట్టినా తెలుసుగాని... యిలా..."

రాధిక యింకా ఏదో అంటోంది.

కృష్ణ కళ్ళముందు పార్వతి చెల్లెలు పిల్లలు రెండు చేతులతోటి తల బరుక్కోవడం శీను కళ్ళముందు మెదిలింది-

రాధిక కేసి చూశాడు -

ఆ కళ్ళల్లో కొంటెతనం - పెదాలు బిగించి అతి ప్రయత్నం మీద నవ్వు ఆపుకోవడం - యీ కొంటె కోణంగి పనే ఇది అని గ్రహించడానికి కృష్ణకి ఆట్టే సేపు పట్టలేదు.

"యివి నీ తలలోవే! వీటికి నీ పోలికలు వున్నాయి చూడు" అన్నాడు.

"ఇంకో దానికి నీ పోలికవుండేమో చూడు" అంది వెంటనే.

"నిజం చెప్పు! యిది నీ పనేకదూ! నిజం చెప్పక

పోయావంటే నీ నెత్తిమీద వేసేస్తాను" బెదిరింపుగా అన్నాడు.

రాధిక "నాకేం తెలియదు" అంటూ వచ్చేయబోయింది.

కృష్ణ చటుక్కున రాధిక చెయి పట్టుకోబోయాడు. చెయ్యి పట్టు తప్పి, కొంగు చేతికి చిక్కింది.

"వదులు" అంటూ కొంగు విడిపించుకోవడానికి దగ్గరకి వచ్చింది.

రాధిక వెళ్ళకుండా జబ్బపట్టుకుంటూ, "నీ పనేమిటో! చెప్పందే నిన్ను వదిలేది లేదు - ఆ తర్వాత నీ యిష్టం" అన్నాడు.

"ఏ ఫ్రెండ్సు దగ్గర నుండో - నిన్ను వదలలేక వచ్చి వుంటాయి" అంది నవ్వుతూ.

"నువ్వు మర్యాదగా చెప్పవ్" అంటూ రాధికని జబ్బపట్టుకుని గుంజాడు.

కృష్ణని ఆటపట్టించే ధోరణిలో యధాలాపంగా నిలబడ్డ రాధిక అతను అలా గుంజడంలో తూలి, అతని గుండెల దగ్గరగా వచ్చింది.

అతనికి అంత దగ్గరగా నిలబడ్డ రాధిక అతనివేపు చిత్రంగా చూసింది.

అతని కళ్ళల్లో యింతవరకూ ఎప్పుడూ చూడని అదో రకమయిన మెరుపు. యింతవరకూ గుండెల్లో పదిలంగా దాచుకొన్న ఏదో అపురూపమయిన భావం - భావోద్వేగానికి తట్టుకోలేక చిందులేస్తూ కళ్ళల్లోకి విరజిమ్ముతున్నట్టుగా

ఆ కళ్ళల్లో అపురూపమయిన వింత కాంతి. ఆ కాంతి రాను రాను చెంపల మీాంచి పెదాల చివరివరకూ పాకి, అక్కడ మందహాసం చేస్తోంది.

రాధిక గుండెల్లో కోటివీణలు ఒక్కసారిగా శృతి చేసుకొన్నాయి-

యిద్దరి చూపులు కలుసుకున్నాయి -

కృష్ణ కుడిచేయి రాధిక భుజాల చుట్టూ పడింది -

అలా యిద్దరూ ఎంతసేపు వున్నారో గాని హాల్లో గడియారం 'ఠంగ్' మని ఒక గంట కొట్టడంతో యిద్దరూ ఉలికిపడ్డారు.

కృష్ణ చప్పున రాధికని వదిలేసి అటు తిరిగిపోయాడు.

రాధిక గబ గబా యివతలకి వచ్చేసింది.

కృష్ణ పావుగంటలో తయారయిపోయి బయటికి వెళ్ళి-పోయాడు.

అలా వెళ్ళిన కృష్ణ రాత్రి పదిగంటలు దాటాక గాని ఇంటికి రాలేదు.

అతని మనసుని పూర్తిగా తెలుసుకొన్నాననే ఆనందం రాధికని ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆ సంతోషంలో అన్నం సహించలేదు - నిద్రపట్టలేదు.

'తనేమిటి ఇలా తొందరపడ్డాడు - రాధిక నిగ్రహంగా వుండనివ్వదు' రాధిక మీాద కించెత్తు కోపం వచ్చింది. కృష్ణ నిద్రపట్టక అటూ ఇటూ దొర్లసాగాడు.

నాలుగు రోజులు రాధికని తప్పించుకుని తిరిగాడు.

* * *

చదువు అయినాక వారికే కూర్చోవడం అంటే ప్రాణం మీదికి వచ్చినట్టుగా వుంటుంది.

కృష్ణకి చదువుకొన్నన్ని రోజులూ ! ఎప్పుడెప్పుడు చదువు అయిపోతుందా అని ఆత్రుత పడేవాడు. యిప్పుడు చదువు అయినాక ఎప్పుడు ఉద్యోగం దొరుకుతుందా అని నిరీక్షణ –

రెండు మూడుసార్లు యింటర్వ్యూలకి వెళ్ళివచ్చాడు.

కాని, ఉద్యోగం రాలేదు. కృష్ణకి అప్పుడే ఎంతో దిగులుగా అనిపించింది.

"తొందరపడితే ఎలా" అంటాడు ప్రకాశరావు.

* * *

బాగ్‌లో బట్టలు సద్దుకొంటుంటే కాస్త దూరంలో చెంపకి చెయిజేర్చి కృష్ణనే చూస్తూ కూర్చుంది రాధిక.

ఇంకా ఏమయినా మర్చిపోయానా అనుకొంటూ బాగ్ సద్దుతున్నవాడల్లా ఆగి, టేబుల్ కేసి చూశాడు. షేవింగ్ సామగ్రిపెట్టె అక్కడే వుంది. తీసి బాగ్‌లో పెట్టుకొన్నాడు.

అతను అన్నీ సద్దుకుని, జిప్ లాగి బాగ్‌ని టేబుల్ మీద పెట్టేసి వెనక్కి తిరిగేసరికి రాధిక అలాగే కూర్చునుంది.

"ఏం రాధికా, అలా వున్నావ్ ! హుషారుగా లేవు ఏమిటి ?" అన్నాడు దగ్గరకొస్తూ.

"నువ్వు బట్టలు సద్దుకొంటోంటే శ్రద్ధగా చూస్తున్నాను." అంది నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"చూశావ్‌గా! యింకేమయినా కబుర్లు చెప్పు."

"ఎప్పుడూ నేను మాట్లాడటమేనా?"

"నువ్వు బాగా మాట్లాడతావు రాధా! ఆ నేర్పు అందరికీ వుండదు."

"నాతో మాట్లాడటానికి కూడా నేర్పు కావాలంటావా?"

కృష్ణ రాధికకేసి చూశాడు. ఎప్పుడూ అల్లరిగా నవ్వే ఆ కళ్ళు ఎందుకో చాలా దిగులుగా వున్నాయి. ఎప్పుడూ ఏవేవో కొంటె మాటలు మాట్లాడే ఆ పెదవులు అలిగినట్లు ముడుచుకుని వున్నాయి. మనిషికూడా ఏమంత ఉత్సాహంగా కనపడలేదు.

"ఎందుకో - నువ్వు రోజూలా లేవు రాధా! ఏమిటో చెప్పవూ!" ప్రాధేయపడుతున్నట్టుగా అడిగాడు.

'కృష్ణ మనసు అర్థమయినా - తను యింత చనువుగా ప్రవర్తిస్తున్నా కూడాం కృష్ణ అలా దూర దూరంగా వుండటం రాధికకి చాలా బాధగా - కృష్ణమీద కించెత్తు కోపంగా కూడా వుంది. ఇంటర్వ్యూకి వెళ్తున్నాడుకదా దగ్గరగా కూర్చుని నాలుగు మాటలు మాట్లాడకూడదూ!' అనుకొని బాధపడింది.

కృష్ణ -

'దేనికీ తొందర పనికిరాదు - ఎవరి మనసూ కష్టపెట్టకూడదు - అయినా పెద్దవాళ్ళ అభిప్రాయాలు ఎలా వున్నాయో! వాళ్ళ ఆదరణలో తను యింతవాడు అయ్యాడు.

వాళ్ళ అభిప్రాయం తెలుసుకోందే తను ఎలా తొందరపడ తాడు ?" ఇదీ అతని అభిప్రాయం.

"ఎలా వున్నానేమిటి ?" అంది కొంటెగా నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"ఎలాగో – ఎలా అంటే ఏం చెప్పను ? రోజూలా లేవు" అన్నాడు.

రాధిక అలా వుందని మాత్రం అతనికి తోచలేదు.

కృష్ణ ప్రయాణమయి వెళ్ళబోయేముందు, "యింకేం మర్చిపోలేదు కదా!" అంది.

"నేను మర్చిపోతే ఏం – నువ్వు తీసి పదిలపరుచు – నేను రాగానే పదిలంగా యిద్దువుగాని" అన్నాడు. రాధిక అలా ఎందుకు అందో అతనికి అర్థం అయింది.

'ఏమీ ఎరుగని పసి పాపాయిలా నటిస్తాడు.' దొంగ అనుకొంది మురిపెంగా.

కృష్ణ రాధిక దగ్గర ఆగి, "మరి వెళ్ళిరానా రాధా !" అన్నాడు.

రాధిక కళ్ళు వాల్చేసుకుంది. యీసారి ఎందుకో రాధికకి చాలా దిగులుగా వుంది. కృష్ణ పైదేశాలకి వెళ్ళి పోతున్నట్లు – మళ్ళీ యింతట్లో తిరిగి రానట్లు దిగులుగా, బెంగగా వుంది. నవ్వుతూ, "క్షేమంగా వెళ్ళి లాభంగా రా" అనాలనుకొంది. కాని ఏమీ అనలేకపోయింది. అసలు తల ఎత్తి అతని కేసి చూడలేకపోతోంది.

రాధిక చేయి తన చేతిలోకి తీసుకొంటూ, "ఏదనా మాట్లాడు రాధా ! లేకపోతే నేను హుషారుగా ప్రయాణం

చేయలేను - యీ రోజంతా అదోలా వున్నావు. నేను యీ గుమ్మం దాటానంటే - యీ దిగులు ముఖమే కళ్ళముందు మెదిలిందంటే ప్రయాణం కాదే - అసలు ఇంటర్వ్యూ కూడా సరిగ్గా చేయలేను......"

తన చేత్తో చప్పున కృష్ణ నోరు మూసేసింది రాధిక.

"అలా మాట్లాడకు. నువ్వు ఇంటర్వ్యూ బాగా చేయాలి - సెలెక్ట్ అవాలి. తప్పకుండా అవుతావు. క్షేమంగా వెళ్ళి లాభంగా రా" అంది నవ్వుతూ.

రాధిక చేతిని అలాగే పెదాలకి సున్నితంగా తాకించుకుని, మెల్లగా ఆ చేయిని వదిలేసి - వెనక్కి తిరిగి చూడకుండా గబగబా వెళ్ళిపోయాడు కృష్ణ.

రాధిక ఆ చేయిని చెంపకి తాకించుకుని - చాలాసేపు అలాగే కూర్చుండిపోయింది.

రాధికకి తొందర స్వభావం - ఆలస్యాన్ని ఏమాత్రం భరించలేని తత్వం.

కూతురి మనసు గ్రహించుకోలేని వాళ్ళేం కాదు ప్రకాశరావు దంపతులు. 'కృష్ణ అభిప్రాయం వాళ్ళకి తెలియదు కృష్ణ మనసులో ఏమున్నా పైకి ఏమీ తేలక పోవడంతో వాళ్ళు గ్రహించుకోలేక పోయారు. అయినా కృష్ణ చదువు యిప్పుడే అయింది. ఏదయినా ఒక వుద్యోగంలో స్థిరపడాలి. అప్పుడు తన బాధ్యత తీరినట్లు అవుతుంది - ఆ తర్వాత - ఏ విషయాలయినా' అనుకున్నాడు.

కృష్ణ చదువు అయినప్పటినుండి పార్వతి "ఒకసారి

కదిపి చూస్తే కృష్ణ అభిప్రాయం తెలుస్తుంది కదా" అంది పార్వతి.

"స్కాలర్‌షిప్పులమీద చదువుకొంటూ – ప్రైవేట్లు చెప్పుకొంటూనే మనమీద ఆధారపడినట్లు తెగ బాధపడిపోయాడు. ఉద్యోగం రానీ! అయినా కృష్ణ అభిప్రాయం ఎలా వుందో! మనం చదువు చెప్పించాము కదా అని వాడిని మొహమాటంలో పడేయకూడదు" అన్నాడు.

* * *

కృష్ణమోహన్ హుషారుగా లోపలకి అడుగు పెట్టాడు.

కృష్ణని చూస్తూనే సతీష్ లోపలకి పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు.

కృష్ణకి సతీష్ అలా ఎందుకు పరిగెట్టినట్టుగా వెళ్ళాడో అర్థం కాలేదు. అయినా అతను అదేం అంతగా పట్టించుకోలేదు. అసలు తను రాగానే రాధికే ఎదురు రావాలని, తను తెచ్చిన బహుమతి రాధకిచ్చి, ఆ కళ్ళల్లోని వెలుగుని చూడాలనుకొన్నాడు.

'తను వచ్చాడని తెలియగానే రాధ పరుగెత్తుకుని వస్తుంది. కళ్ళల్లో ఆనందం చిందులేస్తుండగా బెట్టుగా దూరంగా నిలబడుతుంది. తను 'ఇలా రా' అన్నట్లు కళ్ళతోనే సౌంజ్ఞ చేస్తాడు. 'చెప్పందే రాను' అని కోపం నటిస్తుంది. అప్పుడు తను...'

కృష్ణ వూహాలు చెదిరిపోయేలా పార్వతి గొల్లుమంది.

'ఏమిటి!?' కృష్ణ సడెన్ బ్రేక్ వేసినట్టుగా కాలు మధ్యస్తంగా ఆగిపోయాడు.

ప్రకాశరావు పదిరోజుల్లో - మనో పదేళ్ళు పైబడిన వాడిలా వున్నాడు.

ప్రకాశరావు వచ్చి మౌనంగా కృష్ణ చెయ్యి పట్టుకుని లోపలకి తీసుకెళ్ళాడు.

ఏమిటో అర్థంకాని కృష్ణ యాంత్రికంగా అతనివెంట వెళ్ళాడు -

పార్వతి హృదయవిదారకంగా ఏడుస్తోంది. కూతురు మరణం తల్చుకుని.

రాజేష్ తల్లిపక్కనే కూర్చుని - తల్లిని ఓదారుస్తున్నట్లుగా ఓ చెయి తల్లిమీద వేసి, మౌనంగా వుండిపోయాడు -

సతీష్ గోడవయిపుకి తిరిగి నిలబడ్డాడు -

ప్రకాశరావు భార్య దగ్గరకి వెళ్ళాడు - భార్యని వూరుకోమని చెప్పాలని - కాని, అతని నోరు పెగల్లేదు. 'వూరుకో' అన్నట్లు చేత్తో తడుతున్నాడు.

కృష్ణ కాళ్ళకింద భూమి కంపించింది -

గోడకి అతుక్కుపోయినట్లుగా నిలబడ్డాడు -

చేతిలో బాగ్ జారి నేలమీద పడింది -

కృష్ణకి మెదడు నరాలు చిట్లిపోతాయేమో అన్నంత బాధ -

గుండెలు బ్రద్దలయే ఆవేదన -

కళ్ళు ఎర్రగా - జ్యోతుల్లా అయినాయి -

పెదాలు అదురుతున్నాయి -

పార్వతికి కృష్ణని చూసేసరికి ఆవిడ బాధ పదింత లయింది.

కొడుకులు, భర్త ఆవిణ్ణి ఎవరూ వూరుకోబెట్టలేక పోతున్నారు.

పక్కవాళ్ళు యిద్దరు ముగ్గురు వచ్చారు.

"మీరు యిలా అయిపోతే ఎలాగ? పిల్లలు బెంబేలు పడిపోతున్నారు. ఆ అబ్బాయి చూడండి. ఎలా అయి పో తున్నాడో! రుణం తీరిపోయిందని ఓ రాయి వేసుకోవాలి అంతే! స్నేహితుడితో వెళతానని సరదాపడితే పంపారు గాని, యింత ఘోరం జరుగుతుందని మీకు మాత్రం తెలుసా మరి? వూరుకోండి" పక్కావిడ అంటోంది.

హృదయ విదారకంగా ఏడుస్తున్న పార్వతి విరుచుకు పడిపోయింది.

అందరూ ఖంగారుపడిపోయారు.

ఇద్దరు పార్వతిని మంచంమీద పడుకోబెట్టారు. ఒకరు నీళ్ళకోసం పరుగెట్టారు, మరొకరు వేడి వేడి కాఫీ చేయ డానికి పరుగెట్టారు.

అక్కడ ఒక్కక్షణంకూడా నిలవలేని కృష్ణ బయటకి వెళ్ళిపోయాడు.

హడావిడి తగ్గి కృష్ణకోసం చూస్తే లేడు.

ఇల్లంతా చూశారు -

ఆఖరికి వూరంతా గాలించారు -

కృష్ణ జాడ తెలియలేదు -

* * *

ఒక్కొక్కర్ని చూస్తాంటే ఒక్క క్షణకాలాన్ని కూడా వ్యర్థపుచ్చరా అన్నంత బిజీగా వుంటారు. మరి కొందరు యీ పరుగుపెట్టే కాలంతో తమకేం సంబంధం లేనట్టే కనపడతారు.

అలా అని, ఎప్పుడూ ఏదో ముంచుకు పోయేట్టు తిరిగేవారు ఎక్కువ చేసేస్తారని అనుకోలేం - నిదానంగా కనపడ్డవారు వాళ్ళేం చేతకానివారనీ అనుకోకూడదు.

స్టేషన్‌లో బండి ఆగి, ఆగగానే అందరూ పిల్లలతో - సామాన్లతో హడావిడిగా పరుగెడుతున్నారు. ఒకమ్మాయి రెండు చేతుల్లో సామాన్లతో గబగబా వెళ్ళే ప్రయత్నంలో కాళ్ళకి కుచ్చిళ్ళు అడ్డం పడడం - ఎదురుగా ఎవరో ఒకరు అడ్డంగా రావడమో జరగడం వల్ల వెళ్దామన్నంత తొందరగా వెళ్ళలేకపోతోంది.

ఆ అమ్మాయి వెనుక మెల్లిగా నడుస్తున్న వారు ఆ అమ్మాయిని దాటేశారు-

యీదురో దేవుడా అంటూ కనపడేవారు - చిలకా గోరింకల్లా తిరిగేవారు. యింకా ఏ బరువు బాధ్యతల్లోకి అడుగు పెట్టక "యిదీ జీవితం అంటే" అనిపించేలా తిరిగే యువతీ యువకులు - బీదవాళ్ళు - భిక్షగాళ్ళు - గొప్పవాళ్ళు - గొప్పలు చెప్పకొనేవారు - స్టేషన్లో బండి ఆగి

ఆగగానే అంగల్లోకి ఏదో కొత్త చైతన్యం వచ్చినట్లుగా హడావిడిగా తిరుగుతున్నారు.

ఒక వ్యక్తి మాత్రం ఈ హడావిడితో - అసలు యీ ప్రపంచంతోనే తనకేం సంబంధంలేనట్లుగా బెంచీమీద ఓ పక్కగా కూర్చున్నాడు.

తన ముందునుంచే - తనని శల్యపరీక్ష చేస్తున్నట్లుగా చూస్తూ మరోక వ్యక్తి రెండు మూడు సార్లు తచ్చాడడం కూడా అతను గ్రహించలేదు.

బట్టలు మాసిపోయినాయి -

గడ్డం మాసిపోయింది -

క్రాఫ్ చెదిరి, అన్నంతిని ఎన్నాళ్ళయిందో అన్నట్లుగా వున్నాడు.

అటు యిటు తచ్చాడిన వ్యక్తి అతని దగ్గరగా వచ్చి ఆగాడు.

అయినా అతను 'ఎవరా' అని చూడలేదు. కాని, అవతలి వ్యక్తి పక్కన కూర్చుని, "కృష్ణా" అనటంతో తల తిప్పి చూశాడు.

'అవును కృష్ణే' అనుకుని, "ఏంవోయ్! ఏం చేస్తున్నావిప్పుడు?" కనుబొమ ఎగరేస్తూ, అడిగాడు.

అవతలి వ్యక్తికి సమాధానం చెప్పడం యిష్టంలేనట్లుంది. ఆ బెంచీమీద సరిగ్గా కూర్చునే నెపంతో తిరిగి జవాబు యీయలేదు.

"ఏ ప్రాళ్ళో వుంటున్నావ్! నీ ఎడ్రస్ ఏమిటి!" అని క్షణం ఆగి, అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ, "ఏమిటి

మకీ దేవదాసుని గుర్తు తెస్తున్నావ్! మామయ్య పిల్లని ఇవ్వనన్నాడా, లేక ఆ పిల్లే ఒప్పందా!......"

ఒక్కసారిగా లేచి నింబడ్డాడు కృష్ణ -

రామబ్రహ్మం ఏమీ మారలేదు. అప్పటికన్నా ఒళ్ళు వచ్చింది. రంగు తేలాకు - అక్కడక్కడ జుట్టు తెల్లబడింది. అంతే! మన స్తత్వంలో ఏం మార్పురాలేదు.

కృష్ణ కోపాన్ని నిగ్రహించుకొంటున్నాడు.

"మేము చదివిస్తామంటే కాదుపొమ్మన్నావు - మేనమామ ఏదో పొడిచేస్తాడనుకున్నావు. అతగాడి వాలకం నేను అప్పుడే గ్రహించాను......"

కృష్ణ ఏదో చెప్పబోయాడు కాని, రామబ్రహ్మం తనే అందుకొన్నాడు. "ఆ రోజు మేమందరం తలోఖర్చు భరించి చదివిస్తామని చిలక్కి చెప్పినట్టు చెప్తే విన్నావా ?" ఒక్కసారి కృష్ణని కిందనించి మీదివరకూ చూసి, "చూడు యిప్పుడు ఎలా వున్నావో!" అన్నాడు.

కృష్ణకి ఒళ్ళు మండింది. "యింతకీ మీరు అనేది ఏమిటి ?" అన్నాడు చిరాగ్గా.

పొగరుకేం తక్కువలేదు. మింగ మెతుకులేదు, మీసాలకి సంపెంగనూనె అన్నట్లు - తన పరిస్థితికి బాధపడడం గాని - చెట్టంత బాబాయ్ కనపడగానే -"బాబయ్యా! మావయ్య నమ్మించి మోసం చేశాడు. నీతో వచ్చేస్తాను - నీదే భారం" అనడం పోయి "యింతకీ మీరనేదేమిటి ?" అంటాడా! ఎంత నిర్లక్ష్యం! ఎంత పొగరు - కృష్ణ కేసి శల్యపరీక్ష చేస్తున్నట్టుగా చూస్తూ, "నీ అంత నిర్లక్ష్యంగా మేము వుండలేంగా! మీనాన్నని పట్టినా మేము కలగజేసు

కోవాలి. నీ కంటే మేము అక్కరలేదనుకొన్నావుగాని - నాంతో వచ్చేయి. నేను రిటైర్ అయ్యేలోగా మా ఆఫీసులో ఏదో ఒక పనిలో యిరికిస్తాను. ఒక్కసారిగా పెద్ద పెద్ద ఉద్యోగాలు రమ్మంటే రావు - రోజులు మారాయి. యీ రోజుల్లో బియ్యేలు - ఎమ్మేలు చదివినవారే కళాసీ పనులు చేస్తున్నారు ......"

కృష్ణ సహనం చచ్చింది.

అతను విసురుగా ఏదో అనబోయేంతలో అతని భుజంమీద ఎవరిదో చెయి పడింది. తిరిగి చూశాడు. మొదట అతను ఎవరో గుర్తుపట్టలేకపోయాడు.

అతను ముక్కు నలుపుకుని నవ్వాడు. అతనికి చిన్నతనం నుండి అది అలవాటు.

కృష్ణకి అతను ఎవరో గుర్తుకొచ్చింది.

అతను రవిశంకర్ -

వీరిద్దరినీ రామబ్రహ్మం ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

బికారివెధవలా వున్నకృష్ణకి జమిందారీ ఫాయిదాలో వున్నవాడు వీడికి ఫ్రెండా అని ఆశ్చర్యపోతున్నాడు.

కృష్ణ రామబ్రహ్మం కేసి తిరిగి "కళాసీ ఉద్యోగం కూడా దొరకనప్పుడు మీ దగ్గరకి తప్పకుండా వస్తాను." అనేసి రవిశంకర్‌తో యివతలికి వచ్చేశాడు.

"నిన్ను యిందాకనే చూశాను. యీ లోకంతో సంబంధం లేనట్టుగా కూర్చున్నావు - ఎక్కడో చూసినట్టుగా అనిపించింది - కాని చప్పున గుర్తుపట్టలేక పోయాను - నువ్వు

లేచి నిలబడ్డాక - ఆ నిలబడినతీరు చూడగా వెంటనే గుర్తొచ్చింది" అన్నాడు రవిశంకర్.

"నిన్ను నేను గుర్తించలేదు - నువ్వు ముక్కు నలపక పోతే అసలు గుర్తించేవాడిని కాదు" కృష్ణ అన్నాడు.

"యిప్పుడు ఏం చేస్తున్నావ్ ! ఏమిటి సంగతులు ?" రవిశంకర్ అడిగాడు.

"యిప్పుడు చేస్తున్నదే ! ప్రత్యేకమైన సంగతులేం లేవు" యిభావంగా అన్నాడు.

కృష్ణ ఏదో బాధలో వున్నాడని రవిశంకర్ గ్రహించాడు. అతని వాలకమే చెప్తోంది. యింక ఆ విషయాలేం రవిశంకర్ కదపలేదు. ప్రస్తుతం కాళీగా వున్నాడని మాత్రం గ్రహించాడు.

"ఈ ఊళ్ళో పనేమయినా వుందా ?" అని అడిగాడు.

"లే" దన్నట్లుగా తల అడ్డంగా వూపాడు కృష్ణ.

* * *

అది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు -

ట్రైన్ కదలగానే రవిశంకర్ బాగ్‌లోంచి టవల్, సోపు తీసి ఇస్తూ "ముందు వెళ్ళి స్నానం చేసిరా" అన్నాడు

కృష్ణ మారు మాట్లాడకుండా టవల్, సబ్బు అందుకుని వెళ్ళిపోయాడు.

కృష్ణ తిరిగి వచ్చేసరికి పాంటు, షర్టు వగైరా తీసి సిద్ధంగా వుంచాడు.

రవిశంకర్ చెప్పిందల్లా బుద్ధిమంతుడిలా చేశాడు కృష్ణ.

అతన్ని అప్పటికి విశ్రాంతి తీసుకోనివ్వడం మంచిదని తలచిన రవిశంకర్ అతన్ని అవి ఇవి అడిగి విసిగించలేదు.

కృష్ణ పడుకున్నాడు -

అలా పడుకుని ఎన్నాళ్ళో అయినట్టుగా వుండతనికి -

* * *

కృష్ణ ద్వారా జరిగిందంతా విని చాలా బాధపడ్డాడు రవిశంకర్.

రవిశంకర్, కృష్ణ స్కూల్ ఫైనల్ చదువుకొనే రోజుల్లో చాలా స్నేహంగా వుండేవారు.

"నువ్వూ ఆలోచించు కృష్ణా! నేను నమ్మకమయిన వ్యక్తికోసం చూస్తున్నాను. ఆ వ్యక్తివి నువ్వే ఎందుకు కాకూడదనీ? నాన్నగారికి రవి ఏజన్సీ వదులుకోవడం ఏ మాత్రం యిష్టంలేదు. దాని ద్వారానే మేము యింతవాళ్ళ మయ్యాము ఈ రోజుకి. అదీ నాన్నగారి నమ్మకం. అవతల శంభునాథ్ మమ్మల్ని తప్పించి అంతా తనే ఆక్రమించు కోవాలని చూస్తున్నాడు. నాన్నగారికి ఒంట్లో బాగుండక పోవడంతో నాకు పనులతో ఊపిరి ఆడటంలేదు. యిదే మంచి అదను అనుకొన్న శంభునాథ్ డబ్బు యిష్టం వచ్చినట్టు ఖర్చు చేసేవాడు. యిప్పుడు అతిగేసరికి కష్టం కలుగుతోంది. అడ్డంగా దబాయిస్తున్నాడు. మాకు ఏదో కొంత డబ్బు యిచ్చేసి మమ్మల్ని తప్పించాలని చాలా ప్రయత్నిస్తున్నాడు. యిదీ సంగతి! నువ్వు ఆలోచించుకొనే చెప్పు. తొందరేం లేదు" అన్నాడు.

రవిశంకర్ తల్లి భద్రమ్మగారు వచ్చి భోజనానికి పిల్చినడంతో యిద్దరూ లేచి వెళ్ళారు.

రవిశంకర్ కి అన్ని సంగతులూ చెప్పాక కృష్ణ మనసు కొంత తేరుకుంది.

ఇప్పుడు అతను ఏం చేయాలన్నదే ఆలోచనలో పడ్డాడు.

కృష్ణకి తెలియకుండా ప్రకాశరావుకి కృష్ణ యిక్కడ క్షేమంగా వున్నాడు. కాని, మీరు ఇప్పుడప్పుడే అతన్ని కలవకుండా వుంటే మంచిది. అందుచేతనే నా ఎడ్రస్ మీకు యివ్వడం లేదు. అతను కొంచెం తేరుకొన్నాక అతన్ని తీసుకు రావడంగాని - మీకు నా ఎడ్రస్ యివ్వడం గాని చేస్తాను అంటూ రాశాడు.

కృష్ణకి ఎన్నో విధాల అతను చెప్పి చూశాడు. "నేను తోడు వస్తాను. ఒక్కసారి వాళ్ళకి కనిపించి రా" అని, కాని కృష్ణ ఒప్పుకోలేదు. పైగా ఆ సంగతి ఎత్తాక మళ్ళీ రెండు మూడు రోజులకి గాని తేరుకోలేకపోయాడు. రవిశంకర్ కి భయమేసింది. అవతల ప్రకాశరావు వాళ్ళు పిల్ల పోయిందనే దుఃఖం కాకుండా కృష్ణ గురించి కూడా ఆందోళన పడతారని ఆ విధంగా ఉత్తరం రాశాడు. తన ఎడ్రస్ యిస్తే వాళ్ళు రావచ్చు - కృష్ణ ఒక పనిలో యిమిడిపోయే వరకూ ఆ ఆలోచనలనుండి తప్పించాలంటే యింతకన్న వేరే మార్గం లేదనుకున్నాడు.

కృష్ణ పెడసరి సమాధానానికి ఒళ్ళుమండిన రామ

బ్రహ్మం, మేనమామ కూతురు కృష్ణని చేసుకోను పొమ్మందని - దేవదాసు ఫోజులో బిచ్చగాడిలా ప్లాట్ ఫారం మీద తిరుగుతున్నాడని బంధువులకి చెప్పసాగాడు.

ఈ వార్త విన్న కాత్యాయిని చాలా బాధపడింది. ఈ మధ్య ఎక్కువగా కృష్ణ ఆమెని కలవలేదు. ఆవిడ ఇలా బాధపడుతున్న సమయంలో రాధ మరణవార్త వినగానే యింట్లోంచి వెళ్ళిపోయిన కృష్ణ యిక్కడకే వచ్చి వుంటాడనే నమ్మకంతో ప్రకాశరావు వచ్చాడు.

అతని ద్వారా అసలు సంగతి తెలుసుకున్న కాత్యాయిని చాలా బాధపడింది. 'ఏమిటి వాడి జీవితం యిలా అయింది. చిన్నతనంలోనే ఆరునెలలు తిరక్కుండా తల్లి తండ్రులను పోగొట్టుకున్నాడు. మంచి మనసుతో మేనమామ తీసుకెళ్ళాడు. - చదువు అయి ఒక యింటివాడు అయ్యే తరుణంలో భగవంతుడు ఆ లేత హృదయంమీద ఎంత పెద్ద దెబ్బ వేశాడు. ఆ భగవంతుడికే వాడిమీద అంత కక్ష వుంటే - యింక మామూలు మనుషుల కోతిచేష్టలని ఏం అనుకోగలం' అని చాలాసేపు బాధపడింది.

అన్నగారు చేస్తున్న ప్రచారం వినలేక అసలు సంగతి రాసింది యికనయినా మానుతాడేమోనని.

కాని, ఆ తిక్కమనిషి మరోకిలా వాగడం మొదలెట్టాడు. 'కృష్ణ ఏదో అసందర్భంగా ప్రవర్తించాడని - రాధకి అనుమానం భరించలేక ఆత్మహత్య చేసుకుందని - లేకపోతే రాధ లాంటి పిల్ల యాక్సిడెంటులో పోవడం ఏమిటి? పోయిన పిల్ల ఎలాగూ పోయింది - యింక గొడవ ఎందుకు?

నుకే అప్రతిష్ట అనుకొని వుంటాడు ప్రకాశరావు' యిలా ప్రచారం చేశాడు.

ఈ విషయాలు కృష్ణ మోహన్ వరకూ వచ్చాయి.

"అలాంటి వాళ్ళ మాటలు అసలు లెక్క-చేయ కూడదు" అన్నాడు రవిశంకర్.

పినతండ్రి నోరు ఎలాగయినా మూయించాలను కొన్నాడు కృష్ణమోహన్.

* * *

ఏడాది గిర్రున తిరిగిపోయింది -

రవిశంకర్ ఎంత బ్రతిమాలినా అతని ఇంట్లో వుండ డానికి కృష్ణ అంగీకరించలేదు. అతని తలితండ్రులు కూడా ఎంతో చెప్పి చూశారు. "మాకు మాత్రం ఏం పదిమంది వున్నారు, యిక్కడే వుండిపో బాబు" అని చెప్పారు

వాళ్ళకి ఎలాగో సర్ది చెప్పి, వేరే యింటికి వచ్చేశాడు.

తనకి అన్నీ చేసి పెట్టడానికి 'నా' అనేవారు ఎవరూ లేని ఓ పదిహేను పదహారేళ్ళ కుర్రాడిని దగ్గర పెట్టు కున్నాడు. వాడు యిక్కడే తిని - యిక్కడే పడుకొంటాడు.

ఆ రోజు కృష్ణమోహన్ యింటికి వచ్చేసరికి కొంచెం ఆలస్యమయింది.

అంత పొద్దుపోయినా తలుపులు తెరిచే వుండడం చూసి ఆశ్చర్యపోయాడు. రాజుకి ఏడుగంటలు దాటితేనే భయం. తలుపులు బిడాయించుకుని కూర్చుంటాడు.

కృష్ణమోహన్ లోపలకి వచ్చేసరికి రవిశంకర్ కనిపించాడు.

"ఏమిటీ వింత! నేను కలకనటం లేదుగా!......"
నవ్వు ముఖంతో యింకా ఏదో అంటున్న కృష్ణ రవిశంకర్ పక్కన కూర్చున్న వ్యక్తిని చూసేసరికి అతని నవ్వు మాయమయింది. అలాగే నిలబడిపోయాడు.

ఆ వ్యక్తి లేచివచ్చి "కృష్ణా! బాగున్నావా బాబు!" కృష్ణ భుజం మీద చెయివేస్తూ ఎంతో అభిమానంగా అడిగాడు.

కృష్ణమోహన్ మేనమామ కేసి చూడలేనివాడిలా ముఖం తిప్పుకొన్నాడు.

ప్రకాశరావు కృష్ణని చేయిపట్టుకుని తీసుకెళ్ళి తన పక్కన కూర్చోపెట్టుకున్నాడు తర్వాత తనే అది ఇదీ మాట్లాడసాగాడు. ప్రకాశరావు అంత మాట్లాడుతున్నా కనీసం 'అత్తయ్య ఎలావుంది మామయ్యా' అని కూడా అడగలేకపోయాడు. ఏదో తప్పుచేసినట్లు బాధపడసాగాడు.

తర్వాత - ప్రకాశరావు అక్కడ లేనప్పుడు, "కృష్ణా! ఆయనతో ఏదయినా మాట్లాడు. ఆయన అంత ఆతృతగా వస్తే ఒక్క మాటకూడా మాట్లాడవేమిటి ?" అన్నాడు రవిశంకర్.

కృష్ణమోహన్ రవిశంకర్ కేసి ఓసారి చూసి, తలతిప్పుకున్నాడు. అతని కళ్ళు ఎర్రగావున్నాయి. తర్వాత కొంత సేపటికి మెల్లగా అన్నాడు "మామయ్యకి నేను యిక్కడ వున్నట్లు ఎలా తెలిసింది ?"

రవిశంకర్ అదివరకు తను ఏమని ఉత్తరం రాసింది చెప్పి, "నన్ను యీ మధ్య రెండు మూడుసార్లు కదిపాను

ఒకసారి వెళ్ళి కనపడమని. నువ్వు వినలేదు నేను ఆయనకి రాసిన ప్రకారం నాలుగు రోజుల క్రితం ఉత్తరం రాశాను. నువ్వంటే ఎంత అభిమానమో చూడు, రెక్కలు కట్టుకుని వాలాడు." క్షణం ఆగి మళ్ళీ అన్నాడు. "కృష్ణా! ఆయన నిన్ను తనతో తీసుకెళ్ళడానికి వచ్చాడు. నన్ను కూడా చెప్పమని చెప్పాడు. ఇంక ఆయన మనసు బాధపెట్టడం నీకు భావ్యంకాదు. నిన్ను చూడాలని మీ అత్తయ్య ఎంతో ఆరాటపడుతున్నారట - అసలు ఆవిడ కూడా యిప్పుడు వస్తానని చాలా పట్టు పట్టారట! 'నువ్వు నీరసంగా వున్నావు, కృష్ణని నేను తీసుకొస్తాగా!' అని నచ్చచెప్పి యీాయన వచ్చారట. ఒకసారి వెళ్ళి రా! వెళ్తావా?" అన్నాడు.

"చూద్దాం" అంటూ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

ప్రకాశరావు కృష్ణని కూడా రమ్మన్నప్పుడు, "అత్తయ్యని, పిల్లలని ఇక్కడకి తీసుకొచ్చేయి మామయ్యా!" అన్నాడు.

"నువ్వు వచ్చి అత్తయ్యకి చెప్పు బాబూ! మీ అత్తయ్య ఒప్పుకొంటే నా అభ్యంతరం ఏం లేదు. నీకు నిజంగా మేమంతా యిక్కడకి వచ్చేయాలనే వుంటే నువ్వు వచ్చి అత్తయ్యకి చెప్పాల్సిందే!" అన్నాడు ప్రకాశరావు.

ఆ ఇంట్లో అడుగు పెట్టాలంటేనే కృష్ణకి వెర్రి బాధగా వుంది.

దిగులుగా చూపులు మళ్ళించుకున్నాడు.

కృష్ణ బాధ ప్రకాశరావుకి తెలుసు. కృష్ణ భుజం అభిమానంగా తడుతూ, "కృష్ణా! అత్తయ్యతో నిన్ను తీసు

కొస్తానని ఎంతో ఆశపెట్టి వచ్చాను. నిన్న తీసుకెళ్ళకుండా నేను ఒక్కడినే వెళ్తే - అత్తయ్య తట్టుకోలేదురా!" అన్నాడు.

ప్రకాశరావు చెయిమీద చెయివేస్తూ మెల్లగా అన్నాడు, "రేపు వెళ్దాం మామయ్యా! అని.

ఆయన మనసు ఆ మాటతో పొంగిపోయింది.

* * *

కృష్ణమోహన్ నాకిట్లోకి రాగానే పార్వతి ఎదురొస్తూ "బాగున్నావా కృష్ణా!" అంటూ అతని చెంపలు నిమిరింది.

ఒక్క ఏడాదిలో ఎంత మార్పు - పార్వతి జుట్టు అంతా తెల్లబడిపోయి - నురో యిర్వై ఏళ్ళు పైబడిన దానిలా వుంది.

ప్రకాశరావు కృష్ణ దగ్గరకి వెళ్ళేటప్పుడే చెప్పాడు "వాడు రాగానే శోకన్నాలు పెట్టకు. రాగానే ఆప్యాయంగా మాట్లాడాలి - ఆ విషయాన్ని మనం మరిచిపోయి నట్టే ప్రవర్తించాలి" అని ఎన్నో చెప్పాడు భార్యకి.

భర్తతో 'అలాగే' అందిగాని, 'కృష్ణని చూస్తే తనకి దుఃఖం ఆగుతుందా' అని భయపడసాగింది. 'కృష్ణ తన అల్లుడు అవుతాడని ఎంత సంబరపడింది? తనకా అదృష్టం లేదు' అని నిట్టూర్చింది.

రాజేష్, సతీష్‌లు కృష్ణమోహన్‌ని చూస్తూనే చూడ నట్లు వెళ్ళిపోయారు.

ఇక్కడ రాధిక మరణం కట్ల బాధలేనట్లు - పెద్ద తనకే బాధవున్నట్లు అలా చెప్పాపెట్టకుండా వెళ్ళిపోవడమే! అలా వెళ్ళి మళ్ళీ తిరిగిరాని వాడ్ని తండ్రి వెళ్ళి బ్రతిమాలి తీసుకురావడం వాళ్ళిద్దరికీ నచ్చలేదు.

'ఇంత చదువు చెప్పించారు - విశ్వాసం లేదు' అనుకున్నారు.

పార్వతి కృష్ణమోహన్ పక్కనే కూర్చుని, అతని సంగతులు అన్నీ అడిగి, తెలుసుకొంటోంది - రవిశంకర్ని ఎంతగానో పొగిడింది.

ఎంతకీ రాజేష్, సతీష్‌లు కనపడక పోయేసరికి, ఎలాగో గొంతు పెగల్చుకుని, "అత్తయ్యా! రాజేష్, సతీష్ కనపడరేం" అని అడిగాడు.

పార్వతి వాళ్ళిద్దరినీ పిలిచింది.

వాళ్ళిద్దరూ కాస్త దూరంలో నిలబడి ఏవో నాలుగు మాటలు మాట్లాడేసి వెళ్ళిపోయారు.

ఇది కృష్ణ దృష్టినుండి దాటిపోలేదు.

అందరూ భోజనాలకి కూర్చున్నారు.

పార్వతి కృష్ణమోహన్ పక్కనే కూర్చుని పదార్థాలన్నీ కొసరి కొసరి వడ్డిస్తోంది. యిది రాజేష్, సతీష్‌కి మరీ మండించింది. 'ఎప్పుడయినా అమ్మ తమకి అంత అభిమానంగా, ఆప్యాయంగా వడ్డించిందా? కొడుకులకన్న మేనల్లుడు ఎక్కువయిపోయాడా?' కోపంగా అనుకొన్నారు.

ఆ రాత్రి అదివరకు కృష్ణ పడుకొనే గదిలోనే అతనికి పక్క వేసింది పార్వతి.

ఆ గది కాళీగానే వుంది.

గది గుమ్మంవరకూ వచ్చిన కృష్ణ ఆగిపోయాడు.

తను ఈ గది విడిచి వెళ్ళినప్పుడు రాధిక నిలబడిన ప్రదేశంలో మళ్ళీ ఆ మూర్తి ఏదో నీడలా వున్నట్టు అనిపించింది -

కళ్ళు గుచ్చి చూస్తున్న కృష్ణ కళ్ళకి మెల్ల మెల్లగా ఆ ఆకృతి మారి - రాధికే నిలబడినట్టు అయింది -

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి వచ్చాడు -

రాధిక నిలబడిన చోట ఆగిపోయాడు -

రాధిక కళ్ళు ఎత్తి తన కళ్ళల్లోకి చూసినట్టుంది.

కృష్ణ తన చేయి రాధిక భుజంమీద వేశాడు.

ఆకృతి - రాధిక నిలబడిందనుకొన్న చోట శూన్యం- అతని చేయి కిందకి వాలిపోయింది.

అతను మంచంమీద నిస్పృహగా కూర్చుండిపోయాడు.

'క్షేమంగా వెళ్ళి లాభంగా రా!' అన్న రాధిక తను వచ్చేసరికి లేదు.

'ఎప్పుడూ హుషారుగా నవ్వుతూ, తుళ్ళుతూ తిరిగే రాధ తను వెళ్ళినరోజు అలా వుందేం? రాధకి జరగబోయేది ముందే తెలుసా? తను ఒక్క రోజుకూడా 'చనువుగా మసలలేకపోయాడు - రాధికి మనసు తనమీద తెలుసుకున్నాక కూడా తను అలా మౌనం మౌనంగా వుండిపోయాడు -

'రాధా! నువ్వు ఫ్రెండ్స్‌తో ఎందుకు వెళ్ళావు? నేను రాగానే యిద్దరం కలిసే వెళ్ళే వాళ్ళం కదా? రాధా! నా మీద నీకు కోపం వచ్చిందా? నువ్వు చనువిచ్చినా నేను దూరదూరంగానే వుండిపోయానని కోపం వచ్చిందా? ఆ కోపంతోనే......' అతను బాధగా కళ్ళు మూసుకున్నాడు పెదాలు చిన్నగా అదురుతున్నాయి -

బయటనుండి రివ్వున వీస్తున్న గాలి అతని మనసుని జోకొడుతున్నట్లు చెంపని చల్లగా తాకింది.

అతను మెల్లగా లేచి కిటికీ దగ్గరకి వెళ్ళాడు.

రాధిక నవ్వుతూ, తుళ్ళుతూ తిరిగే దృశ్యం ఎంత వూహించుకోందామన్నా అతని కళ్ళకి తను వూరు వెళ్ళే రోజు రాధిక ఆ దిగులు ముఖమే కళ్ళముందు మెదిలి అతని మనసుని కోసేస్తోంది.

అలా ఆ గదంతా కలియతిరుగుతూ ఏ తెల్లవారు జామునో నిద్రపోయాడు కృష్ణ.

మర్నాడు లేస్తూనే రాజేష్ ఎక్కడికో వెళ్ళిపోయాడు సతీష్ మాత్రం కృష్ణ అడిగిన వాటికి ముభావంగా జవాబు లిచ్చాడు.

తనతో హైదరాబాదు వచ్చేయమన్నాడు కృష్ణ మోహన్.

సతీష్ తడుముకోకుండా వెంటనే అన్నాడు, "ఎందుకు ఊళ్ళో కాలేజీ ఉండగా - యిల్లు, వాకిలి వదులుకుని..." అంటూ ఆగిపోయాడు.

కృష్ణ సతీష్ కేసి పరిశీలనగా చూశాడు. అప్పటి రాజేష్ సతీష్‌లు కారు వీళ్ళు - ఒక్క ఏడాదిలో ఎంతెగా ఎదిగిపోయారు. 'బావా బావా' అంటూ తన వెనకే తిరిగే పిల్ల లేనా వీళ్ళు.' అత్తయ్యా మామయ్యలో లేని స్వార్థం వీళ్ళలో వుంది - అది ఒక్కసారిగా బయటపడింది. 'ఫలితం లేకపోయిందే' అన్న బాధ వాళ్ళ ప్రతీ చేష్టల్లోనూ వ్యక్త మవుతోంది. నిజంగానే వీళ్ళకి తను చాలా ఋణపడి వున్నాడు—

ఆరోజు సాయంత్రమే కృష్ణ ప్రయాణం అవడం చూసి "అదేమిటి కృష్ణా! అప్పుడే వెళ్ళిపోతావా! ఒక్క వారం రోజులయినా వుండకుండా వెళ్తావా?" బాధగా అంది పార్వతి.

"అత్తయ్యా! నేను మంచి యిల్లు చూసి మిమ్మల్నందరినీ తీసుకెళ్ళడానికి వస్తాను. అప్పుడు నువ్వేం అభ్యంతరం చెప్పకూడదు - నేను నీ పెద్దకొడుకుననుకోవాలి - ఈ మాట మీరు ఎప్పుడూ మర్చిపోకూడదు - సతీష్, రాజేష్‌లు చిన్నపిల్లలు — వాళ్ళకి మీరే నచ్చచెప్పాలి. యిక్కడ నాకు వుండడానికి లేదు. నువ్వు మరోలా అనుకోవద్దు. నేను యిల్లు చూడగానే, వస్తాను - తప్పకుండా వస్తావా అత్తయ్యా!" అని అడిగాడు.

"నువ్వు ఒక్కరోజు వుండి వెళ్ళిపోతూ మమ్మల్ని అక్కడికి రమ్మంటున్నావా? మా మాట నువ్వు వినకపోయినా, నీ మాట మేము వినాలా?" నవ్వుతూ అడిగింది.

పార్వతి నవ్వులో జీవం లేదు - కృష్ణ కోసం నటి స్తోంది అంతే!

"యిది విన్నపమే అత్తయ్యా! నువ్వు నన్ను ఆజ్ఞా పించాలి - ఆ అధికారం నీకు వుంది."

"మర్చిపోకు సుమా!" అని క్షణం ఆగి అంది, "తప్ప కుండా వస్తాను కృష్ణా! కాని, మా కోసమంటూ ప్రత్యే కంగా యిల్లు చూడకు. నువ్వు వుంటున్న యింటికే వచ్చి నాలుగురోజులుంటాను."

"నాలుగురోజులుండమని కాదు నేను రమ్మంటున్నది. రాజేష్, సతీష్‌లు అక్కడే చదువుకొంటారు"

"అలా ఎలా కుదురుతుంది కృష్ణా! వాళ్ళు యీ ఊరు విడిచి రారే! వాళ్ళిద్దరి చదువులు అయినాయంటే నా బాధ్యత తీరిపోతుందయ్యా! ఆ తర్వాత నేను ఏమయినా ఫరవాలేదు ......" ఆవిడ ఎంత నిగ్రహించుకొందామన్నా గొంతు వణికింది. పార్వతి దుఃఖాన్ని దిగమింగి పైకి ఎలా నటిస్తోందో కృష్ణ గ్రహించుకోక పోలేదు. తను పెదిమి విప్పితే ఆవిడ దుఃఖం కట్టలు తెంచుకుంటుందని తెలుసు. అందుకే "అలా అనకమ్మా" అని మాత్రం అనగలిగాడు.

అక్కడ వుండలేని కృష్ణమోహన్ పార్వతిని ఒప్పించి బయలుదేరాడు.

కృష్ణ ఉన్నంతసేపూ ఎంతో నిగ్రహంగా వున్న పార్వతికి ఇంక సాధ్యంకాలేదు.

కిందనే కూలబడి భోరుమంది.

ప్రకాశరావు దగ్గరకొచ్చి "ఎందుకెందుకు వూరుకో" అంటూ ఓదార్చాడు.

"నేను పైకి ఏడుస్తున్నాను. కృష్ణ లోపల్లోపల ఎలా బాధపడుతున్నాడో తెలుసా? రాత్రి ఆగవంతా అంత తిరుగుతూనే వున్నాడు - భగవంతుడికి దయలేదండి! ఒక్కొక్కరి యందు ఎందుకింత నిర్దయగా ప్రవర్తిస్తాడండీ!" అంటూ విలపించింది.

"ఎంతవరకూ పెట్టిపుడితే అంతే! మనం ఏడ్చి మొత్తుకుని చేసేదేం లేదు. యీ సంగతి గ్రహిస్తే యింత ఆవేదన పడవు" వేదాంతిలా అన్నాడు.

* * *

రోజులు గడిచిపోతున్నాయి -

కృష్ణమోహన్ సంపాదనపరుడయ్యాడు.

యిది విన్న రామబ్రహ్మం, "అందుకే వెధవకి కళ్ళు నెత్తిమీదికొచ్చాయి. వీడికి ఎలాగయినా బుద్ధిచెప్తాను" అంటూ పళ్ళు నూరాడు.

'బికారి వెధవ - స్టేషన్లో భిక్షగాడిలా తిరిగే సన్యాసి - ఎప్పటికయినా తన కాళ్ళు పట్టుకోవలసిందే అనుకున్న కృష్ణమోహన్ ఒక్కసారిగా - తన అవసరం లేకుండానే సంపాదనపరుడు అవడమేగాకుండా తనమీద దావా వేస్తాడా? వాడ్ని ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించకపోతే నా పేరు రామబ్రహ్మమే కాదు,' అంటూ శపథం చేసుకున్నాడు.

కృష్ణకి తెలిసున్న వాళ్ళు రామబ్రహ్మాన్ని కలిస్తే

వాళ్ళ దగ్గర కూడా తన అక్కసు వెడల గ్రక్కాడు. ఇది వాళ్ళు మళ్ళీ కృష్ణ దగ్గర అంటే కృష్ణ నవ్వి వూరుకున్నాడు.

దుర్గమ్మకి ఎలా తెలిసిందో గాని రెక్కలు కట్టుకొని వాలినట్టు వచ్చింది.

"ఆ రోజుల్లో మా అమ్మ అందరికీ ఎలా చేసేది ?" అంటూ పొగిడింది.

"ఇంతమంది బాబయ్యలుండి - మీ అమ్మచేత అంత చాకిరీ చేయించుకుని ఒక్కళ్ళు కూడా నిన్న ఆదుకోలేదు." అంటూ వాపోయింది.

"అయితే ఏంలే! నీ స్వయం కృషిమీద యింత వాడివయ్యావు" అని పొగిడింది.

ఆఖరికి, "మా అబ్బాయి ఇంటరు రెండుసార్లు తప్పాడు నాయనా! నువ్వేదయినా పని ఇప్పించాలి. నువ్వు సమర్థుడవంతుడివి" అని బ్రతిమాలింది.

దుర్గమ్మని కృష్ణమోహన్ ఎప్పటికీ మర్చిపోడు.

"నాదేం లేదండి - రవిశంకర్‌ని అడగండి" అన్నాడు.

"నువ్వు అలా అంటే ఎలా నాయనా! నువ్వు చెప్పాలి! మొన్న ఎవరికో ఉద్యోగం యిచ్చావుటగా !" అంది.

"అతను చెప్పింది చేయడమే నా డ్యూటీ! నాదేం లేదు. మీరు అతనితో మాట్లాడితే బాగుంటుంది. అయినా యిప్పుడు ఖాళీలు కూడా ఏం లేవు" మామూలుగానే అన్నాడు.

"నీ స్నేహితుడికి పెద్ద బట్టలకొట్టు వుందిటగా! దాంట్లోనయినా సరే! నాలుగేళ్ళనుండి రోడ్లు సర్వే చేస్తు

న్నాడు. నువ్వే ఎలాగయినా పుణ్యం కట్టుకోవాలి బాబూ!" అని ఎంతో బ్రతిమాలింది.

ఆఖరికి విసిగిపోయిన కృష్ణమోహన్ వాళ్ళ అబ్బాయిని పంపమన్నాడు.

ఆ కొడుకు వారం తర్వాత వచ్చాడు.

వాడో వస్తాదులా యుద్ధానికి సిద్ధం అన్నట్టు వున్నాడు.

మాటల్లో మర్యాద మన్ననలు లేవు. చాలా నిర్లక్ష్యంగా - ఎవడికోసం యిస్తాడు ఉద్యోగం. అన్నట్టు వున్నాడు.

దుర్గమ్మ పట్టుకొందంటే వదలదు - అయినా పిల్లలు బుద్ధిమంతులు అవచ్చు. ఆవిడనిబట్టి ఆవిడ పిల్లల్ని గ్రహించుకోవడం మంచిదికాదు అనుకున్న కృష్ణమోహన్ అభిప్రాయం మారింది. ఇంక అతనేం రికమెండ్ చేయదలుచుకోలేదు. రవిశంకర్ ఎడ్రస్ యిచ్చి వెళ్ళమన్నాడు.

"మీరు లెటరేం యివ్వరా?" అని అడిగాడు సత్యం. అలా అడగడంలోకూడా నెమ్మది లేదు.

"రికమెండేషన్లు అతను యిష్టపడడు - నీ తెలివి తేటలు ఉపయోగించుకోవలసిందే!" అన్నాడు.

సత్యం బయటకి రాగానే కృష్ణ యిచ్చిన ఎడ్రస్ కాయితం వుండలా చుట్టి విసిరిపారేశాడు.

తర్వాత కృష్ణ రవిశంకర్ని అడగ్గా సత్యం రాలేదని తెలిసింది.

'తీసుకెళ్ళి కుర్చీలో కూర్చోబెడితే అతికష్టంమీద

ఉద్యోగం చేస్తారు. ఏం సుకుమారులు. కోరిక లెక్కువ - సహనం తక్కువ' అనుకున్నాడు.

* * *

కృష్ణమోహన్ స్కూటరు స్టార్టు చేయబోతున్న వాడల్లా టక్కున ఆగిపోయాడు.

చటుక్కున స్కూటరు దిగి స్టాండ్ వేశాడు.

వెనక్కి తిరిగి గబగబా మెట్లవరకూ వెళ్ళినవాడల్లా ఎవరో చెయిపట్టి ఆపినట్టుగా టక్కున ఆగిపోయాడు.

నుదుట పట్టిన చెమటని రుమాలుతో తుడుచుకున్నాడు.

'ఇంకెక్కడి రాధిక -'

కాని, అలాగే వుంది -

రాధికని చూసినవాళ్ళు యీ అమ్మాయిని చూస్తే -

కాస్త చిక్కి - ఓ ఛాయ తగినట్లుగా అనుకొంటారు - అంతే! అంతకన్న తేడాలేదు - ఎవరీ అమ్మాయి ?___

నీరసంగా వెనక్కి తిరిగి వచ్చాడు.

ఒకసారి తల ఎత్తి ఆ మేడకేసి చూశాడు - ఎవరూ కనపడలేదు.

ఒకవేళ ఆ అమ్మాయి ఆంజనేయులు యింటికే వచ్చిందా? అలా అయితే వాళ్ళు లేరు - యిల్లు తాళం పెట్టి వుంది.

ఆ అమ్మాయి తిరిగి వస్తుందేమోనని అయిదు నిమిషాలు వేచి చూశాడు. రాలేదు. పక్కవాటా వాళ్ళింటికేమో అనుకుని కృష్ణ వెళ్ళిపోయాడు.

ఆ పూట అతను భోజనం చేయలేకపోయాడు.

పుస్తకం తీసి అది చదవడంలో రాధిక జ్ఞాపకాలని పక్కకి నెట్టాలని చేసిన ప్రయత్నం విఫలమయింది. 'ఒక మనిషికి యింత వయసుకి రిటైర్‌మెంటు అని గవర్నమెంటు ఎలా నిర్ణయించిందో - అలాగే మనిషికి యింత వయసు వచ్చేవరకూ చావు లేకుండా ఎందుకు నిర్ణయించలేదో! ఒకే పోలిక గల యిద్దరు వ్యక్తుల్ని ఎలా సృష్టిస్తాడా భగవంతుడు?'

అసలున్నాడా??

కృష్ణమోహన్ తల్లిమీద దృష్టి లగ్నం చేయాలని ఎంతో ప్రయత్నించాడు.

అతనికి చిరాగ్గా వున్నప్పుడు - రాధిక జ్ఞాపకాలు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసినప్పుడు తల్లిని గురించి ఆలోచిస్తూ - అలా కొంతసేపటికి మనసుని మరో వైపుకి మళ్ళించుకొంటాడు.

కాని, యిప్పుడది సాధ్యం కాలేదు.

అలా చీకట్లో - ఈజీఛైర్‌లో తెల్లవార్లూ గడిపాడు.

మర్నాడు అతను బయలుదేరే టైముకి దుర్గమ్మ వచ్చింది.

వస్తూనే, "మా అబ్బాయి సంగతి మర్చిపోయావా బాబూ!" అని అడిగింది.

"పిలిచి ఉద్యోగాలు యిచ్చే రోజులు యింకా రాలేదండీ" అన్నాడు.

"ఏదో బుద్ధిమంతుడనుకొన్నాను - పొగరుకి తక్కువ లేదు" విసుక్కొంటూ వెళ్ళిపోయింది దుర్గమ్మ.

పరధ్యానంగా వున్న కృష్ణమోహన్ - స్కూటరు ఆంజనేయులు ఇంటి దగ్గర ఆపాడు. అప్పుడు ఆలోచించాడు, 'యీ టైములో ఆంజనేయులు వుండడు. తను ఇలా ఎందుకొచ్చాడు?' అలా ఆలోచిస్తూనే స్కూటరు స్టాండువేసి, మెట్లెక్కి పైకి వెళ్ళాడు. బెల్ నొక్కాడు.

ఆంజనేయులు భార్య అనసూయ తలుపుతీసి కృష్ణమోహన్‌ని చూసి కొంచెం తెల్లబోయింది. అతను ఎప్పుడూ ఆ టైములో రాడు.

"ఆంజనేయులు వెళ్లిపోయాడా?" అని అడిగాడు.

"వెళ్లిపోయారండి" అంది.

"ఇటు పనిమీద వచ్చాను - యింట్లో వున్నాడేమోనని వచ్చాను" అంటూ వెనుదిరిగాడు.

'కృష్ణ ఎప్పుడూ గంభీరంగానే కనిపిస్తాడు. అతను చలాకీగా వుండడం అనసూయ ఎప్పుడూ చూడలేదు. యీ రోజు గూడు కట్టుకున్న దిగులు అతని కళ్ళల్లో స్పష్టంగా కనపడుతోంది. ఎందుకో! భగ్నప్రేమికుడేమో! ఆయన అతని తీరే అంత మొదటినుండి అంటారు. అతని తీరే అంత అయితే - ఆ కళ్ళల్లో ఆ దిగులేమిటి?' అనుకొంది.

* * *

కృష్ణమోహన్ టేబిసూట్ చూస్తున్నాడు. ఆరోజు పుట్టినరోజు పార్టీ వుంది. అతనికి వాళ్ళతో అంతగా పరిచయం లేకపోయినా రవిశంకర్ ద్వారా వెళ్ళక తప్పదు.

"ఇంకా వేరేవి చూపించండి". అనే తీయని కంఠం వినిపించింది.

ఆ వెంటనే విసుగ్గా, "ఏ వెరైటీలో చూపించమంటారు?" నేనేక్స్ మెన్ విసుగ్గా అనటం వినపడి యథాలాపంగా తల తిప్పాడు కృష్ణ.

ఆ అమ్మాయేనా!

తనముందున్న రకరకాల చీరల మీదుండి ఆనందంగా దృష్టి మళ్లించుకుని కొట్టు అతనిని వేరేవి చూపించమంటోంది. ఎన్నో వెరైటీల్లో చూపించి చూపించి విసిగిపోయినట్టున్నాడతను.

యథాలాపంగా యిటు తిరిగిన కృష్ణమోహన్ అలాగే చూస్తూండిపోయాడు.

'ఆ అమ్మాయేమ! రాధని చూసినవాళ్ళు - యిప్పుడు నాలుగేళ్ళకి చూస్తే ఓ ఛాయ తగ్గి, కాస్త చిక్కినట్టుగా అనిపిస్తుందంతే!'

'రాధకి పచ్చగా ఆరోగ్యంగా - చలాకీగా నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ వుండేది.'

'ఈ అమ్మాయి చామన చాయగా - కొంచెం సన్నగా - ఎంతో బరువు, బాధ్యతలని నిర్వహిస్తున్నట్టుగా ఆరిందాలా కనపడుతోంది.'

బాగా తక్కువరకం చీరలు కొన్ని తీసి ఆ అమ్మాయి ముందుంచాడు.

ఆ అమ్మాయి ఆ ఫైలులో ఓ చీర తీసుకుని ఆ అమ్మాయి వెళ్ళిపోయింది.

కృష్ణమోహన్ జేవీ నూటు తీసుకుని బిల్లు చెల్లించి బయటకి వచ్చాడు.

రోడ్డు క్రాస్ చేస్తున్న ఆ అమ్మాయి కనపడింది.

ఆ తర్వాత జనంలో కలిసిపోయింది.

ఓ వారం రోజుల తర్వాత ఆంజనేయులికి ఒంట్లో బాగుండలేదని తెలిసి వాళ్ళింటికి వెళ్ళాడు కృష్ణమోహన్.

అతను వచ్చేసరికి ఆంజనేయులు లేడు.

"వచ్చేస్తారు కూర్చోండి! సిగరెట్లు తెచ్చుకోవడానికి వెళ్ళారు" అంది, అనసూయ.

కృష్ణమోహన్‌తో చనువుగా మాట్లాడాలని వున్నా ఎందుకో అతన్ని చూస్తే భయం అనసూయకి.

"ఒంట్లో బాగుండలేదని - కబురు పెట్టాడని తెలిసింది" అన్నాడు.

"అవునండి. ఈ రోజే పథ్యం తీసుకున్నారు. నీరసంగా వున్నాను వెళ్ళొద్దంటే వినలేదు. మీరు కూర్చోండి" అని రెండు పత్రికలు అక్కడేవున్న టీపాయ్ మీద పెట్టి కాఫీ పెట్టడానికి లోపలికి వెళ్ళింది.

కృష్ణమోహన్ కూర్చోలేదు. గోడకున్న పెయింటింగ్స్‌ని చూడసాగాడు. ఆంజనేయులుకూడా మంచి ఆర్టిస్ట్! ఎక్కువగా పాత గ్రామఫోన్ రికార్డుల మీద రకరకాల సీనరీస్‌ని చిత్రిస్తుంటాడు.

పావుగంట గడిచిపోయినా ఆంజనేయులు రాలేదు.

పెయింటింగ్స్ చూడ్డం అయిపోయిన తను కిటికీ దగ్గర కొచ్చి నిలబడ్డాడు.

ఎదురుగుండా కిటికీ దగ్గర ఆ అమ్మాయి మిషను కుడుతోంది. కాకీ బట్టమీద సూది దిగక చాలా అవస్తపడుతోంది. చాలా అలసిపోయినట్టుగా వుంది.

పరధ్యానంగా వున్న కృష్ణమోహన్ "కాఫీ తీసుకోండి అన్నయ్యగారూ! మీరు నిలబడే వున్నారు" అనసూయ అనడంతో ఈ లోకంలోకి వచ్చేడు.

మైనం రాసినా సూది కర్రు కర్రుమంటూ చప్పుడే గాని సూగా దిగకపోవటంతో మరో సూది మారుద్దామనే ఉద్దేశంతో - తల ఎత్తిన ఆ అమ్మాయి సభ్యత మరిచి ఎదురు కిటికీలోంచి ఎవరో ఇటే చూడటం గమనించి కింది తలుపులు మూసేసింది. కింది తలుపులు మూస్తే మిషను కుట్టడం కష్టం.

ఆ అమ్మాయి అలా భళ్ళున తలుపులు మూయటంతో ఆ అమ్మాయి తనని ఏ కాడీ అనుకొందో అనుకుని బాధపడ్డాడు.

"ఇప్పుడు కాఫీ ఎందుకండి, ఇంకా ఏడు రాలేదు." అన్నాడు.

"వచ్చేస్తూంటారు. కూర్చోండి కాఫీ చల్లారిపోతుంది" అంది.

తప్పనిసరిగా కూర్చున్నాడు.

కాఫీ తీసుకుంటూ "మీరూ కూర్చోండి" అన్నాడు.

వెంటనే కూర్చుంది అనసూయ. అనసూయకి అన్నదమ్ములు లేరు. ఇద్దరే అక్కచెల్లెళ్ళు. కృష్ణమోహన్ని చూస్తూనే గౌరవభావం ఏర్పడింది. "అన్నయ్యా" అంటూ

చనువుగా మాట్లాడాలని వుంటుంది. కాని అతను గంభీరంగా కనిపించటంతో పలకరించటానికి భయం.

కృష్ణమోహన్ కాఫీ తాగడం పూర్తిచేసేసరికి ఆంజనేయులు వచ్చేడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుకొంటున్నారు.

బయటనుంచి "అనసూయా" అంటూ ఎవరో పిల్చారు.

"ఆఁ, వస్తున్నా" అంటూ అనసూయ బయటకెళ్ళిన వెంటనే లోపలకొచ్చి మళ్ళా బయటకెళ్ళింది.

అనసూయ లోపలికి రాగానే "ఎవరూ" అన్నాడు ఆంజనేయులు.

"రాధ. మిషను సూది విరిగిపోయిందిట, రేపిస్తాను ఓ రూపాయి ఇమ్మంది" అంది.

'రాధ' 'ఆ అమ్మాయి పేరు రాధా, పేరు కూడా ఇంత దగ్గరగా కలిసిందా!'

ఆ తర్వాత అక్కడ వుండాలనిపించలేని కృష్ణమోహన్ "వస్తా" అని చెప్పి వెళ్ళిపోయాడు.

మాట్లాడుతున్నవాడు హఠాత్తుగా అలా ఎందుకు వెళ్ళిపోయాడో అనసూయకి అర్థంకాలేదు. అదేమాట భర్తతో అంటే "చాలా సేపయిందన్నావుగా వచ్చి - నాకు ఒంట్లో బాగుండలేదని తెలిసి చూడ్డానికివచ్చేడు." అన్నాడు.

రవిశంకర్‌కి పెళ్ళిచూపులు ఏర్పాటయినాయి.

ఆ రోజుకి కృష్ణమోహన్ కూడా రావాలని రవిశంకర్ పట్టుబట్టాడు. భద్రమ్మగారు కూడా మరీ మరీ చెప్పింది ఆ రోజుకి రావాలని.

చివరికి అన్నాడు "ఏమిటమ్మా! కృష్ణని అదరకొట్టేస్తున్నావ్ ఇంక నువ్విలా చెప్పావంటే ఇక్కడికి రావటం మానేస్తాడు."

"కృష్ణ అమాయకుడు. అతని పిల్లని ఎవరు చూస్తారు. ఈ రోజుల్లో ఎవరంతట వాళ్ళే చూసుకొంటున్నారనుకో! కాని కృష్ణ ఆ కాలప్పిల్లాడు కాడు" కృష్ణ మీదుండే అభిమానం వ్యక్తమవుతుందావిడ మాటల్లో.

"అంతే! నేను అమాయకుణ్ని కానంటావ్" రవిశంకర్ అన్నాడు.

"ఇద్దరూ అమాయకులే" అందావిడ ఇద్దర్నీ నిండుగా చూస్తూ.

అలా ఆ రోజు ఆ ప్రస్తావన తప్పించేశాడు రవిశంకర్.

అలా ఆ రోజు ఆ ప్రస్తావన తప్పించినా ఒకసారి పని గట్టుకుని కృష్ణమోహన్ ఇంటికి వచ్చి కాస్సేపు అవీ ఇవీ మాట్లాడేకా అన్నాడు, "కృష్ణా! నేనొకటి అడుగుతాను. నువ్వేమీ అనుకోకూడదు."

అతను అలా అనటంతోనే ఆ అడగబోయేది ఏమిటో కృష్ణకి అర్థమయిపోయింది. "అనుకోడానికి ఏముంది - అడుగు" అన్నాడు.

"అదే! ఎన్నాళ్ళని ఇలా ఒంటరిగా వుంటావ్ - ఎప్పటికైనా ఒక తోడూ నీడా వుండాలి - నీకు ఎలాంటి అమ్మాయి కావాలో చెప్పు - నా శాయశక్తులా అలాంటి అమ్మాయి కోసం ప్రయత్నించి చూస్తాను."

"నాకు ఇప్పుడిప్పుడే చేసుకోవాలని లేదు రవీ! నాకు

చేసుకోవాలని వున్నప్పుడు - నీకు కాక మరెవరికి చెప్తాను." అన్నాడు కృష్ణ. అలా అనటంలో ఏ భావం లేదు.

"అలా అంటే ఎలా కృష్ణా!... పోయిన వాళ్ళతో పోతామా ......"

"ప్లీజ్ రవి! ఆ సంగతులు వద్దు - రాధిక లేదని నేను అనుకోను - కొన్నాళ్ళు - కొన్నాళ్ళు నేను పనిమీద దూరంగా వచ్చేసనుకొంటానంతే!" భారంగా తల దించుకొన్నాడు.

"సారీ! సారీ కృష్ణా" అన్నాడు, రవిశంకర్, ఇంకేమనాలో తెలియక.

* * * *

"చంద్రా! చంద్రా లేవ్వే" అంటూ చెల్లెల్ని కుదిపింది అనూరాధ.

చంద్ర మూలిగి ఇటునుండి అటు వత్తిగిలిందే తప్ప లేవలేదు.

"చంద్రా, నీ చెప్పులు వేసుకెళ్తున్నా. మళ్ళా నన్ను తిట్టుకోవద్దు."

చెప్పులు సంగతి వినేసరికి చంద్ర ఒక్క ఉదుటున లేచి కూర్చుంది.

"నా చెప్పులు మాత్రం వేసుకెళ్ళొద్దు. అడిగిన ఆరు నెలలకి చెప్పులు కొంటారు. వాటిని ఆరుగజనమంది వాడటం- మళ్ళా ఆర్నెల్లకే చెప్పులు కొనమని అడగడం - ఈసారి

ఏమయినా సరే నా చెప్పులు ఎవరికీ ఇవ్వను" ఖచ్చితంగా అంది.

"నా చెప్పులు తెగిపోయేయే చంద్రా......"

"తమ్ముణ్ణి పంపి కుట్టించుకో" మధ్యలోనే సలహా ఇచ్చింది.

"వాడు కుట్టించుకొచ్చే సరికి ఆలస్యమవుతుంది - మళ్ళీ సెక్రెట్రి వెళ్ళిపోయిందంటే ఎల్లుండి వరకూ బట్టలు ఇవ్వరు. మా బంగారు తల్లివి కదూ" బ్రతిమాలింది అనూరాధ.

అలా అమ్మా, తల్లీ అంటే కరిగే పిల్లకాదు చంద్ర. ససేమిరా వీల్లేదంది. "ఈ రోజు వేసుకొన్నావంటే నువ్వే ఉంచేసుకుని నాకు కొత్తవి కొనిపించు" అంది పైగా.

"దాన్ని అడిగే వేసుకెళ్ళాలా చాదస్తం" అంది తల్లి.

"లేకపోతే తర్వాత సతాయిస్తుంది" అని ఆ పాత చెప్పులకే ఎలాగో పిన్నీసు పెట్టి సరిచేసుకొంది అనూరాధ.

"అమ్మా, వెళ్తున్నా అలాగే లోకమ్మగారింటికెళ్ళి కాస్సేపు కుట్టుకొస్తాను" అంది.

"అటవుతే సాయంత్రం కానిరావా అనూ! నువ్వొచ్చే సరికి నేనుండను. నేను నాలుగింటికి వెళ్ళిపోతాను" అంది శ్రీమతి..

"రేపు ఆదివారమేగా! రేపు వెళ్ళకూడదూ!"

"మీ బావ తిడ్తారు బాబూ! అసలు వొద్దన్నే వచ్చేయమన్నారు."

"సరే నేను వెళ్తున్నా" అని రాధ వెళ్ళిపోయింది.

'రాధ అదృష్టవంతురాలు' అనుకుంది శ్రీమతి.

శ్రీమతిది ఉన్నదాంతో సర్దుకుపోయే స్వభావం కాదు. 'తనకన్న చెల్లెలు రాధ చాలా అదృష్టవంతురాలని అనుకుంది. చక్కగా స్వేచ్ఛగా బ్రతుకుతోంది. తల్లి చెప్పిన పనులు చేసేసి చక్కగా బట్టలు కుట్టుకుంటుంది! తనో! ఇంటికెళ్తూనే మోకాలు లోతున వంటిల్లు దర్శనం. వెధవ బండచాకిరీ చేయాలి. అసలు తను అనుకొన్నది ఏది జరిగింది గనుక' నిట్టూర్చింది.

శ్రీమతికి మొదటినుంచీ కోరికలెక్కువ --

కాలేజీలో చేరి తప్పకుండా చదువుకోవాలనుకుంది. తండ్రి చదివించలేదు. రైల్వేలోనే పనిచేసే వాడికి అయిదు వేలు కట్నంఇచ్చి - మరో అయిదువేలు ఖర్చుతో పెళ్ళి చేసేడు. ఆ ఖర్చునించి యిప్పటికీ తేరుకోలేదు. ఆఫీసులో ఎన్ని లోన్లు యిస్తారో అన్నీ తీసుకున్నాడు -

తనకేదో అన్యాయం జరిగిపోయినట్లు శ్రీమతి బాధ పడిపోతుంది.

డిగ్రీ వచ్చేకా పెళ్ళి చేసుకోవాలనుకొంది. అసలు కాలేజీ ముఖమే చూడలేదు. పెద్దకార్లు, మిద్దెలు లేకపోయినా తనూ భర్త చెట్టాపట్టాలేసుకుని చిలకా గోరింకల్లా తిరగాలనుకొంది - పెళ్ళయి కొత్తకాపరం పెడ్తూనే యిద్దరు మరుదులు చదువులంటూ వచ్చేరు. తనకున్న సరదాలు తన భర్తకిలేవు- కథల్లోలా భర్త ఆఫీసునించి వస్తూనే "ఏమిటా జిడ్డుముఖం - క్విక్ తొందరగా తయారవాలి - రెండు సినిమా టికెట్లు బుక్ చేసుకొచ్చాను" అంటూ తొందరచేయాలి - తన

అప్పటివరకూ ఏ నవలో చదువుకొంటూ - సమయమే గమనించదు - అప్పటికి వంట అవదు - అదేమాట భర్తతో అంటే - "వెధవ వంట - దానికోసం దిగులు చెందకు. సినిమా నించి అటునుంచటే హోటల్ కెళ్ళి భోజనం చేసివద్దాం" అనాలి. అలా ఎప్పుడూ - ఒక్కసారైనా భర్త అనలేదు. అసలు సినిమాకి వెళ్దామనుకొన్న రెండు నెలలకి కాని వెళ్ళడమే పడదు - తల్లితో అంటే "అతను బుద్ధిమంతుడు - మర్యాదస్తుడు - కష్టసుఖాలు తెలిసినవాడూను. ఇంతకన్న ఆడదానికి ఏం కావాలి? వెధవ సినిమాలదేముంది" అంటూ కొట్టిపారేస్తుంది. "అమ్మకి ఏ సరదాలూ తెలియవు" అని విసుక్కుంటుంది.

వారం క్రితం శ్రీమతికి జ్వరం వచ్చింది. తండ్రి వెళ్ళి తీసుకొచ్చేరు. వచ్చిన మర్నాడే జ్వరం తగ్గినా నీరసంగా వుందని - చంటి పిల్లతో చేసుకోలేదని ఉంచమన్నారు. ఆ అల్లుడు సరే అన్నాడు.

అనూరాధ సెంటరుకి వెళ్ళేసరికి చాలామంది వచ్చి బట్టలు తీసుకెళ్ళడం అయిపోయింది. సెంటర్లో కుట్టుకొనే వాళ్ళు మాత్రం కొంతమంది వున్నారు.

"ఏం యింత ఆలస్యంగా వచ్చేవ్" టీచరు అడిగింది.

"ఆలస్యమయిపోయిందండి. కోటా పంచేరా?"

"ఆఁ! యింకా కొంతమంది తీసుకెళ్ళాలనుకో! నువ్వింకా కాకీ నిక్కర్లు ఇవ్వలేదేమో!"

"ఒక్క కాజా బటన్సు చేయాలండీ! కుట్టడం అయి

పోయింది. అవి ఇస్తేగాని ఇప్పటి కోటా ఇన్వారా?" అని అడిగింది.

"అదేం లేదు. యిప్పుడు కోటా తీసికెళ్ళి సోమవారం నిక్కర్లు తీసుకొచ్చేయి" అంది టీచరు.

అనూరాధకి ఈ కోటాలోకూడా పది కాకీ నిక్కర్లు ఇచ్చేరు.

వచ్చి టీచర్‌కి చెప్తే ఆవిడ సెక్రెట్రీకి చెప్పమంది.

అనూరాధ సెక్రెట్రీ దగ్గరకి వచ్చింది.

"ఏమండీ నాకు పోయిన కోటాలో కూడా కాకీ నిక్కర్లు ఇచ్చి పాంట్లు తగ్గించేశారు - ఈసారి కూడా కాకీ నిక్కర్లు ఇచ్చేరు - ఈసారి కాకీ బట్ట నేను తీసుకోనండి" అంది.

"ఎవరంతర వాళ్ళే ఇలా అంటే ఎలా? ఒకళ్ళు పిల్లాడికి జ్వరమని - ఒకళ్ళు గుండెల్లో నొప్పని - ఈ కాకీ బట్టలు చూసేసరికి అందరికీ తలోటీ వస్తుంది. చిన్న పిల్లలు మీరు కూడా ఇలా అంటే ఎలాగ" మొహం ముట ముట లాడించింది సెక్రెట్రీ.

"వద్దన్న వాళ్ళకి మానేసి మా లాంటివాళ్ళకి అంట గడుతున్నారు. కోటా సమానంగా పంచి కాకీ బట్టలు కుడతా నన్న వాళ్ళకి వేరేగా ఇవ్వండి - అప్పుడు అందరూ ముందుకి వస్తారు."

అనూరాధ కాస్త కోపంగా అనేసరికి సెక్రెట్రీ నవ్వేస్తూ "ఏమిటి ఈ రోజు వస్తూనే దెబ్బలాట పెట్టు కున్నావు" అని జాయింటు సెక్రెట్రీతో "అనూరాధకి ఇంకో రెండు కోట్లు ఇవ్వండి" అంది.

అందరితో కోటా సమానంగా పంచేక అప్పుడు ఎన్ని కాకీ బట్టలు ఇస్తానన్నా తీసుకెళ్తానంది రాధ.

"అదేలా కుదురుతుంది. మెంబర్సు ఊళ్ళో లేనప్పుడు కోటా ఎక్కువన ఈయలేదా ?" సెక్రెటరి కస్సుమంది.

"అందరితో నాకూ ఇచ్చేరు.. కోటా అర్జంటుగా వెళ్ళాలి కాబట్టి" ధైర్యంగా అంది రాధ.

మిషను కుట్టుకుంటూ ఓ కన్ను, చెవి ఇటే వేసిన కొందరు 'మహా బాగా అంది' అనుకొన్నారు. అలా అనుకోవడం — చాటుని తిట్టుకోవడమే కాని ఒక్కరూ ముందు కొచ్చి ధైర్యంగా అడగరు.

ఏమనుకొందో సెక్రెటరీ అందరికీ ఇచ్చినట్లుగా అనూరాధకి కూడా కోటా ఇచ్చింది. అవి ఇస్తూ "ముందు కాకీ నిక్కర్లు ఇచ్చేయి" అంది.

దారపుకిళ్ళు, బటన్సు తీసుకుని రాధ వచ్చేసింది

రెండు బట్టలు రెండు చేతులతో పట్టుకుంది. చెప్పులు సరిగాలేని కారణంగా గబగబా నడవలేక పోతోంది.

'ఈసారి డబ్బు రాగానే ముందు చెప్పులు కొనుక్కోవాలి' అనుకుంది.

రాధ లోకమ్మ గారింటికి వచ్చింది.

"ఓసారి ఆయిలు పోసి తుడిచి మరీ మొదలెట్టు రాధా!" అంది లోకమ్మ.

ఆవిడ మిషను కూడా తుడవదు.

"ముందు కాకీ బట్టలు ఇచ్చేయమన్నారండీ ! కాకీవి కుట్టేక మీావి కుడ్తాను" అంది అనూరాధ.

"అదేం" అని "సర్లే" అనేసింది

లోకమ్మ కూడా మెంబరే. ఆవిడ భర్త పూనాలో వుంటాడు. ముగ్గురు అమ్మాయిలు. ఆవిడకి సెంటర్లో బట్టలు కుట్టకపోయినా ఫరవాలేదు. వెనకాల కాస్తో కూస్తో ఆస్తి వుంది. అయితేనేం? డబ్బు వస్తోంటే - అందులో పిసరంత శ్రమపడక్కర లేకుండా డబ్బు వస్తోంటే చేదు లేదుగా! సెంటర్ నించి బట్టలు తెచ్చుకొంటుంది. అనూరాధ ఆ బట్టలు కుడ్తుంది - కాజా బటన్సు కూడా కుట్టి ఇస్తుంది. తను ఆ బట్టల మీద తన పేరు పొడి అక్షరాలతో రాసి పనిమనిషి చేత పట్టించుకెళ్ళి సెంటర్లో అందజేస్తుంది లోకమ్మ.

అనూరాధకి ఇది నష్టమే! ఏం చేస్తుంది. కనీసం రెండు వంతులు తనకి ఒక వంతు లోకమ్మకి అయితే బాగుండేది కాని లోకమ్మ ఒప్పుకోలేదు. ఒకదానికి చార్జి రెండు రూపాయలయితే ఇద్దరికీ చెరో రూపాయి.

అనూరాధకి ఇంట్లో మిషను లేదు. సెంటర్‌లో ఒక్క గంట కన్న మిషను ఇవ్వరు. అంతకన్న ఖాళీలుండవు. సెంటర్లో కుట్టుకొనే వాళ్ళు బోల్డుమంది. రోజుకి ఒక్క గంట మిషను ఇస్తే ఎన్ని బట్టలని కుట్టగలదు. లోకమ్మ మిషను ఇస్తుంది. సెంటరుబట్టలే కాకుండా ఇంటిబట్టలుకూడా కుట్టుకో నిస్తుంది. ఆ ఒప్పందం మీదే లోకమ్మ పేరుమీద 'కోటా బట్టలు రాధ కుట్టి ఇచ్చేటట్లు - వచ్చిన డబ్బు చెరిసగం తీసుకొనేటట్లు మాట్లాడుకొన్నారు. లోకమ్మ ముందు తన బట్టలు అయినాకనే రాధవి కుట్టుకోనిస్తుంది. అవసరం తనది అనుకున్న రాధ ఆవిడ ఇష్టప్రకారం చేస్తుంది.

నాలుగ్గంటలయ్యేసరికి అయిదు నిక్కర్లు కుట్టేసింది. లోకమ్మ ఎక్కడికో వెళ్ళడానికి తయారయింది. "నువ్వు కుట్టుకో! వెళ్ళేటప్పుడు తాళంవేసి అనసూయకియ్యి" అంది అలా రాధకి ఇష్టంలేదు, వాళ్ళు లేనప్పుడు ఉండటం.

అప్పటికి అయిదో నిక్కరు జాయింటు చేయాల్సింది వుంది.

అదొకటి జాయింటు చేసేస్తే ఈ రాత్రి ఇంట్లో కాజా బటన్సు చేసేయవచ్చని గబగబా కుడుతోంది. సూది దిగటం లేదు మొద్దులా వున్న కాకీబట్ట పాదం కింద ఇముడటం లేదు.

'వెధవ కాకీ బట్టలు' మనసులోనే విసుక్కుని ఒక్కసారి విసురుగా చక్రం తిప్పి - ఆ వూపులో సూది దిగాలని పాదాలు స్టాండుమీద ఆడించింది. ఈ కంగారులో వేలు ఎక్కడున్నదీ చూసుకోలేదు. బట్టమీద పడాల్సిన సూది గోరుమీంచి వేలులోకి దిగిపోయింది.

ఒక్కసారిగా కెవ్వుమంది రాధ.

"ఏమిటి - ఏమయింది" అంటూ కంగారుగావచ్చింది లోకమ్మ.

పిల్లనెత్తుకుని ఇటూ అటూ తిరుగుతున్న అనసూయ కంగారుగా వచ్చింది. సూదినించి వేలు తీద్దామంటే రాలేదు. బిగుసుకు పోయినట్టయి పోయింది. రాధకి నెప్పికూడా ఏం తెలియట్లేదు. లోకమ్మ, అనసూయ కంగారుపడిపోతున్నారు.

స్క్రూ తీసేసి మిషను నించి సూది వేరు చేయమని రాధే సలహా ఇచ్చింది.

సూది బిగుసుకు పోయినట్టయింది. అది లాగపోతే

రాధ కెవ్వుమంది. ప్రాణం పోయేంత బాధ. అనసూయ ఖంగారు పడిపోయింది.

లోకమ్మ సున్నితంగా సూది తీయబోయింది. రాధ గిలగిల్లాడి పోయింది.

"ఎలాగోలాగ ఓపికపట్టు రాధా! లేకపోతే హాస్పటల్‌కి వెళ్ళాల్సొస్తుంది. వాళ్ళు ఇంత ఓపిగ్గా తీయరు" అంది. లోకమ్మ.

రాధ గట్టిగా కళ్ళు మూసుకుంది. ప్రాణం ఉగ్గబెట్టుకూర్చుంది —

లోకమ్మ ఎలాగయితేనేం సూది లాగేసింది.

బొటా బొటా రక్తం కారిపోతోంది.

రాధ ఏడుపుని అతి ప్రయత్నంమీద ఆపుకొంటోంది.

లోకమ్మ గుడ్డపీలిక తడిపి తీసుకొచ్చి వేలుకి కట్టు కట్టింది.

"మీరు వెళ్ళండి" అంటూ లేచి నిలబడింది రాధ.

"ఫర్వాలేదు కూర్చో!" అంది లోకమ్మ.

"మా యింట్లో కూర్చుంటుంది లెండి, మీరు వెళ్ళండి" అని అనసూయ రాధని తీసుకొచ్చింది. రాధ వద్దు అంటున్నా వినకుండా వేడి టీ చేసి యిచ్చింది. సూది తీయని క్రితం బాధ తెలియలేదుగాని సూది తీసినప్పటినుండి వేలు గునపాలతో పొడుస్తున్నంత బాధగావుంది.

ఈ రోజు అయిదు నిక్కర్లకి కాజా, బటన్స్ కుట్టేయా

లనుకుంది. రేపు వున్న కాకీబట్టలు కట్టేయాలనుకుంది. రేపు పోటు తగ్గకపోతే ఏం కట్టగలదు. రాధకు చాలా నిరాశ కలిగింది.

"చాలా బాధగా వుందా రాధా!" అని అడిగింది అనసూయ.

"కొద్దిగా" అంది.

"కాస్సేపు పడుకోకూడదూ!"

"వద్దు అనసూయా! యింక యింటికి వెళ్తాను" అంటూ లేవబోయింది.

"ఇప్పుడేం వెళ్తావ్! కాస్సేపున్నాక వెళ్దువుగానిలే" అంటూ కూర్చోబెట్టేసింది.

"అలా ఎలా పడింది రాధా!" అని అడిగింది.

రాధ చెప్పింది.

"ప్చ్! ఏమిటో యిన్ని బట్టలు కుడుతున్నావ్. సెంటర్లో మిషన్లు యిచ్చినప్పుడు నువ్వూ తీసుకుంటే ఈ పాటికి శాకీ తీరిపోను - నీకీ తిప్పలుండేవి కావు" అంది జాలిగా అనసూయ.

'నిజమే తండ్రికి చెప్పినప్పుడు తండ్రి ఊఁ, ఆఁ అనలేదు. నిజానికి తండ్రి చేతి డబ్బు ఏమీ పడదు. కాని, తను బట్టలు కుట్టిన డబ్బు చిన్న చిన్న ఖర్చులకి సరిపోతోంది. అది వరకు నాలుగు మూడు నెలలకి కాని డబ్బు వచ్చేది కాదు. యిప్పుడు సాధారణంగా ఏ నెలకి ఆ నెలకే డబ్బు చేతికి వచ్చేస్తోంది. తప్పితే తర్వాత నెలకి తప్పకుండా వస్తోంది..

వంపరూపాయలు వస్తే అది మరో ఖర్చుకి కలిసివస్తోంది. ఎంత తక్కువ కోటావున్నా ఏభై రూపాయలకి తక్కువరాదు.

తండ్రిని రెట్టించి తను అడగలేకపోయింది. తల్లి చెప్పినా తండ్రి 'వూ' అనలేదు.

వీళ్ళిద్దరూ యిలా మాట్లాడుకొంటోంటే కృష్ణ మోహన్ వచ్చేడు.

"రండి రండి" అంది అనసూయ.

రాధ లేచి లోపల గదిలోకి వెళ్ళిపోయింది.

ఆ రోజు కిటికీ దగ్గర నిలబడి చూసింది ఇతనేనని గ్రహించింది.

'చదువు, సంస్కారం వున్నవాడిలాగానే వున్నాడు. అదేంబుద్ధి' అనుకుంది.

అతను లోపలకి రాలేదు.

"ఆంజనేయులు ట్రంకాల్ చేశాడు. పని అవక ఈ రోజు రాలేకపోయాట్ట. రెండు రోజుల్లో వస్తానని - కంగారు పడద్దని చెప్పమన్నాడు" అన్నాడు.

"ఈ రోజు ఎందుకు రాలేదా అని ఖంగారు పడు తున్న మాట నిజమే! రండి, లోపలకి రండి. మీరు కాఫీ తీసుకోందే వెళ్ళడానికి వీల్లేదు" అంటూ పట్టుబట్టింది.

ఆంజనేయులు వున్నప్పుడే అనసూయతో మాట్లాడ టానికి మొహమాటంగా వుంటుంది. యిప్పుడు అనసూయ రమ్మనగానే వచ్చునో, మాననో - రాధని గురించి తెలుసు కోవాలనే ఆరాటం అతన్ని నిలవనీయటం లేదు. యిలా

ఎందుకు ఆరాట పడుతున్నాను? అని తనని తనే ప్రశ్నించు కొంటాడు. సమాధానం దొరకదు -

అతను లోపలకి వచ్చేడు.

టీ అవుతే తొందరగా అవుతుందని స్టౌవ్ మీద టీకి నీళ్ళు పెట్టి ముందు గదిలోకి వచ్చింది అనసూయ.

రాధ తమ్ముడు వచ్చేడు "మా అక్కవుందా" అంటూ.

"రాధా, మీ బాబు వచ్చేడు" అని పిల్చింది అనసూయ.

రాధ రాకకోసం ఆత్రతగా గుమ్మంకేసే చూడసాగాడు కృష్ణమోహన్.

పాలవాడు వస్తే పాలు పోయించుకోడానికి అనసూయ బయటకెళ్ళింది.

రాధ ముందు గదిలోకి రాగానే - తనకి తెలియకుండానే కృష్ణమోహన్ రెండు అడుగులు ముందుకి వేశాడు.

అతని మనసులోని సంఘర్షణ ఏమీ తెలియని రాధ - మామూలుగా తలొంచుకుని వెళ్ళిపోయింది. సభ్యత లేకుండా ఆ రోజు కిటికీ దగ్గర నిలబడి చూశాడనే నిరసన భావం కలగకపోలేదు కృష్ణమోహనంటే రాధకి.

రాధ వీళ్ళకి బంధువు కాదని తెలిసినా రాధ గురించి తెలుసుకోవాలనే ఆరాటంతో లోపలకొచ్చిన అనసూయని "బంధువులా ?" అని అడిగాడు.

"కాదు" అంటూ రాధ కుటుంబం గురించి స్పష్టంగా చెప్పి, "పాపం చాలా కష్టపడుతోంది. వాళ్ళ తమ్ముడికి

ఉద్యోగం వస్తే కొన్ని కష్టాలు గట్టెక్కుతాయి." అని సూది వేలుమీద పడిన సంగతికూడా చెప్పింది.

అతని మనసు బాధగా మూలిగింది.

"మీ మేనేజరు ఇంటర్వ్యూకి వెళ్ళినట్టు విన్నాను. అతనికి ఉద్యోగం వచ్చిందా ?" అని అడిగింది.

"వచ్చింది, యింక నాలుగు రోజుల్లో వెళ్ళి జాయినవుతాడు" అన్నాడు.

అడగనా, మాననా అని కాస్సేపు తటపటాయించింది. మళ్ళీ అడిగేసింది. "రాధ తమ్ముడు బి. కాం పాసయ్యాడు. రెండేళ్ళయింది. మీ దగ్గరకొచ్చిన యిద్దరు మేనేజర్లకి మంచి ఉద్యోగాలొచ్చాయి - అతను వెళ్ళిపోతే ఆ పోస్టు ఖాళీయేగా! అది రాధ తమ్ముడికి ఇవ్వడానికి వీలవుతుందా ?"

"రవిశంకర్‌తో చెప్తాను" అనసూయ చొరవకి ఆశ్చర్యపోకుండా ఉండలేకపోయాడు కృష్ణమోహన్.

"నేను చొరవగా అడిగినందుకు మీరేమీ అనుకోవద్దు-రాధ వాళ్ళ కుటుంబం అంటే నా కెంతో జాలి. రాధకి నాకు బాగా స్నేహం కలిసింది. చాలా మంచి అమ్మాయి - తను అలా కష్టపడుతుంటే చూళ్ళేక......"

"అబ్బే, ఇందులో అనుకోవడానికి ఏముంది ? రవితో చెప్తాను" అన్నాడు.

రాధ తమ్ముడుకి ఉద్యోగం ఇచ్చి - వాళ్ళ కుటుంబాన్ని ఆదుకోవాలని వుంది కృష్ణమోహన్‌కి.

* * *

అనసూయ భర్తకి చెప్పడం - ఆంజనేయులు కృష్ణ మోహన్‌కి, రవిశంకర్‌కి చెప్పడం - రాఘవయ్యగారు గోపీకి ఉద్యోగం రావడం చకా చకా జరిగిపోయింది.

కొడుక్కి ఉద్యోగం దొరికిందనే సరికి కనకమ్మ సంతోషం ఇంతా అంతా కాదు. 'అమ్మయ్య! కష్టాలుగట్టెక్కాయి' అనుకుంది.

రామనాథం తేలిగ్గా వూపిరి పీల్చుకొన్నాడు.

కనకమ్మ ఆ దొడ్లో వాటాల వాళ్ళకి గోపీకి ఉద్యోగం దొరికిందని చెప్పింది సంబరంగా. ఆ దొడ్లో నాలుగు వాటాల వాళ్ళు చాలా సంతోషించేరు. కాని, ఈ మధ్యనే - అదివరకు వున్న ఇంటికి ఎనభై రూపాయలు అద్దె ఇచ్చుకోలేక ఈ దొడ్లో చిన్న గదులు రెండు ఏభై రూపాయలకి వుందని తెలిసి రేసులు వేడి భరించలేను అని కొడుకు మొత్తుకున్నా వినకుండా వచ్చిన దుర్గమ్మకి కనకమ్మ అంత సంతోషంగా దొరికిందని చెప్తోంటే చాలా ఈర్ష్యగా అనిపించింది. 'ఎంత అదృష్టవంతురాలు - సత్యానికి ఉద్యోగం దొరికితే తన కెంత నిశ్చింతం! ఆ అదృష్టం తన కెక్కడిది ...'

"ఏ ఉద్యోగనమ్మా నీ కొడుక్కి" అని అడిగింది.

చెప్పింది కనకమ్మ.

పిల్లలు పిలవగా కనకమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

గోపీకి ఎక్కడ ఉద్యోగమో విన్న దుర్గమ్మకి మనసు భగభగ మండిపోయింది. తన కొడుకుని రమ్మని - మొండి చెయ్యి చూపించిన కృష్ణ గోపీగాడి కిచ్చేడా! ఖర్మం చుట్టాలా - పక్కాలా! నా అన్నవాళ్ళ అన్న అభిమానం

లేనుగాబట్టే అలా ఒంటికాయ్ శొంఠికొమ్ములా ఏకుస్తున్నాడు!

ఇలా ఎన్ని అనుకున్నా ఆవిడ కడుపుమంట తీరలేదు.

భోజనం అయినాక కనకమ్మ వాటాలోకి వచ్చింది. "ఏం చేస్తున్నావమ్మా" అంటూ.

"రండి కూర్చోండి" అని పీట వాల్చింది కనకమ్మ.

రాధ కోట్లుకి కాజాలు కుడుతోంది. చంద్ర మంచం మీద పడుకుని ఫ్రెండింటి దగ్గరనించి తెచ్చుకున్న నవల శ్రద్ధగా చదువుకొంటోంది.

"మీ అక్క అంత కష్టపడుతోంది నువ్వు కాస్త సహాయం చేయకూడదవంటే చంద్రా" అంది దుర్గమ్మ.

"నాకలాంటివి చేతకావండి" పుస్తకంలోంచి తలెత్తకుండానే జవాబిచ్చింది.

"తమ్ముడికి ఉద్యోగం వచ్చిందిగా అక్కకి మనువు కొంటారా" అంది.

కనకమ్మ నవ్వి ఊరుకుంది.

"గోపీకన్న రాధే చిన్నదిలా వుంటుంది - చెప్తేగాని ఎవరూ అనుకోరు" అంది.

"ఇవరికి ఏటిమీద మూడు నెలలు తేడా అంతే." అంది కనకమ్మ.

"రాధని చేసుకున్న నాడు అదృష్టవంతుడు. చేతినిండా పనే" రాధని అభిమానంగా చూస్తు అంది.

'ఈ రోజు ఇలా మొదలెట్టిందేమిటి' విసుక్కుంది మనసులోనే.

"కృష్ణమోహనేనా మీ అబ్బాయికి ఉద్యోగం యిచ్చింది" అని అడిగింది దుర్గమ్మ.

"ఏమోనండి అది నాకేం తెలియదు. అనసూయకు, రాధకి బాగా తెలుసు. ఆ అమ్మాయి భర్తకి చెప్పి అవతల వాళ్ళకి చెప్పించిందిట - ఏదో భగవంతుడికి ఇన్నాళ్ళకి దయ కలిగింది" అంది.

"వాడు మంచి పనులు చేయడులే! ఏదేనా ఒకపని చేసేటప్పుడు దాని వెనక ఓ పెద్ద కథ వుంటుంది - ఆ మధ్య మా సత్తిగాడు వద్దురా అన్నా వెళ్ళాడు చుట్టరికాన్ని మర్చిపోలేక - వాడి మొహానికి చుట్టాలేమిటి - బంధుత్వాలేమిటి - అందుకే వాడి జీవితం అలా తగలబడింది. వాడి నీడని జేరినవాళ్ళు కూడా సుఖపడరనుకో! తాచుపాము నీడని చేరినట్టే. అబ్బాయిని ఆట్టే వాడితో తిరగద్దను" అని చెప్పి మనసుని కొంత తేలికపరుచుకుంది.

ఆవిడ చెప్తున్నదేమిటో కనకమ్మకి బొత్తిగా అర్థం కాకుండా పోయింది. రాధ మనసు అయోమయమయిపోయింది. 'అతనే ఆ కృష్ణమోహన్ ద్వారానే కదా గోపీకి ఉద్యోగం వచ్చింది. అతను మంచివాడు కాడా? -'

"ఏమండీ అతను మంచివాడు కాడా" కూతురి మనసులో భావాన్ని ఊహించినదానిలా కనకమ్మ అడిగింది.

"అయ్యో! యింకా నింపాదిగా అడుగుతున్నావా! నష్టజాతకుడు - ఒక్క మాటలో చెప్పాలంటే దరిద్ర జాతకుడనుకో! పూర్వజన్మలో ఏదో పుణ్యం చేసుకొన్నట్టున్నావు.

ఆ రవిశంకర్ ఆదుకొన్నాడు కాబట్టి సరిపోయింది గాని ఈ పాటికి ఏ జేబు దొంగతనాలో చేస్తూ బ్రతికేవాడు కదూ!" కాస్త ఆగింది దుర్గమ్మ.

తల్లీ కూతురూ తెల్లబోయి వింటున్నారు.

దుర్గమ్మ తల్లీ కూతుళ్ళకేసి చూస్తూ మళ్ళీ అంది, "పుడుతూనే తల్లి ఆరోగ్యాన్ని మింగేశు, అది తీసుకు తీసుకుని చచ్చింది. అది చచ్చిన ఆర్నెల్లకే తండ్రి చచ్చేడు. వీడ్ని దగ్గిర వుంచుకోడానికే భయపడ్డారు మేనత్తా, బాబయ్యలూను. ఓ వెర్రి మేనమామ వున్నాడులే! జాలి పడి యింట్లో పెట్టుకున్నాడు. కాని పాముకి పాలుపోసి పెంచుతున్నామని పాపం ఆ భార్యా భర్తలు అనుకోలేదు. వెర్రి వెంగళాయిల్లా తిండీ, బట్టా యిచ్చి చదువు చెప్పించేరు. వాళ్ళకో కూతురుంది - ఎంత అందలం ఎక్కిద్దామన్నా లేకి బుద్ధులు ఎక్కడకి పోతాయి? ఆ పిల్లని నానా అల్లరి పెట్టాడట - అది మందు మింగి చచ్చింది. దాంతో భయపడి యింట్లోంచి పారిపోయాడు. రోడ్లమ్మట పిచ్చాళ్ళా తిరుగుతోంటే జాలిపడి పినతండ్రి రమ్మన్నాడు - ఏ మొహం పెట్టుకుని వస్తాడు? తర్వాత ఈ రవిశంకర్ తీసుకొచ్చి కాస్త మనిషిగా నిలబెట్టేడు."

దుర్గమ్మ ఈ మధ్యే రావడంవల్ల ఆవిడ గురించి వాళ్ళకి తెలియదు. ఆవిడ చెప్పిందంతా నిజమే అనుకొన్నారు.

"మీరు బంధువులా?" కనకమ్మ అడిగింది.

"పీడి తండ్రి నేను అన్నదమ్ముల మనవలమే !"

దుర్గమ్మ వచ్చిన పని అయినట్టు వెళ్ళిపోయింది.

కొడుక్కి ఉద్యోగం దొరికిందన్నప్పుడున్న సంతోషం సన్నగిల్లింది కనమ్మకి.

అదేమాట కూతురితో అంది.

"అతనితో గోపీకేం సంబంధం ! తన డ్యూటీ తను చేసుకొంటాడు. అయినా గోపీ చంచల స్వభావుడు కాడు" అంది రాధ.

ఆ రోజు అతను కిటికీ దగ్గర నిలబడి తనకేసి చూడడం మర్చిపోలేదు.

* * *

దుర్గమ్మ కృష్ణమోహన్ దగ్గరకి వచ్చింది.

"ఏం నాయనా ! మేమంత పనికి రానివాళ్ళమయి పోయామా ? ముక్కు మొహం తెలియని వాళ్ళకి పిల్చి నుకి ఉద్యోగం ఇచ్చేవు" నిష్ఠూరంగా అంది.

"మీ అబ్బాయిని వెళ్ళమని చెప్తే వెళ్ళలేదు. నన్నేం చేయమంటారు ?"

"నువ్వు కాస్త ఉత్తరంముక్క ఇయ్యకపోతే అతను మా ముఖం చూస్తాడా చెప్పు. నువ్విలా దాటేస్తావని మాత్రం అనుకోలేదు. పోనీ ఆ మేనేజరు ఉద్యోగం కాక పోతే మరోటి. ఏదో ఒకదారి చూపెట్టు నాయనా" ప్రాధేయ పడుతున్నట్లుగా అంది.

"రేపు ఆఫీసుకి వచ్చి కలవమనండి" అన్నాడు జాలి పడి.

సత్యాన్ని వెళ్ళమని పంపితే - వెళ్ళకుండా వెళ్ళేనని - కూలిపనిలాంటిది యిస్తానన్నాడని - తను నాలుగు జాడించి వచ్చేనని చెప్పేడు.

దుర్గమ్మ నిజమేననుకొంది.

కృష్ణమోహన్ గురించి యింకా యాగీ చేయనారంభించింది.

నెలరోజులు గిర్రున తిరిగిపోయినాయి.

ఇంకో వారానికి గోపీకి జీతం వస్తుందనే సరికే మొదట జీతంతో ఎవరికి ఏం కొనాలనే పథకాలు వేశారు గోపీ, అనూరాధాను.

"అమ్మకి చీర ఎంత అవుతుందే" అని అడిగాడు గోపీ.

"ఎంతంటే ఏం చెప్పను? ఎంతలో అంటే అంతలో వుంటాయి" అంది.

"అంటే మకీ నాసిరకం కాకుండా, నాన్నకి మంచి ఫాంటు, షర్టు. అమ్మకి చీర, జాకెట్టు బట్ట - వాళ్ళిద్దరికీ రెండువందలు పెడ్తే రావూ" అన్నాడు.

"వస్తాయి. అప్పుడే వాళ్ళకి చెప్పకు. ముందే చెప్పేవంటే వద్దని గొడవ చేస్తారు" అంది రాధ.

"చంద్రాకి ఏం తీసుకుందాం" అన్నాడు.

"ఓణీలు కావాలని గొడవ చేస్తోంది కదా! ఒకటో రెండో ఓణీలు తీసుకుందాం" అంది రాధ.

ఇద్దరూ కూర్చుని అందరికి తలోటి కొనాలంటే వచ్చే జీతం సరిపోతుంది.

వచ్చిన జీతం అంతా ఇలా స్వతంత్రంగా కొనేసి తండ్రికి డబ్బేమీ ఇవ్వకపోవడం ఇద్దరికీ నచ్చలేదు. అందరికీ కొన్నప్పుడు అక్క శ్రీమతికి ఏం కొనకపోతే ఏం బాగుంటుంది? గోపీకి అనూరాధకి మంచిచీర తీసుకోవాలని వుంది. అనూరాధకి తీసుకుని శ్రీమతికి తీసుకోకపోతే బాగుండదు. చంద్ర కోపంగా చిందులు తొక్కుతుంది - శ్రీమతి కోరచూపులతోనే సాధిస్తుంది.

"అమ్మకి నాన్నగార్కి తీసుకో చాలు. నాన్నగార్కి డబ్బు ఇస్తే ఆసరాగా వుంటుంది" అంది రాధ.

"బాబుకి పెన్ను, చెప్పులు కొనిస్తానని మాటిచ్చేనే" అన్నాడు.

"చెప్పులు కొట్టేసి - పెన్ను కొందాం" సలహా ఇచ్చింది.

"వాడికి కొని చంద్రాకి ఏం కొనకపోతే చంపేస్తుందే బాబు. ఆ కొనేది ఆ వోశిలేవో కొంటే కొన్నాళ్ళు ఇంట్లో సాధింపులు వుండవు" అని క్షణం ఆగి, "రాధా! నీకేం కావాలో చెప్పు" అన్నాడు.

"నాకా!" తెల్లబోయింది. తన గురించి ఆలోచించ లేదసలు రాధ.

"ఏం? నీకేమీ అక్కర్లేదా? అదేం కుదర్దు. నువ్వు వద్దన్నావంటే అమ్మా నాన్నగార్లకి కూడా కొనద్దు" ఖచ్చితంగా అన్నాడు.

"తప్పు అలా అనకూడదు" చప్పున అంది.

"మరి చెప్పు."

"చూడు గోపీ! నాకు కొంటే, అక్కని ఒక్కదాన్ని వదిలేస్తే బాగుంటుందా చెప్పు. ఇలా అందరికీ ఒకేసారి కొనాలంటే నాన్నగార్ని డబ్బు అడగాలి. చంద్రాకి కూడా మానేయి. సెంటరు డబ్బు రాగానే ముందు దానికి ఓణీలు తీసుకుందాం. మందుల షాపులో డబ్బు కట్టాలికదా. దానికయినా ఖర్చు కలిసొస్తుంది" అంది.

మొత్తం రెండు వందల్లో తెముల్చాలని నిర్ణయించుకున్నారు.

జీతం తీసుకున్న రోజున అనూరాధని ఫలానాషాపు దగ్గరకి రమ్మనిచెప్పేడు గోపీ. ఇంటికి జీతంతో బాటు, తల్లి దండ్రులకి బట్టలు కూడా తీసుకురావాలనే కుతూహలంతో.

అనూరాధ గోపీ రమ్మన్న టైముకి వచ్చేసింది.

అనూరాధ వచ్చిన పావు గంటా ఇరవై నిముషాలకి గోపీ కృష్ణమోహన్ స్కూటరు మీద వచ్చేడు.

కాలి నడకన వచ్చే వాళ్ళల్లో గోపీ కోసం ఎదురు చూస్తున్న రాధ తన పక్కనే స్కూటరు ఆగటంతో ఉలిక్కి పడింది.

కృష్ణమోహన్ కూడా స్కూటరు దిగి స్టాండు వేశాడు.

"మా అక్క రాధ" అని కృష్ణమోహన్‌కి పరిచయం చేస్తూ, కృష్ణమోహన్‌ని రాధకి పరిచయం చేశాడు.

తప్పనిసరిగా చేతులు జోడించి నమస్కారించింది. రాధ.

"అహా ... అలాగా" అన్నట్లు అతను తల ఆడించేడు కృష్ణ.

మర్యాదకి నమస్కారించి పక్కకి తిరిగిన రాధ అతను తిరిగి నమస్కారించాడో - తల ఆడించాడో ఏం గమనించ లేదు - పట్టించుకో లేదు.

గోపీ మాత్రం కొంచెం తెల్లబోయినమాట నిజమే. కృష్ణమోహనంటే గోపీకి ఒక విధమైన గౌరవభావం వుంది. అప్పుడప్పుడు ఇంటి విషయాలు అడిగి తెలుసుకొంటుంటాడు.

'ఏదో పరాగ్గా వున్నాడేమో' అనుకున్నాడు.

కృష్ణమోహన్ మాట్లాడుతూ మాట్లాడుతూ అప్పు డప్పుడు మధ్యలో పరధ్యానంగా అయిపోవడం ఈ నెల రోజుల్లో నాలుగయిదు సార్లు చూశాడు.

"అలా వెళ్ళి కాఫీ తాగివద్దాం" అన్నాడు కృష్ణ మోహన్.

'ఇతను తొందరగా వెళ్ళిపోతే బాగుణ్ణు' అని జపం చేస్తున్న దానిలా నిలబడ్డ రాధ ఉలిక్కిపడింది. గోపీకేసి 'ఒద్దు' అన్నట్టు చూసింది.

గోపీ ఇబ్బందిలో పడిపోయాడు.

అవతల అతను బాస్‌లాంటి వాడు - రాధకి ఇష్టంలా లేదు.

"రండి" అంటూ దారి తీశాడు కృష్ణమోహన్ ఎదురు గుండా హోటల్లోకి.

ఇంక బాగుండదని రాధని బయలుదేరదీశాడు గోపి.

ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చుంది అనూరాధ.

ఓ పక్క అనూరాధని అంత దగ్గర చూశానన్న ఏదో తెలియని ఆనందం - మరో ప్రక్క "ఇదీ" అని చెప్పలేని ఆవేదనతో కృష్ణమోహన్ సతమతమవుతున్నాడు. అవ్యక్తమయిన బాధ అతని గుండెలని పిండేస్తోంది.

గోపీ ఏదో మాటలు కల్పించుకుని మాట్లాడుతున్నాడు.

కృష్ణమోహన్ రాధకేసి చూశాడు. రాధ బలవంతంగా - అయిష్టంగా కూర్చున్నట్లు కనపడింది.

'మొహమాటస్తురాలేమో' అనుకున్నాడు.

అతను స్వీట్‌కి ఆర్డరిచ్చేడు.

"నేనేం తీసుకోలేనండీ" మెల్లగా అంది రాధ. రాధకి ఇష్టం లేదు.

"ఏం ఎందుకని ?" రాధనే చూస్తూ అడిగాడు కృష్ణమోహన్. ఇంత దగ్గర పోలికలున్న వాళ్ళని అదివరకు ఎవర్ని చూడలేదతను. అత్తయ్యా మామయ్యా రాధని చూస్తే - బాధని మర్చిపోతారా ? తను వాళ్ళని తీసుకొచ్చి రాధని చూపిస్తే! ఇప్పుడిప్పుడే ఆ బాధనుండి కోలుకుంటున్న వాళ్ళని మరీ బాధపెడుతున్నట్లు అవుతుందేమో — కృష్ణమోహన్ అన్నదానికి రాధ మాట్లాడలేదు.

స్వీట్ తీసుకుని - కాఫీ తాగి ముగ్గురు బైటికి వచ్చేరు.

కృష్ణమోహన్ గోపీతో బాటు రాధకి కూడా చెప్పి వెళ్ళిపోయాడు.

తల వూపీ వూపనట్టుగా వూపింది రాధ.

అతను వెళ్ళిపోగానే తేలిగ్గా వూపిరి పీల్చుకుంది రాధ.

"అలా ముడుచుకుపోయినట్లు కూర్చుంటావేం. మర్యాదకన్నా రెండు మాటలు మాట్లాడవద్దా!" అన్నాడు గోపి.

"బాగుంది. అతన్తో నాకేం పరిచయం" అంది రాధ.

"ఇతను కలగజేసుకోబట్టే నాకు ఆ ఉద్యోగం వచ్చింది."

"ఆ మాట అనసూయకి తెలుస్తుంది."

"ఆవిడ చెప్పినంతమాత్రాన అయిపోతుందా?... యితను చాలా మంచివాడు. ఎంత బాగా మాట్లాడతాడో తెలుసా?" కాస్త గర్వంగా అన్నాడు.

"సర్లే బాబు. యింక అతని గొడవ వదిలేసి తొందరగా నడు. అతని ధర్మమా అని గంట ఆలస్యం" అంటూ గబగబా అడుగులు వేయసాగింది రాధ.

* * *

కృష్ణమోహన్ ఇంటికొచ్చేసరికి పార్వతి ఎదురొచ్చింది. కలా నిజమా అనిపించింది. అతను రెండుసార్లు వెళ్ళి రమ్మని అడిగినా "వస్తాలే కృష్ణా!" అంటూ దాటేసింది గాని రాలేదు. ఈమధ్య కృష్ణమోహన్ దగ్గరనించి ఉత్తరాలు లేకపోవటంతో "కృష్ణకి నా మీద చాలా కోపం

వచ్చింది. అందుకే ఉత్తరాలు వ్రాయటం మానేశాడు." వెంటనే బయలుదేరి వెళ్ళాలని పట్టుబట్టింది.

వాళ్ళరాకతో అతని మనసు కాస్త తేలికపడింది.

లేకపోతే ఈ రోజంతా చాలా తిక్క తిక్కగా వుండేది.

రాధని చూడాలని ఏదో వెర్రి ఆరాటం - తీరా రాధని చూశాక రెండు రోజులకి కాని తేరుకోలేడు.

అనూరాధని చూసినప్పటినుండి యించుమించుగా అతని పరిస్థితి అలాగే వుంది.

మేనత్తని, మేనమామని రవిశంకర్ ఇంటికి తీసు కెళ్ళాడు.

ఎన్నాళ్ళనుండో పరిచయస్థుల్లా మాట్లాడుకున్నారు పార్వతి, భద్రమ్మగారూను.

"మా అబ్బాయి పెళ్ళికి మీ దంపతులు తప్పకుండా రావాలి. ముహూర్తం పెట్టుకోగానే ఉత్తరం రాయిస్తాను" అంది భద్రమ్మగారు.

"తప్పకుండా వస్తాం" అంది పార్వతి.

"కృష్ణకి పెళ్ళి మీరే తలపెట్టాలి. నేను చెప్తే కృష్ణ 'ఊం, ఆం' అనలేదు" వీళ్ళ సంగతులేవీ తెలియని భద్రమ్మ గారు మామూలుగా అంది.

కృష్ణమోహన్ లేచి ముందు వరండాలోకి వెళ్ళి పోయాడు.

పార్వతి అదోలా అయిపోవడం గ్రహించిన భద్రమ్మ గారు కంగారుగా ప్రకాశరావుకేసి చూసింది.

"మీ మాటలబట్టి చూస్తూంటే మీకేం తెలియ నట్టుగా వుంది." అసలు సంగతి హీనస్వరంతో చెప్పేడు. భద్రమ్మగారు చాలా నొచ్చుకుంది. "అందుకా అబ్బాయి పెళ్ళి మాటలు ఎత్తేసరికి మౌనం వహించేవాడు! రవికూడా నాకేం చెప్పలేదు. నా మాటలకి కృష్ణ ఏం నొచ్చుకొనే వాడో" అంటూ బాధపడింది.

తర్వాత వాళ్ళని ఓ రోజు భోజనానికి పిలిచి -

"మీరే అబ్బాయికి ఎలాగయినా నచ్చచెప్పి ఓ ఇంటి వాడ్ని చేయండి" అంటూ సలహా యిచ్చింది.

వారంరోజులు వున్నారు పార్వతి, ప్రకాశరావూ.

ఇంక తెల్లారితే వెళ్ళిపోతారనగా పార్వతి అంది, "కృష్ణా! నాకో కోరికుందయ్యా తీరుస్తావా" అంది.

ఆవిడ కోరే కోరిక అతనికి తెలుసు.

'వాళ్ళ బాధని మరిచి - తనకోసం బాధపడుతున్నారు. యింత మంచివాళ్ళకి ఎందుకు అంత క్షోభ కలుగుతుంది! మంచివాళ్ళకే ఎందుకు పరీక్షలు ఎదురవుతాయి?' అను కున్నాడు.

"ఏం మాట్లాడవేం కృష్ణా!" రెట్టించింది పార్వతి.

"చేతనయితే తీరుస్తానమ్మా" అన్నాడు ఆవిడ్నించి చూపులు మళ్ళించుకుంటూ.

"ప్రయత్నించందే ఏవీ చేయలేము..." పార్వతి లేచివచ్చి కృష్ణ పక్కన కూర్చుంది. అతని చేయి తన చేతి

లోకి తీసుకుంటూ "కృష్ణా! కన్నెధార ఫలితం దక్కలేదనే బాధ నన్ను నిలవనీయకుండా చేస్తోంది. మా దంపతులు పీటల మీద కూర్చుని - పిల్లకి కన్నెధార పోయాలనే కోరికని అణుచుకోలేకపోతున్నాను - ఆ కోరిక నువ్వే తీర్చాలి - నీ కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తేగాని నా మనసు శాంతించదు. నా మీద ఏమాత్రం గౌరవం వున్నా నా ఈ కోరిక తీర్చు" అంది. ఎంత జాగ్రత్తగా మాట్లాడదామనుకున్నా మధ్య మధ్యలో పార్వతి గొంతు వణికింది.

కృష్ణమోహన్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

"ఏం కృష్ణా! మాట్లాడవేం? నా కోరిక తీర్చవా!"

"అత్తయ్యా!...యిప్పుడు మాట ఇయ్యలేను - నన్ను క్షమించు" బొంగురు గొంతుకతో అన్నాడు.

"అలా అంటే కాదు. నువ్వు శుభవార్త చెప్తానంటేనే ఈసారి వచ్చేది" అంది.

మర్నాడు పార్వతి వాళ్ళు వెళ్ళిపోయారు.

అతను ఒంటరిగా మిగిలిపోయాడు.

రోజులు గడిచిపోతున్నాయి.

కృష్ణమోహన్ ఎప్పుడు ఆంజనేయులు ఇంటికెళ్ళినా అనూరాధ మిషను కుడుతూనే కనిపిస్తుంది. అతనికి చాలా జాలి వేసింది. గోపీకి ఉద్యోగం దొరికినా కూడా రాధ బట్టలు కుట్టడం మానలేదంటే వాళ్ళ యింటి ఆర్థిక యిబ్బందులు ఎలాంటివో కొంతవరకూ వూహించుకోగలిగేడు.

గోపీని మాట వరసకి అడిగినట్టుగా వాళ్ళ యింటి విషయాలు అడుగుతూనే వుంటాడు. ఏదేనా సహాయం చేయా

లనిపిస్తుంది ఆ కుటుంబంతో ఏమాత్రం పరిచయంలేని తను ఏ వకంగా చేస్తాడు? అందుకే వూరుకొన్నాడు.

ఒకసారి మాటల్లో కృష్ణమోహనే అన్నాడు "మీ సిస్టరు బట్టలు కుడ్తారుగదా - మిషను తీసుకోలేకపోయారా!" అని.

ఈ మాటని గోపీ ఏం తప్పుగా తీసుకోలేదు. ఎందుచేతనంటే ఆంజనేయులు ఇతను స్నేహితులు - రాధ లోకమ్మగారింట్లోనే బట్టలు కుట్టుకొనేది. అంతదూరం వెళ్ళి చాలా అవస్త పడుతోందన్న భావంతో మంచి మనసుగల కృష్ణమోహన్ అన్నాడని అనుకొన్నాడు.

"తీసుకోవాలనే వుందండి" అన్నాడు మొహమాటంగా.

"ఎలాంటి మిషను తీసుకొంటారో ఇంట్లో అడిగిరా రేపు తీసుకుందాం. నెల నెలా జీతంలో కట్టుకోవచ్చు" అన్నాడు కృష్ణమోహన్. అతనికి మిషను కొనియ్యాలని వుంది. కాని అది బాగుండదని - యీ విధంగా సాయం చేయాలనుకొన్నాడు. గోపి గాలిలో తేలిపోతున్నట్లు ఇంటికి వచ్చేడు. వస్తూనే "రేపీపాటికి మనింట్లో కుట్టు మిషను ఉంటుందోచ్" అన్నాడు చంటిపిల్లాడిలా. "ఎలా" అంటూ రాధ, కనకమ్మ ఆశ్చర్యంగా చూశారు.

"మిషన్లకి రేట్లు - మంచి చెడులు వుంటాయా అన్నీ ఒకటేనా" దర్జాగా అడిగాడు. కొడుకు మిషను కొంటానన్నందుకు తల్లి మనసు సంబరపడింది.

రాధ మాత్రం 'జీతం రాగానే తెస్తాడులా వుంది,

ఇప్పుడు మిషనుకేం తొందర - ఒక్క ఏడాదన్నా ఖర్చులు జాగ్రత్తగా చేసుకొంటే వడ్డీకి తెచ్చిన అప్పులన్నా తీరు తాయి, అప్పుడు నాన్నకి కాస్త తెరిపిగా వుంటుంది' అను కుని, "ఎలా కొంటావో చెప్పు" అంది.

"ఎలా కొంటానో మీకు అనవసరం - ఎలాంటి మిషను కావాలో చెప్పండి. అంతే!" వీరుళ్ళా నిలబడి అన్నాడు.

"గొప్పేలే!... చెప్పు ఎలా కొంటావో" అంది రాధ, నవ్వాపుకొంటూ.

గోపి అసలు సంగతి చెప్పేడు.

'వాడు మంచి పనులు చేయడులే! ఏదేనా ఒకపని చేసేడంటే - దాని వెనక ఓ పెద్ద కథ వున్నట్టే - వాడి నీడని జేరినవాళ్ళుకూడా సుఖపడరనుకో - తాచుపాము నీడని జేరినట్టే' దుర్గమ్మగారి మాటలు చెవుల్లో గింగురు మన్నాయి.

"అక్కర్లేదు. ఇప్పుడు మిషనుకేం తొందర" అంది మొహం తిప్పుకొంటూ. 'అసలు అనసూయ చెప్పగానే ఉద్యోగం ఇవ్వడంలో కూడా ఏమైనా దురుద్దేశం లేదు కదా అనిపించింది కాస్సేపు. ఆఁ, మన జాగ్రత్తలో మనం వుంటే ఎవరూ ఏమీ చేయలేరు. ఈ గోపీగాడు ఒట్టి అమా యకుడు. ఎవరేనా కాస్త మాట్లాడేరనిపిస్తే పొంగిపోతాడు.' అనుకుంది.

"ఇలాంటి సావకాశం మనకి ఎప్పుడొస్తుంది? నెల నెలా ముప్పయ్యో - ఏభయ్యో కట్టుకుంటారు. నీకు శ్రమ

తప్పుతుంది. హాయిగా ఇంటిపట్టున కూర్చుని పుస్తకాలు చదువు. అది నీకే సారె ఇస్తాలే" చివరి మాటని హాస్యంగా అన్నాడు.

"ఎవరో ఇవ్వబోతే సావకాశాలు మనకక్కరలేదు. మనమే డబ్బు మిగుల్చుకుని కొనుక్కుందాం. దాంట్లో వుండే ఆనందం - ఇలా కొనుక్కోవడంలో వుండదు - నా కిష్టం లేదు" ఖచ్చితంగా అనేసి అక్కడనించి వెళ్ళిపోయింది రాధ.

ఎంతో ఉత్సాహంగా వచ్చిన గోపీ నీరుకారి పోయాడు. 'మరీ ఇంత మొహమాటం - అభిమానం పెట్టుకుంటే ఎలా? మనమేమైనా ఊరికే తీసుకొంటున్నామా!' అనుకొన్నాడు. మర్నాడు వెళ్ళేముందు వచ్చి చెప్పబోయాడు. రాధ ఒప్పుకోలేదు.

ఆ మధ్యాహ్నం "అడిగావా! ఎలాంటి మిషను కావాలి" అంటూ అడిగాడు కృష్ణమోహన్. గోపీకి చాలా సిగ్గనిపించింది. రాధమీద కోపం వచ్చింది కూడా.

"ఇప్పుడు మిషను వద్దుటండి" అన్నాడు. అతనికేసి చూడలేక తల దించుకున్నాడు గోపి.

"ఏం?" ఆశ్చర్యంగా అడిగాడు.

తల్లిదండ్రి వద్దన్నారంటే డబ్బుకోసం చూసుకొన్నా రనుకొంటాడేమో. పిల్ల అంత కష్టపడుతున్నా జాలిలేదను కొంటాడు అనుకుని,

"మా రాధకి మొహమాటం జాస్తి - తర్వాత తీసు కొందామంది." అన్నాడు.

ఆ రోజు - ఆంజనేయులు ఇంట్లో - [illegible] దగ్గర

నిలబడ్డం - రాధ కిటికీ తలుపులు భళ్ళున మూసుకోవడం- గుర్తొచ్చింది. అతని కనుబొమలు ముడుచుకున్నాయి 'ఆ రోజు ఆహారం చేసుకుందా !' అతని మనసు బాధగా మూలిగింది.

కృష్ణమోహన్ మాట్లాడకపోవడంతో గోపీ. తలెత్తి అతని కేసి చూసేడు. అదోలా కనిపించేడు.

"సారీ, సార్ ! మీరు సహాయం చేస్తానన్నా అందు కొనే ధైర్యం లేదు - క్షమించండి" పశ్చాత్తాప స్వరంతో నెమ్మదిగా అన్నాడు.

"దాందేముంది - ఎవరిష్టం వారిది" అనేసి అక్కడ నించి వెళ్ళిపోయాడు.

గోపీ చాలా బాధపడ్డాడు. ఇంటికొచ్చి, రాధమీద కోపగించుకొన్నాడు.

"బాగుంది. అతని గురించి మనం రోజూ దెబ్బలాడు కుంటూ కూర్చుందాం. నువ్వు అడిగేవు గాబట్టి నా అభి ప్రాయం చెప్పాను. మనసు కున్నది చేసు - అది నా ఇష్ట ప్రకారం కొంతే కోసండి. లేకపోతే లేదు" అంది కోపంగా. 'బాగా ఎక్కుతున్నాడులా వున్నాడు. గోపీ జరిన కొద్ది రోజు లకే సహాయం చేయాలని బుద్ధి పుట్టిందా ?' అనుకుంది. రెండు రోజులు గోపీ రాధమీద కోపంగా వున్నాడు. తర్వాత ఎప్పటిలానే మాట్లాడసాగాడు.

'అక్కకి బుద్ధిలేదు. ఇదే నేనయితేనా' అనుకుంది చంద్రా.

* * *

కృష్ణమోహన్ వచ్చేసరికి అనూరాధ కిందనే కూర్చుని రాగే కోట్లకి రెండు కాజాలు కుడుతోంది. ఆ పక్కనే ఆంజనేయులు కూతురు ఏడాది పాప బొమ్మలతో ఆడుకొంటోంది.

కృష్ణమోహన్ని చూస్తూనే రాధ లేచి లోపల గది లోకి వెళ్ళిపోయింది.

అతను అయిదు నిముషాలు నిలబడ్డా అనసూయ వచ్చే జాడ కనపడలేదు.

'ఎవరూ లేరా? ఈ అమ్మాయి లోపలికి వెళ్ళి పోయింది ఏం చెప్పకుండా'

అతను గుమ్మంవరకూ వచ్చి "ఎవరూ లేరా? ఆవిడ్ని ఓసారి పిలుస్తారా" అన్నాడు.

"ఆవిడ పక్కంటికి వెళ్ళింది పనిమీద" గుమ్మంకేసి నాలుగడుగులు వేసి అంది.

'ఇంట్లోవాళ్ళు లేరని అడిగేవరకూ చెప్పాలని తెలియదా ఈ అమ్మాయికి' అనుకున్నాడు. ఇంకో రెండు మూడు నిముషాలు గడిచిపోయినాయి. అనసూయ రాలేదు.

"కాసిని మంచినీళ్ళు ఇవ్వగలరా" అన్నాడు.

అనూరాధ గ్లాసుతో నీళ్ళు తీసుకొచ్చి కింద పెట్టింది.

నీళ్ళు అక్కడ పెట్టి వెనక్కి వెళ్ళిపోతోంటే కృష్ణమోహన్ "ఇవి మీరు కుట్టినవేనా" అన్నాడు.

"అవును" అంది పొడిగా. 'ఇతనికెందుకు?' మనసులోనే విసుక్కుంది.

"ఆ రోజు గోపీ మిషను తీసుకొంటానంటే వద్దన్నారట

ఇంత దూరం వచ్చి పెట్టుకోవడం మీకు శ్రమ కదూ!" రాధ ముఖకవళికల్ని పరీక్షగా గమనిస్తూ అన్నాడు.

"గోపీ సిటీబస్సు కోసం నిలబడి నిలబడి - ఆఫీసుకి రావడం కష్టం కాదా? చెప్పండి కదా!" ఏ భావం లేకుండానే జవాబు ఇచ్చింది.

"మిషనంటే వాయిదాలతో అనుకుని - నేను అన్నాను నెల నెలా జీతంలో విరక్కొట్టుకుంటారని... మీరు వద్దన్నాట్ట..."

"ఇలా ఎంత వడ్డీకని ఇయ్యగలను."

"అంటే!" తెల్లబోతూ అడిగాడు.

"సెంటర్లో ఎంతోమందికి మిషన్లు లేవు - అందరూ కుట్టుకోవటంలా."

"వాళ్ళందరితో నాకేం సంబంధం?..." అతని మనసు చాలా దెబ్బతింది.

"మరి నాతో ఏం సంబంధం?"

అలసు నిర్విణ్ణుడైనట్టు చూశాడు -

"గోపీనిబట్టి - సహాయం చేయాలనుకొన్నాను. మీ అభిమానం దెబ్బతినటానికి నేనేం ఊరికే ఈయటంలేదు - మీరు అర్థంచేసుకోలేరు" ఏమాత్రం కాస్త శ్రద్ధగా గమనించినా అతని స్వరంలో బాధని ఇట్టే గ్రహించగలరు ఎవరేనా.

అనూరాధ లోపలికి వెళ్ళిపోయింది.

కృష్ణమోహన్ కింపకి వచ్చేసరికి అప్పుడే పక్కింటి

నించి అనసూయ వస్తోంది. కృష్ణమోహన్‌ని చూడగానే, "రండి అన్నయ్యగారు. చీరలు వచ్చాయంటేను షాపుకి వెళ్ళాను. మీరు చాలాసేపటయిందా వచ్చి" అంది.

"ఇప్పుడే వచ్చాను. ఆంజనేయులు ఇంకా రాలేదా ?"

"బెజవాడ వెళ్ళారండి. రండి కాఫీ తీసుకుని వెళ్ళురు గాని."

"రేపు వెళ్తానన్నాడు..."

"మొదట అలాగే అనుకొన్నారు. నిన్న సాయంత్రం అనుకోకుండా వెళ్ళారు."

"అహా ! పనుంది. మీ చేతి కాఫీ ఈసారి వచ్చి నప్పుడు- తప్పకుండా తీసుకొంటాను" అనేసి వెళ్ళిపోయాడు.

అనూరాధతో మాట్లాడాలనే ఆరాటాన్ని అణచు కున్నాడు కృష్ణమోహన్.

తనంటే ఆ అమ్మాయికి సదభిప్రాయం లేదని గ్రహిం చేడు. అది మొహమాటం కాదు. కారణం ఏమిటో మాత్రం ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. లేకపోతే ఆ రోజు తను చూడడమే ఆ అమ్మాయి దృష్టిలో మహాపరాధమో...

మరి మనసు నిలవనప్పుడు - అనూరాధని చూడాలనే ఆతృతని అణచుకోలేనప్పుడు ఆంజనేయులు ఇంటికి వస్తాడు. సాధారణంగా అతను వచ్చినప్పుడు రాధ అక్కడే వుంటుంది. సెంటరు బట్టలు తేనప్పుడు ఇంట్లోనో, చుట్టుపక్కల వారిచ్చి నవో వుంటూనే వుంటాయి.

అతను వచ్చినప్పుడు అనూరాధ కనిపించకపోతే మళ్ళీ

రాధని చూసేవరకూ అతని మనసుకి ఏదో చెత్తిగానే వుంటుంది.

ఒక్కొక్కసారి 'ఇదేమిటి - తను చేస్తున్నదేమిటి - ఎందుకు ఆ అమ్మాయికోసం అలా ఆత్రతగా పరుగెత్తడం? ఆ అమ్మాయితో తనకేం సంబంధం? ఒక్కసారన్నా ఆ అమ్మాయి నవ్వుతూ మాట్లాడలేదు. తనంటే ఆ అమ్మాయికి సదభిప్రాయం లేదు. తను మరో దెబ్బతినకూడదు - ఏ చిక్కుల్లోనూ ఇరుక్కోకూడదు' అనుకుంటాడు.

కాని ఈ మనసువుందే - అది మనం చెప్పినట్టు వినదు. దాని చిత్తం వచ్చినట్లుగా అది నడుచుకుంటుంది.

గోపీని వాళ్ళ ఇంటి విషయాలు అడగడం తగ్గించేడు.

కాని గోపీకి అదివరకు అతని దగ్గర చనువు ఏర్పడడంతో తనే చనువుగా చెప్తూండేవాడు.

గోపీకి ఉద్యోగం వచ్చినా ఇంట్లో ఇబ్బందులు తీరటం లేదు. కారణం వడ్డీలకి వడ్డీలు పోసి అప్పులు చేయడమే. బట్టల కొట్లో అప్పులు - మందుకొట్లో అప్పులు - కిరణాకొట్లో అప్పులు - ఆఖరికి బొగ్గులు దుకాణంలోకూడా అప్పులే. అల్లుడొస్తే - ఎవరేనా బంధువులొస్తే కూరలమ్మి దగ్గర కూడా కాతా పెట్టందే గడవదు.

రామనాథం సంసారం మరీ ఇంత వడిదుడుకుల్లో వుండేది కాదు అదివరకు. ఆరేళ్ళక్రితం కూతురు శ్రీమతి పెళ్ళి చేయడంతో - వెనక చిల్లిగవ్వ ఆస్తిలేక అప్పుల పాల య్యాడు. అయిదువేలు కట్నం ఇచ్చేడు. ఎంత పొందిగ్గా చేద్దామన్నా మరో అయిదువేలు ఖర్చు అవడంతో చాలా ఇబ్బం

దుల పాలయ్యాడు. దానికి సాయం ఒకదాని వెంట మరో ఖర్చు. పెళ్ళిచేసిన ఏడాదిలోనే పండక్కి వియ్యాల వారిని తీసుకురావడం - ఆ వెంట వెంటనే పురుళ్ళకి తీసుకురావడం బారసాలలు - చేసిన అప్పు తీర్చకపోగా అప్పుమీద అప్పులు చేయడంతో అసలు తీరటంలేదు. వడ్డీలు తీర్చటమే కష్టమైపోతోంది. ఆఫీసులో ఎన్ని రకాల లోన్లు దొరుకుతాయో అన్నీ చేసేడు- మళ్ళీ లోనుకోసం ఎదురుచూడడం తప్పదు. కనకమ్మకి పెళ్ళిలో పెట్టిన గొలుసు రామనాథంకి పెళ్ళిలో పెట్టిన వెండికంచం తాకట్టులోకి వెళ్తాంటాయి - వస్తాంటాయి. ఇదీ ఆ ఇంటి పరిస్థితి.

అనూరాధ అనుకుంటుంది గోపీకి ఉద్యోగం దొరక లేదనుకొని ఓ నాలుగేళ్ళపాటు శీతం ఇంట్లో నయాపైసా వాడకుండా వుంటే అప్పులు తీరిపోతాయి. అప్పుడు హాయిగా వుండచ్చు అని.

కాని అది సాధ్యం కాదు.

బట్టలకొట్లో - కిరాణాకొట్లో ఇలాంటివన్నీ ఆపుచేసి అప్పులు తీర్చుకొంటామంటే ఎవరూ వూరుకోరు.

అనూరాధకి పెళ్ళి చేయాలి. చంద్రాకి పెళ్ళి చేయాలి. గోపి చదువు అవాలి. ఇవన్నీ ఎలా జరుగుతాయి అని ఆ సంసారం దిగులు. డబ్బులేని చిరాకులో రామనాథం ఇంట్లో ఎగురుతాడు. "ఎంత డబ్బు తెచ్చినా అప్పులు తీర్చటానికే సరిపోవటం లేదు. నా శొక్కాల్లో ఓపి కున్నన్నాళ్ళు తెచ్చి పడేస్తాను - ఆ తర్వాత మీ ఖర్మ, నా ఖర్మ ఎలావుంటే అలా అవుతుంది" అంటాడు కోపంగా.

ఆతను విసుగులో అన్నాడని అందరికీ తెలుసు మౌనంగా విని వూరుకొంటారు. కాని చంద్రా వూరుకోదు. 'ఎంత డబ్బు తెస్తున్నాట్ట! ఇక్కడేం కూర్చుని పాయసాలు జుర్రటం లేదు ఎవరూను. వానాకాలం బట్టలు ఆరకపోతే వేసుకోవడానికి మరో జత బట్టలున్నా కుట్టించరు కాని...'' అంటూ తల్లి దగ్గర సణిగి మరుసటి రోజునుంచి అయిదు పైసలు పెట్టి కొత్తిమీర కొన్నా ఓ పుస్తకంలో రాయసాగింది. ఫస్ట్ తారీక్కి తండ్రికి చూపించింది కూడా. ఆ పూట అతని మూడ్ బావుండిలా వుంది, నవ్వి వూరుకున్నాడు.

శ్రీమతికి కోరికలున్నా ఎదుటపడి సాధించదు. తనేదో పోగొట్టుకొన్నట్టు మదనపడుతుంది. మరీ తిక్కగా అన్పించినప్పుడు నాలుగేసి రోజులు భర్తతో, మరుదులతో మాట్లాడటం మానేస్తుంది.

చంద్రా అలా కాదు. తనకి కావాలన్నది ఇయ్యకపోతే సాధించేస్తుంది. ఒక్కొక్కసారి అన్నం మానేసి భీష్మించుకూర్చుంటుంది.

శ్రీమతిని, అనూరాధని కాలేజీలో చేర్పించనంటే వూరుకున్నారు. చంద్రా అలా వూరుకోదు. టెన్త్ తప్పింది. లేకపోతే కాలేజీలో చేర్పించమని ప్రాణాలు తీసేదే. లెక్కల్లో పోయింది. యిప్పుడు సుప్పీ కట్టింది - టైపుకి వెళ్ళి వస్తుంది. ఇంట్లో పరిస్థితిని బొత్తిగా అర్థం చేసుకోదు. రేపు దేవుడికి కొబ్బరికాయ కొట్టాలంటే ఈ రోజే ఆ కొట్టబోయే కొబ్బరికాయతో [illegible] చేయాలో - పచ్చడి చేసుకోవాలో నిర్ణయమయిపోతుంది. రోజులు అంత గడ్డుగా వున్నాయి. రోజూ

పూలు కొనుక్కుని తలనిండా పెట్టుకోవాలని - రకరకాల బట్టలు - గాజులు కొనుక్కోవాలని - కనీసం వారానికి ఒక సినిమాకయినా వెళ్ళాలని ఇలా చాలా కోరికలు చంద్రానికి - అనూరాధ సెంటరు డబ్బు వచ్చినప్పుడల్లా చంద్రానిని, బాబుని సినిమాకి వెళ్ళమని డబ్బులు ఇస్తూనే వుంటుంది. అనూరాధకి యింట్లో పరిస్థితులు అర్థంచేసుకుని జాగ్రత్తగా మసులుతుంది.

* * *

రోజులు గడిచిపోతున్నాయి.

రవిశంకర్ వివాహం బ్రహ్మాండంగా జరిగింది.

పార్వతి రవిశంకర్ పెళ్ళికి వచ్చి వెళ్ళింది. రాజేష్‌కి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయని చెప్పింది. "రాజేష్ పెళ్ళి ముందు నీ పెళ్ళి జరగాలి కృష్ణా" అంటూ ఎన్నో విధాల చెప్పింది. "యిప్పుడు కాదు. రాజేష్, సతీష్ వివాహాలు జరగనీ అత్తయ్యా! అప్పుడు తీరిగ్గా నాకు పిల్లని చూస్తువుగాని" అన్నాడు.

"నా మాట తప్పకుండా వింటావనుకొన్నాను" నిష్టూరంగా అంది.

"నన్ను అర్థం చేసుకోమ్మా! నీ మాట వింటాను - ఇప్పుడు కాదు" అన్నాడు.

అవతల రవి ఏజన్సీలో శంభునాథ్ కోరిన డబ్బు అతనికి ఇచ్చివేసి అతన్ని వదుల్చుకొన్నాడు రవిశంకర్.

ఇప్పుడు రవి ఏజన్సీలో కృష్ణమోహన్ పార్టనర్.

రామనాథానికి ఈమధ్య ఒంట్లో బాగుండటంలేదు. గోపీకృష్ణమోహన్ పరిస్థితి చెప్పి డబ్బు అవసరం వుందని - నెల

నెలా జీతంలో కట్టుకునేట్టు సర్దమని అడిగేడు. కృష్ణమోహన్ సరేనని ఇచ్చేడు.

ఆ పూట కృష్ణమోహన్ వెళ్ళిపోతోంటే గోపీ తను ఈ పూట తొందరగా వెళ్ళాలని మర్నాడు రానని చెప్పేడు.

సరే అన్న కృష్ణమోహన్ స్కూటరు స్టార్టు చేస్తూ "ఆలస్యం వుందా? వస్తే రా, డ్రాప్ చేస్తాను" అన్నాడు.

ఆలస్యం ఏం లేదని గోపీ వచ్చి వెనకాల కూర్చున్నాడు.

అంతవరకూ వచ్చిన పెద్దమనిషిని లోపలికి రమ్మనక పోతే ఏం బాగుంటుందని గోపీ కృష్ణమోహన్‌ని లోపలికి రమ్మని ఆహ్వానించేడు.

అతనేం ఆలస్యం చేయకుండా స్కూటరు దిగి గోపీ వెంట లోపలికి వచ్చేడు. రాధకోసం అతని కళ్ళు వెతికాయి— రాధ కనపడలేదు.

నల్లగా, సన్నగా మంచాన్ని అంటుకుపోయినట్టున్నాడు రామనాథం.

భర్తకి కాళ్ళు పిసుకుతున్న కనకమ్మ లేచి గుమ్మం వరకూ వెళ్ళి నిలబడింది. చంద్రాకూడా తల్లిపక్కన నిలబడి కృష్ణమోహన్ని కుతూహలంగా చూడసాగింది. అనూరాధ అతన్ని చూస్తూనే లోపలికి వెళ్ళిపోయింది.

కృష్ణమోహన్‌కి కుర్చీ వేసి కూర్చొమని తండ్రికి పరిచయం చేసేడు.

లోపలికి వచ్చి రాధని స్ట్రాంగ్‌గా కాఫీ పెట్టమని చెప్పేడు.

రామనాథం నీరసంగా ఏదో మాట్లాడుతూనే వున్నాడు.

కొడుకు ఉప్మా చేసి పెట్టుకున్నాడు నాలుగు పచ్చి మిరపకాయలు అడుగుదామని వచ్చిన దుర్గమ్మ ఎవరిదో పరిచయం ఉన్న గొంతులా విన్పించి "ఎవరే వచ్చేరూ" అని అడిగింది.

అనూరాధ మాట్లాడలేదు గాని అప్పుడే అక్కడికి వచ్చిన చంద్రా చెప్పింది. దుర్గమ్మ గబగబా రామనాథం ఉన్న గదిలోకి వచ్చింది "ఎలా వుందండీ మీకు ఒంట్లో" అంటూ అప్పుడే కృష్ణని గమనిస్తున్నదానిలా ఓ అడుగు వెనక్కి వేస్తూ "నువ్వా!" అంది ఆశ్చర్యం నటిస్తూ.

దుర్గమ్మని యిక్కడ చూసి అతనూ తెల్లబోయాడు.

కాని అతను మాట్లాడలేదు.

దుర్గమ్మ మనసు పరిపరి విధాల పోతోంది. 'వీడు ఇక్కడికెందుకు వచ్చేడు. గోపీగాడు అక్కడ పని చేస్తున్నంత మాత్రాన వాడి తండ్రిని చూడ్డానికే వచ్చేడా? లేక... అనూరాధ మీద మనసు పడిందా! లేకపోతే పెళ్ళి కన్న ఒంటరిగాడు — ఇటు ఈడొచ్చిన పిల్లలు వున్నారని వీడితో అభిమానంగా రాసుకు తిరుగుతున్నారా —' గబగబా ఆలోచిస్తోంది.

గోపీ కాఫీ తీసుకొచ్చి ఇచ్చేడు.

కృష్ణ ముగించి గ్లాసుని లేపగానే "మా ఇంట్లోకి రా కాఫీ తీసుకుని వెళ్దువుగాని" అంది దుర్గమ్మ.

"ఈసారి వస్తానండీ" అనేసి వెళ్ళిపోయాడు.

'ఈసారి వస్తాట. అంటే ఇక్కడకి వస్తూనేంవుంటా డన్నమాట' కసిగా పళ్ళు నూరుకుంది.

ఈ మధ్య దుర్గమ్మకి ఓ ఆలోచన తట్టింది.

'రామనాథం పెద్దగా కట్నాలిచ్చి పిల్లలకి పెళ్ళిళ్ళు చేసే పరిస్థితుల్లో లేడు. రాధకి పాతిక వచ్చేయో వెళ్ళేయో. రాధ బుద్ధిమంతురాలు. ఓ వందరూపాయలు చేతిలో పెట్టి ఈ నెలంతా దాంతోనే సంసారం గడపాలన్నా గుట్టుగా నడుపుకురాగల సమర్థురాలు. సత్తిగాడికి రాధని చేసుకోంటా నంటే కళ్ళుమూసుకుని సరే అంటారు. మాకు కాని కట్నం అక్కర్లేదు - పిల్లనిచ్చి పెళ్ళిచేసి ఉద్యోగం వేయించుకో అంటే ఎగిరి గంతేయడూ' అనుకుంది.

ఇప్పుడు తనకేదో అన్యాయం అయిపోతున్నట్లు బాధపడసాగింది.

పచ్చిమిరపకాయలు తీసుకుని గుమ్మందిగుతూ తనలో అనుకున్నట్టుగా అంది "మొహం చెల్లద్దూ రావడానికి. నన్ను చూస్తూనే బెదిరేడు. తన ఆటలు ఇక్కడ సాగవని భయ పడటున్నాడు. ఎప్పుడూ మనదే అవదు కాలం."

ఆ రాత్రి సత్యంతో అంది, "ఒరే సత్తీ! అనూరాధ నీకు నచ్చిందిరా" అని.

సత్యం గుటక మింగేడు. ఒక్కసారన్నా తనకేసి చూస్తుందేమోనని ఎన్ని చేష్టలు చేసినా కన్నెత్తి చూడ లేదు. అమ్మేమిటి ఇలా అడుగుతోంది! వాళ్ళుకాని అడి

గారా ? కాలరు సవరించుకో బోయాడు - ఒంటిమీద చొక్కా లేదు. "ఏం అలా అడుగుతున్నావ్" అని అడిగాడు.

"అసలు చెప్పు." అని, "బాగానే వుంటుంది. ఏ వంక! చేతినిండా పనే!" నిట్టూర్చింది. "నువ్వొక్కడున్నా పని చేస్తే మానంటే నీకు కుదురే లేదాయె."

'అబ్బ అసలు సంగతి చెప్పదు. వెధవ సొద. ఈ పెద్దాళ్ళతో వచ్చే బాధే ఇది.' అని విసుక్కున్నాడు. "అసలు సంగతి చెప్పు. ఈరోజు ఇలా అడుగుతున్నావేం ?" అని అడిగాడు.

"అసలు సంగతేముంది ? నాకే అలా అనిపించింది" అంది.

"నువ్వు వెళ్ళి అడుగుతావా ?" ఎంత అవమానం అన్నట్టు చూశాడు. "వాళ్ళే మన కాళ్ళ దగ్గర నిలబడాలి." వస్తాదులాంటి తన శరీరాన్ని మురిపెంగా చూసుకున్నాడు.

తల్లి అలా అన్నప్పటినుంచి రాధ తనకి నిశ్చయమయి పోయినట్టే భావించేడు. మరి కాస్త నిటారుగా నిలబడి వస్తాదులా నడవసాగాడు.

తనని చూసి వెనక నవ్వుతున్నారని సత్యం గ్రహించటం లేదు.

* * *

కృష్ణమోహన్‌కి డబ్బుకి లోటు లేదు.

ఓ ఇల్లు అమ్మకానికి వస్తే కొని రిపేర్లు కొద్దిగా చేయాల్సి వచ్చి చేయించి, రంగులు వేయించేడు.

అంత ఇంట్లో ఒక్కడు వుండడానికి చాలా బాధగా వుండేది మొదట్లో.

రాజేష్ సతీష్‌ల వివాహాలు అయిపోయినాయి. వాళ్ళిద్దరూ ఉద్యోగస్తులు అయినారు. పార్వతిని ప్రకాశరావుని వచ్చి దగ్గర వుండిపొమ్మని ఎన్నో విధాల బతిమలాడేడు.

వాళ్ళు కొడుకులు రమ్మన్నా వెళ్ళలేదు. అలాగే ఇక్కడకి రాలేదు.

కృష్ణమోహన్ ఇల్లు కొనుక్కున్నాక వచ్చి పదిరోజులుండి వెళ్ళారు.

ఈ ఇల్లుకొన్న పదిరోజులకే పినతండ్రి రామబ్రహ్మం మీద వేసిన దావాలో నెగ్గాడు. అన్నగారి మంచితనాన్ని చేతకానితనంగా తీసుకుని అతనికి చిల్లిగవ్వ ఆస్తి దక్కనీయకుండా తిరిగి రాయించుకున్న ఆస్తిని - కృష్ణమోహన్ దావా వేసి నెగ్గాడు.

రామబ్రహ్మం తరఫువాళ్ళు కృష్ణమోహన్‌ని దుయ్యబట్టారు.

మొదటినుంచీ భానుమూర్తి మెతకతనం - శాంత మంచితనం తెలుసున్నవాళ్ళు మహా బాగా చేశాడు అన్నారు.

'తను ఒక్క రవిశంకర్‌కి చెప్పాడు - ఇంతమందికి ఎలా తెలిసింది ?' ఆశ్చర్యపోయాడు కృష్ణమోహన్.

"ఇల్లు కొనుక్కున్నా పార్టీ ఇవ్వలేదు. ఇప్పుడు రెండింటికి కలిపి పార్టీ ఇవ్వాల్సిందే" అంటూ స్నేహితులు, పరిచయస్థులు పట్టుబట్టారు.

ఇలాంటి సందడి సమావేశాలు అతనికి అలవాటు లేదు. అయినా తప్పదు. హోటల్లో ఏర్పాటు చేద్దామనుకొన్నాడు.

"ఇల్లు కొనుక్కొన్నాక ఇంట్లో పదిమంది కావాలి - నువ్వు ఎలాంటి పార్టీ అయినా ఇయ్యి. ఇంట్లో ఇవ్వాల్సిందే" అన్నారు.

ఒప్పుకొన్నాడు కృష్ణమోహన్.

గోపీకి అందర్నీ తీసుకు రమ్మని చెప్పాడు.

కాని రాధ రాలేదు.

"మంచి బట్టన్నా లేదు. - అక్కడకంతా గొప్పవాళ్ళు వస్తారేమో! పిల్లలు, మీరు వెళ్ళిరండి" అంది కనకమ్మ.

రాధని రమ్మని గోపీ బ్రతిమాలేడు. తల్లికూడా వెళ్ళమని చెప్పింది. కాని రాధ వినలేదు. "నాకక్కడ ఎవరూ తెలియదు" అని తప్పించుకుంది.

కనకమ్మ రాధ మినహాయించి అందరూ వెళ్ళేరు.

గాబుకి చంద్రాకి చాలా సంతోషంగా వుంది.

చంద్రా ఆ ఇల్లు - అక్కడకి వచ్చిన వ్యక్తుల్ని చూసేసరికి కళ్ళు చెదిరాయి. 'ఛీ! తను బ్రతుకుతున్నదీ ఓ బ్రతుకేనా!' అని చీదరించుకుంది.

కృష్ణమోహన్‌కి పరిచయస్తులు ఎక్కువయినారు. ఆడపిల్లలున్న తండ్రులు కృష్ణతో పరిచయాలు వృద్ధిచేసుకుని - వాళ్ళ యిళ్ళకి ఆప్యాయంగా ఆహ్వానిస్తున్నారు.

అన్నింటికన్నా యీ సమస్య ఎక్కువయింది కృష్ణమోహన్‌కి.

అదేమాట రవిశంకర్‌తో అన్నాడు.

"నీకేం? నువ్వు పెళ్ళికొడుకులా బాగానే వున్నావు. వాళ్ళంతా మధ్య నన్ను చంపుకు తింటున్నారు. మీరు చెప్పండి మీరుచెప్తే కృష్ణమోహన్ తప్పకుండా వింటాడు అంటూ. ఆఖరికి మీ వదినకూడా ఓ సంబంధం తీసుకొచ్చింది- అందరూ అన్నట్టే - 'మీరు చెప్పండి తప్పకుండా వింటాడు' అంది. బయటవారినయితే తోసిపారేశాను. ఈవిడ భార్యామణి కదా! ఎలా కాదనాలి చెప్పు! అందుకని కృష్ణమోహన్ గారూ! మీకు కొంత టైము యిస్తాం ఆ తర్వాత తిట్టుకున్నా లాభంలేదు - ఆ తర్వాత మీ ఇష్టం" అన్నాడు.

"ఇంటికి తాళం పెట్టేస్తాను - వచ్చి నీ నెత్తిమీద కూర్చుంటాను" అన్నాడు.

"నువ్వింత మొండివాడివని ఎప్పుడూ అనుకోలేదు" నిష్ఠూరంగా అన్నాడు రవిశంకర్.

"ఆఖరికి నీకూ చెడ్డవాడినయ్యానా?"

"చెడ్డవాడికి - మొండివాడికి చాలా తేడావుంది."

"ఏమిటి, ఈవేళ నాతో తగువు పెట్టుకోవాలని వచ్చావా?" నవ్వుతూ అన్నాడు కృష్ణ.

"అంతేలే! నీకు నవ్వులాటగానే వుంటుంది. మీ అత్తయ్య ఆవిడ బాధని దిగమింది నీ కోసం ఎంత ఆరాట పడుతున్నారో కాస్తయినా అర్థం చేసుకొంటే నువ్వు యిలా ప్రవర్తించవు" అన్నాడు.

కృష్ణమోహన్ మాట్లాడలేదు.

ఇలా సమయం దొరికినప్పుడల్లా కృష్ణని రవిశంకర్ చివాట్లు పెడుతూనే వుంటాడు.

పెళ్ళిళ్ళకీ - పార్టీలకీ వెళ్ళివస్తోంటే రకరకాల జంటల్ని చూస్తే కృష్ణ మనసు కాస్తయినా మారుతుందేమో నని ఆశిస్తాడు. కృష్ణ విషయంలో అలాంటిది జరగటం లేదు.

ఇంట్లో పార్టీ యిచ్చి - అందర్ని ఎంతో ఆనందంగా ఆహ్వానించి, అంత గ్రాండ్‌గా పార్టీ యిచ్చిన కృష్ణమోహన్ పార్టీ అవగానే వెంటనే బయటకి వెళ్ళిపోయాడు.

చాలా పొద్దుపోయి యింటికి వచ్చాడు.

* * *

కృష్ణమోహన్ బద్ధకంగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా తల్లి ఫోటో కనపడింది.

లేచి నిలబడి ఆ ఫోటో దగ్గరగా వెళ్ళి కొన్ని క్షణాలు ఆ ఫోటోకేసి దీక్షగా చూసి వెనక్కి వచ్చేశాడు.

రాత్రి అంతా యించుమించుగా కలత నిద్రే! -

కళ్ళు మంటలుగా వున్నాయి. ఒళ్ళంతా నొప్పులుగా వుంది.

క్రితంరోజు ఆహుతులతో నిండుగా కలకలలాడు తున్నట్టుగా వున్న యిల్లు యిప్పుడు ఎంతో వెలితిగా - బోసిపోయినట్టుగా వుంది.

పిలిచిన ప్రతీ ఒక్కరూ ఎన్ని పనులున్నా పార్టీకి ఎంతో అభిమానంతో వచ్చారు.

అక్క అనూరాధకి రావడానికి కుదరలేదు.

ఆ ఆలోచనలనుండి మళ్ళించుకొనే నెపంతో పేపరు తీసుకుని కాస్సేపు చూసి పక్కన పడేసి స్నానానికి వెళ్ళి పోయాడు.

టిఫిను వద్దని ఒట్టి కాఫీమాత్రం తీసుకుని వెళ్ళి పోయాడు

*   *   *

అదివరకు అనూరాధ తల ఎత్తి చూస్తుందేమోనని రకరకాల చేష్టలు చేసి - విసుగొచ్చి మడ్డిమృగం ఈ పిల్లతో తనకేమిటని వదిలేసిన సత్యం తల్లి అనూరాధ సీను నచ్చిందిరా అని అడిగినప్పటినుండీ కాలరెత్తి వీరుళ్ళా తిరిగాడు. అయినా అనూరాధ తనకేసి కన్నెత్తి చూడలేదు. అయినా సత్యం నిరాశ చెందకుండా అనూరాధ బయటకెళ్ళడం చూశాడంటే తనూ ఏదో ఓ పని ఉన్నవాడిలా వెళ్ళేవాడు. రెండు మూడుసార్లు పలకరించేవాడు కూడా. ఓసారి ముభావంగా - మరోసారి పెడసరంగా జవాబు యిచ్చింది.

ఓ రోజు సెంటరునుంచి కోటాబట్టలు తెచ్చుకొంటోంది అనూరాధ. ప్లాసిక్ బుట్ట హాండిల్స్ పోవడంవల్ల సెంటర్లోనే కాకీబట్ట పీలికలు తాడుగా ముళ్ళుపెట్టి వాటిని బుట్టకి కట్టింది. గబగబా యింటికి వచ్చేయాలనే ఆత్రుతతో గబగబా నడుస్తోంది. రెండు చేతుల్లో బుట్టలు చాలా బరువుగా వున్నాయి. సత్యం వెనకనించి వస్తూ అనూరాధని చూశాడు. గబగబా అడుగులు వేసి అనూరాధని కలిశాడు. "సెంటరునించా" అని అడిగాడు.

"ఊఁ" మూలిగినట్టుగా అని నడివడిగా అడుగులు వేయసాగింది.

"పాపం మీరు చాలా శ్రమపడుతున్నారు" సానుభూతిగా అన్నాడు.

అనూరాధ మాట్లాడలేదు.

"మీరు ఆడపిల్ల అయివుండి కూడా కుటుంబానికి ఏదో సాయపడాలని ఇంత శ్రమపడడం చూస్తుంటే నేను మా అమ్మకి ఏం సహాయం చేయలేకపోతున్నందుకు ఎంత సిగ్గుగా వుంటుందో!" ఓరగా చూశాడు.

"ఇలా కబుర్లు చెప్పే బదులు చేయమ్మగా" విసుగుని అణుచుకుంటూ అంది. లోపల్లోపల పళ్ళు నూరుకున్నాడు. "ఎవరు యిస్తారు చెప్పండి. ఆ కృష్ణమోహన్ గాడి దగ్గర చేయడం నాకిష్టం లేదు. వాడి దగ్గర పనిచేసేకంటే హోటల్లో ఏ సర్వరుగానో చేయడం నయం..."

"ఈ వూళ్ళో అన్ని హోటళ్ళున్నాయి - చేరక పోయారా?"

ఏం చూసుకుని ఇంతపొగరు పళ్ళు నూరుకొన్నాడు. "అరె! నా మతిమండా. ఓ బుట్ట యిలా యివ్వండి - అసలు బుట్ట అందుకోందామనే మిమ్మల్ని అంత దూరంలో చూసి పరుగెత్తుకొచ్చాను" అంటూ అనూరాధ చేతిలో బుట్ట తీసుకోబోయాడు సత్యం.

"వద్దు" విసుగ్గా అంటూ చెయ్యి వెనక్కి తీసుకుంది.

"నేను యింటికే వస్తున్నాను. మీరు యివ్వకపోతే నా మనసు చాలా బాధపడుతుంది రాధా! ప్లీజ్! ఇటివ్వు" ఏకవచన ప్రయోగం మొదలెట్టాడు.

అనూరాధలో తెచ్చిపెట్టుకున్న సహనం చచ్చిపోయింది. ఆ బుట్టల బరువుతో అసలే చేతులు గుంజుతున్నాయి. సత్యంకేసి తీక్షణంగా చూస్తూ అంది, "ఏయ్

మిస్టర్! చెప్తొంటే వినపడదా? మర్యాదగా నీ దారిన నువ్వు వెళ్ళు" అని ముఖం తిప్పేసుకుంది.

'పొగరు, మహా తనే అందగత్తెనని - తన అందానికి మురిసిపోయి ఏ రాజకుమారుడో పూలవిమానంలో వచ్చి పరిణయమాడతాడనుకొంటోంది కాబోలు 'కన్నెచెర విడిపించు సత్యం' అనే రోజు రాకపోదు అనూరాధా!' కసిగా అనుకున్నాడు.

అనూరాధ వెళ్ళిపోయింది.

ఆ రోజు సెంటరులో డబ్బు యిస్తారు. క్రితంసారి కుట్టిన కోటాడబ్బు రాలేదు. రెండు కోటాలది కలిపి ఇప్పుడు వస్తోంది. తను కుట్టిన బట్టలడబ్బు - లోకమ్మ కోటాలో కుట్టిన బట్టలది సగండబ్బు కలిపి యించుమించుగా అనూరాధకి యిప్పుడు మూడువందలు పైగానే వస్తుంది. వారం రోజుల క్రితం తెచ్చిన బట్టలు కుట్టడం అయింది. అన్నీ ప్లాస్టిక్ బుట్టల్లో సద్దింది. చంద్రాని కాస్త లోకమ్మగారింటివరకూ రమ్మని అడిగింది. ఆవిడ బట్టలు తన బట్టలు మోయలేక కత్తిరించిన బట్టలు తెచ్చుకోవడానికి బాధనిపించదు. కత్తిరించినవి వాళ్ళు కట్టలకింద కట్టేస్తారు. వాటిని కుట్టి - ఆకారం తేలేసరికి నాలుగు బుట్టల బట్టలు అవుతాయి. క్రితంరోజు లోకమ్మ బట్టలు యిచ్చేసి వద్దామనుకుంది. కాని, తల్లికి ఒంట్లో బాగుండక - యింట్లో తెమలలేదు. దాంతో వెళ్ళలేకపోయింది. ఈ రోజు చంద్రా ఆవిడ బట్టలు తీసుకుని

అక్కడవరకూ వస్తే ఆవిడకి యిచ్చేసి అటునుండి అటే సెంట రుకి వెళ్ళిపోవచ్చనుకుంది. కాని, చంద్రా రానుగాక రానంది. తనకి మంచి బట్టల్లేవంది.

"ఎర్ర లంగా, ఓణీ వుందిగా! అవి వేసుకు రా" అంది రాధ.

"ఎప్పుడు బయటకెళ్ళినా ఆ బట్టలేనా? నేను రాను" ఖచ్చితంగా అంది.

"మా బంగారు తల్లికదూ! ఈవేళ డబ్బు వస్తోంది కదా! ఈరోజే నీకు రెండు ఓణీలు, రెండు జాకెట్టు బట్టలు, లంగాబట్టా కొంటాను" అని ఎంతో బతిమాలింది.

"నేను యిప్పుడు మాత్రం రాను - ఈవేళ కొన్నాక- యింకోసారి వస్తాలే!" అంటూ ముసుగుతన్ని పడుకుంది.

అనూరాధ గబగబా జడ వేసుకుని, మొహం కడు క్కోడానికి బాత్రూంలోకి వెళ్తోంటే కిటికీలోంచి చూసిన సత్యం తల్లితో అంటున్నాడు "నీ పిచ్చిగాని అమ్మా, కృష్ణ మోహన్ నాకెందుకిస్తాడు వుద్యోగం? నాకేమయినా యీడొచ్చిన చెల్లెళ్ళు వున్నారా? నీ బాధపడలేక వాడి దగ్గరకి వెళ్ళాను గాని, నాకు వెళ్ళడం అసలు యిష్టంలేదు."

అసలే చిరాగ్గావున్న అనూరాధకి సత్యం మాటలతో మరీ చిరాకేసింది. మొహం గబగబా కడుక్కుని వచ్చేసింది.

చీర మార్చుకుని తల్లితో "నేను వెళ్తానమ్మా" అని రెండుబుట్టలు రెండు చేతుల్లోకి తీసుకుంది - చంద్రా కొద్దిగా ముసుగు తొలగించి, "నా చెప్పులు తీసుకెళ్ళద్దు" అనేసి మళ్ళీ ముసుగు తన్నింది.

"నీ చెప్పులు వేసుకెళ్ళటం లేదులే" అంది రాధ.

"ఏమిటే ఆ పొగరు! రోజు రోజుకీ మరీ మితిమీరి పోతోంది. ఈ యింట్లో అందరూ మహా సాగనిస్తున్నారు నీకు. కాస్త కూడా వెళ్ళకూడదూ! ఆ రెండు బుట్టలు అదే తీసుకెళ్ళాలా? నేను వస్తానంటే రానివ్వదు" కసురుకుంది కనకమ్మ, రాధ ఒక్కత్తి వెళ్తోంటే చూడలేక.

"ఫరవాలేదులేమ్మా!" అంది రాధ పాత చెప్పుల్నే వేసుకొంటూ.

"పోనీ రిక్షాలోనన్నా వెళ్ళు. ఈ దరిద్రం ఎప్పుడూ తీరేది కాదుగాని, ఈ వేళ డబ్బు రాగానే ముందు కాళ్ళకి చెప్పులు కొనుక్కో తల్లీ! అలాగే రెండు ప్లాస్టిక్ బుట్టలు కూడా కొనుక్కో! యింత కష్టపడుతున్నావు నీకై నువ్వేం కొనుక్కోవు" అంది బాధగా.

"గోపీకి ఉద్యోగం దొరికేకకూడా అలా ఎందుకను కుంటావమ్మా! ఎంత - రెండు మూడేళ్ళు ఓపికపడితే - యింక నాన్నగారు లోన్లు పెట్టవలసిన అవసరం వుండదు - జీతం అంతా చేతికి వస్తే ఈ యిబ్బందులే వుండవు" అంది. రాధ వెళ్ళిపోయాక చంద్రాని మళ్ళీ కేకలేసింది కనకమ్మ - చంద్రా పెదిమి విప్పలేదు. అలాగే ముసుగుతన్ని పడుకుంది.

నింపాదిగా నడుస్తూంటే చేతిలో బరువు రెట్టింపు అయినట్టుగా వుంది అనూరాధకి. పోనీ గబగబా నడుద్దామంటే చెప్పులు సరిగా లేవు. ఎలాగో తంటాలుపడి పెట్టిన పిన్నీసు కూడా ఊడి వచ్చిందంటే ఈ ఎండలో డాన్స్ చేయాల్సిందే! అమ్మ అన్నట్లు ఈ రోజు చెప్పులు కొనేసుకోవాలి.

పాత చెప్పులుకేసి చూసుకుంది. 'యింక మీకూ నాకూ ఋణం తీరబోతోంది!' అనుకుంది. అప్పుడే కొత్త చెప్పులు కొనుక్కున్నంత బలం వచ్చింది. రెండు రిక్షాల్ని బేర మాడింది. ఒకడు రూపాయి అడిగాడు - ఇంకో రిక్షావాడు రూపాయిన్నర అడిగాడు.

'హుఁ! పదినిముషాలు కళ్ళు మూసుకుంటే వెళ్ళిపోయేదానికి రూపాయి ఎందుకు తగలేయడం? లోకమ్మగారి బట్టలు ఇచ్చేస్తే తనకింత బరువుండదు.' అనుకుంది.

గోపీని సాయంత్రం తొందరగా రమ్మని చెప్పింది- సినిమాకి వెళ్దామని.

గోపీ ఈసారి డబ్బంతా పెట్టి తననే బట్టలు కొనుక్కోమన్నాడు. తనంటే వాడికెంత అభిమానం? చంద్రాకి రెండు జతలు బట్టలు తీసుకోవాలి - బాబుకి, తనకి చెప్పులు. బాబుకి ఓ జత బట్టలు - నాన్నగారికి రెండు బనీనులు, డ్రాయర్లు ......

ఎదురుగా - సైకిలు మీద చాలా స్పీడుగా వస్తున్న వ్యక్తి అనూరాధ పక్కగా - రాసుకున్నంత దగ్గరగా పోతూ భుజం పట్టి తోసేశాడు.

ఆలోచనలతో చేతిలో బరువుని మర్చిపోతూ నడుస్తున్న అనూరాధ తూలి ముందుకి పడిపోయింది. రెండు చేతుల్లో బుట్టలు విసిరేసినట్లు చెరో పక్కకీ పడిపోయినాయి.

సైకిలుమీద వ్యక్తి ఆగిపోయాడు.

ఆ వెనకనే వున్న కుర్రాడు ఆ రెండు బుట్టల్ని తీసుకుని సైకిలుమీద వున్న వ్యక్తికేసి బంతిలా ఎగరేశాడు. సైకిలు మీద వ్యక్తి కూడా ఓ బంతిని అందుకున్నట్లే అందు

కున్నాడు. సైకిలుమీద ఉడాయించాడు. ఇది కనుమూసి తెరిచేంత చురుగ్గా జరిగిపోయింది.

అసలు ఏం జరిగిందో తెలుసుకునే లోపలే ఆ ఇద్దరు కుర్రాళ్ళు ఉడాయించారు.

"దొంగ దొంగ - పట్టుకోండి - పట్టుకోండి" ఎలాగో గొంతు పెగల్చుకుని అరిచింది రాధ.

మధ్యాహ్నం ఎండవేళ. అందరూ తలుపులు మూసుకుని లోపలవుంటారు. ఓ ఇంటి కాంపౌండులో నలుగురు పిల్లలు ఆడుకొంటున్నారు. అప్పుడే అటువచ్చిన ఇద్దరు అనూరాధ కేకలు విని ఏమిటంటూ వచ్చేరు.

"నా బట్టలు పట్టుకుపోయారు - సైకిలు మీద ఇటే వెళ్ళేడు" ఎలాగో గబగబా చెప్పేసింది. గొంతు వణికింది. ముచ్చెమటలు పోశాయి. నిలబడటానికి శక్తి చాలటంలేదు.

ఈ కేకలకి ఇళ్ళల్లో వాళ్ళు బయటకి వచ్చేరు -

దాకేపోయే మరి కొంతమంది ఆగేరు -

తలోమూలా పరుగెత్తేరు. సైకిలుమీద వెళ్తూ ఏమిటా అని ఆగినవాళ్ళు అలా సైకిళ్ళమీదే రివ్వున దూసుకువెళ్ళారు వాళ్ళని పట్టుకోవడానికి.

అనూరాధ ఎర్రగళ్ళ షర్టు వేసుకున్నాడని చెప్పింది.

ఆ ఎర్రగళ్ళ షర్టు మసీదు సందులోకి మలుపు తిరిగేక మళ్ళీ కనిపించలేదు.

అనూరాధని ఓ ఇల్లాలు లోపలకి తీసుకెళ్ళింది.

రాధకి ఏడుపు తోసుకు వస్తోంది. నానన్నా వినకుండా. ఆ ఇల్లాలు బలవంతంగా లోపలకి తీసుకెళ్ళింది. రాధ

రెండు మోచేతులు కొట్టుకుపోయినాయి. బొటన వేలుకి బాగా దెబ్బతగిలింది. నెత్తురుకారుతోంది. చీరకి కూడా నెత్తురు అంటింది. ఎవరో చెప్పేవరకూ అనూరాధ తనకి దెబ్బలు తగిలినట్లే తెలియలేదు. ఆ ఆందోళనలో ఈ బాధ తెలియలేదు.

"లోపలకెళ్ళి కూర్చోమ్మా! అందరూ వెళ్ళేరుగా - పట్టుకొంటారు" అని రాధతో అని, "ఆ అమ్మాయికి వేలుకి కాస్త తడిబట్ట చుట్టండి" అక్కడున్నవాళ్ళల్లో ఒకతను అన్నాడు.

"ఏ బట్టలమ్మాయీ" అని అడిగింది ఆ ఇంటి ఇల్లాలు.

"సెంటరు బట్టలండీ" ఏడుపుని దిగమింగుతూ ఎలాగో చెప్పింది.

"అయ్యో పాపం. ఎన్ని వున్నాయి."

"ఇరవై పాంట్లు - ఇరవై షర్టులు ..."

"ఈ అమ్మాయి యిలా వెళ్తూనే వుంటుంది."

"ఏమిటోనమ్మా వెధవరోజులు మరీ తగులడి పోతున్నాయి."

"గాడ్డీ వెధవలల్లా తిరుగుతూ అందరి నోళ్ళల్లో మట్టి కొడ్తున్నారు"

"ఓ పూట కష్టపడితే నెలరోజులు హాయిగా తిని తిరగచ్చు ..."

ఇలా అందరూ తలోమాటా అంటున్నారు.

యివేమీ అనూరాధకి వినపడటం లేదు.

'వాడు దొరికాడా! ... వాడు దొరక్కపోతే? లోకమ్మగారి ఒట్టలు -'

తిరిగి తిరిగి నిరాశగా వెళ్ళిన జనం వెనక్కి వచ్చేరు.

వాడు దొరకలేదు.

రాధ లేచి నిలబడింది. కాళ్ళు దడ దడ లాడుతున్నాయి. పెదాలు అదురుతున్నాయి. ఎంతో నిగ్రహంగా యింతవరకూ ఆగిన కన్నీరు యింక ఆగేట్టులేదు.

"కాస్సేపు కూర్చో అమ్మాయ్! మా అబ్బాయిని తోడుపంపుతాను. తూలి పడేట్టున్నావు" అంచావిడ.

నవ్వుతూ ధైర్యంగా ఏదో చెప్పాలనుకుంది. సాధ్యం కాలేదు.

"ఫరవాలేదండీ!" అనేసి రోడ్డుమీదకి వచ్చేసింది.

అక్కడ పూర్తిగా తెగిపోయిన చెప్పు - యింక యిహానో యిప్పుడో అన్నట్టు మరో చెప్పు పడివున్నాయి.

పూర్తిగా పూడిన చెప్పు అసలు లాభం లేదు.

తలొంచుకుని వడివడిగా ఎలాగో యింటికొచ్చింది.

'ఈరోజు పిల్లలు సినిమాకి వెళ్తామన్నారు - రాధ రెండు మెతుకులు తిని ఎండని పడి వెళ్ళింది' అనుకున్న కన కమ్మ ఇంట్లో శనగపిండి లేకపోతే పక్కింట్లో గ్లాసుడు శనగ పిండి బదులు తీసుకొచ్చి పకోడీలు వేద్దామని అప్పుడే పిండి తడుపుతోంది

అంతవరకూ అతి ప్రయత్నంమీద ఆపుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది. వస్తూనే నేలమీదనే పడుకుంది.

"అప్పుడే వచ్చేవేమిటే అమ్మాయ్! బట్టలు ఇవ్వ లేదా!" అంటూ లోపలనించే అడిగింది కనకమ్మ.

రాధనుండి జవాబులేదు. "రాధా, రాధా" అంటూ పిల్చింది. జవాబులేదు. ఆవిడ ఖంగారుగా వచ్చింది.

రాధ ముడుచుకెట్టుకుని పడుకుంది. డొక్కలు ఎగిర పడుతున్నాయి. ఆవిడ హడలిపోయింది.

"రాధా! ఏమిటే, ఏమయిందీ! చెప్పమ్మా!" అంటూ కుదిపింది.

"సెంటరు బట్టలు పోయాయి ..."

"అయ్యో, ఎలా పోయాయీ?" ఆవిడ కూడా కూర్చుండిపోయింది.

"ఎవరో యిద్దరు కుర్రాళ్ళు సైకిలుమీద వెళ్తూ నన్ను తోసేసి - పట్టుకెళ్ళిపోయారు - దొరకలేదు" వెక్కిళ్ళ మధ్య ఎలాగో చెప్పింది.

రెండు మూడు నిముషాలు నోట మాటరాని దానిలా వుండిపోయింది కనకమ్మ. తర్వాత తేరుకుని "ఏడవకు, నువ్వేం చేస్తావు - రాత్రీ, పగలు ఎంత కష్టపడ్డావే!" ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "లే, లేచి మొహం కడుక్కో" లాలింపుగా అంది. అనూరాధ లేవలేదు.

ఈ సందడికి చంద్రా లేచింది.

కనకమ్మ చంద్రామీద విరుచుకుపడింది. "నువ్వు కూడా వెళ్తే ఒకరికొకరు సాయం ఉండునా! మొండి ఘటా నివి. ఒకళ్ళు చెప్తే వినే రకానివా? పొద్దున్నించి ఎంత బ్రతిమాలింది! బాబు వుంటే వాణ్ణైనా పంపేదాన్ని"

చంద్రా మాట్లాడలేదు. లోపల్లోపల బాధపడ్తోంది. అక్క అంత దిగులుగా వుండడం - ఏడవడం తనెప్పుడూ చూడలేదు. ప్చ్.

తల్లి ఎంత బ్రతిమాలినా అనూరాధ లేవలేదు. తల్లి బాధపడ్తోందనన్నా లేద్దామనుకొంది. కాని లేవలేకపోయింది.

'లోకమ్మకి ఏం సమాధానం చెప్పుకోవాలి? తనకి వచ్చే డబ్బు ఈ బట్టకి సరిపోతుందా? తిరిగి తండ్రిని జాడగాలా - ఈసారి వచ్చే డబ్బుతో ఎన్ని ప్లాన్లు వేసింది! కష్టపడ్డవాళ్ళకే కష్టాలన్నీ - ఛీ!'

గోపీ నాలుగు గంటలకే వచ్చేశాడు. 'ఈసారి రాధకి వచ్చిన డబ్బు యింట్లోకి వాడకూడదనుకొన్నాడు. ఆడపిల్లలకి ఒంటినిండా బట్టలన్నా లేకపోతే ఎలాగ? ఈరోజు ఆ డబ్బు యింట్లోవుంటే రేపు పది ఖర్చులు ఎవరి నోళ్ళు తెరుచుకుని వుంటాయి. ఈ రోజు బజారెళ్ళి బట్టలు తీసేసుకోవాలి. సినిమాకి టైము లేకపోతే రేపు వెళ్ళచ్చు.' అనుకుని అయిదింటికి వస్తానన్నవాడు నాలుగ్గంటలకే వచ్చేశాడు.

వస్తూనే ఈ వార్త విని నోట మాటరానివాడిలా నిలబడిపోయాడు.

రాధ కష్టమే అతని కళ్ళముందు మెదులుతోంది.

నెమ్మదిగా రాధ దగ్గరకి వెళ్ళాడు.

"రాధా!" అని తట్టి పిల్చేడు.

అనూరాధ లేచి కూర్చుంది. కళ్ళు ఎర్రగా వాచిపోయాయి. ఒక్కసారిగా మళ్ళీ దుఃఖం వచ్చింది.

"ఛ, ఎందుకే వూరుకో! ఎలా వుంటాడు? మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలవా?" అంటూ వివరాలు అడిగాడు.

కొంత స్థిమితపడ్డాక అంతా వివరంగా చెప్పింది అనూరాధ.

* * *

ఇంట్లో ఈ సంగతి రామనాథానికి చెప్పలేదు. అవసరం అయితే చెప్పచ్చని వూరుకున్నారు.

కాని దాగలేదు. సెంటర్‌కి - లోకమ్మకి తెలిసిపోయింది. ఆ మర్నాడు ఆఫీసుకెళ్ళినప్పుడు రామనాథానికి తెలిసిపోయింది.

"ఇంక సెంటర్‌కి వెళ్ళక్కర్లేదు - అయింది చాలు" అన్నాడు చిరాగ్గా.

రాధ మనసు చాలా బాధపడింది.

రామనాథం రెండు మూడేళ్ళనించీ ప్రతీ చిన్న విషయానికి మరీ చిరాకుపడుతున్నాడు. అతను ఓ రోజు ఇంట్లో నవ్వుతూ మాట్లాడాడంటే ఆ యింట్లో అందరికీ పరమానందమే!

ఈ సంగతి లోకమ్మకి తెలియగానే వాళ్ళ పనిపిల్లని పంపింది రాధని రమ్మని. "రేపొద్దున్న వస్తుందని చెప్పు." అని పంపేసింది కనకమ్మ.

తర్వాత పనిపిల్లని వేసుకుని ఆవిడ కూతురు వచ్చింది.

కనకమ్మ ఏదో చెప్పబోయింది. అనూరాధ తల్లిని వుండమని "మీరు నడుస్తూండండి - ఇప్పుడే వస్తా." అని వాళ్ళని పంపేసింది.

మొహం కడుక్కుని - చీర మార్చుకుని బయలుదేరింది.

"అక్కా! నా చెప్పు వేసుకో!" అంది చంద్రా.

రాధకి చెప్పులు లేవు. "వద్దు ఫరవాలేదు. ఎండ లేదు" అంది.

"అక్కా!" అంటూ చెప్పులు తీసుకొచ్చింది చంద్రా.

చెల్లెలుకేసి చూసింది. ఆ కళ్ళల్లో ఎంతో దిగులూ - బాధా కనపడింది.

మారు మాట్లాడకుండా చెప్పు వేసుకుని వెళ్ళిపోయింది.

అనూరాధ కనిపించేవరకూ నిలబడి లోపలకొచ్చేసింది చంద్రా.

* * *

ఆంజనేయులు, కృష్ణమోహన్ మెట్లెక్కి వస్తోంటే - లోకమ్మ కంఠం ఖంగుమని వినపడుతోంది. ఆవిడ అంత గట్టిగా అరవడం ఆంజనేయులు ఎప్పుడూ వినలేదు.

ఆంజనేయులు - కృష్ణమోహన్ యిద్దరూ ఒకేసారి అటు చూశారు -

"నాకు అవేం తెలియవమ్మాయ్! ఆయన ఊళ్ళో లేనప్పుడు అంత డబ్బు నేనెక్కడనించి తేను? వచ్చే డబ్బు సరిపోతే నువ్వన్నట్టుగా ఆగేదాన్ని - యిప్పుడు సెంటరు కెళ్ళాలంటేనే సిగ్గుగా వుంది..." అంటోంది.

తలుపుని బల్లిలా అంటుకు పోయినట్టు నిలబడింది అనూరాధ.

లోపల అనసూయ కాలుగాలిన పిల్లిలా అటూ, యిటూ తిరుగుతోంది. అనూరాధని చూస్తే బాధగా వుంది-లోకమ్మని తల్చుకొంటోంటే మంటగా వుంది. 'ఎంత అన్యాయం! యిన్నాళ్ళు అనూరాధ రెక్కలు ముక్కలయేట్లు కుట్టి యిస్తూంటే తీరిగ్గా నవల్సు చదువుకొంటూ సహం డబ్బు సంపాయిస్తూంది. ఇంత కష్టం కలిగి యిబ్బంది పడినప్పుడు ఆదుకోవద్దా? అంత డబ్బులేదా! తగలేసినంత వుంది.'

ఆంజనేయులు, కృష్ణమోహన్ లోపలికి వచ్చేరు. ఆంజనేయులు లోపలికి వస్తూనే "ఏమిటి, ఏమయింది?" అంటూ అడిగాడు.

అనసూయ అంతా చెప్పింది. "లోకమ్మ యింత కఠినాత్మురాలని నేనెప్పుడూ అనుకోలేదు." అంది.

ఇవతల మగవాళ్ళు రావడంతో లోకమ్మ గొంతు స్థాయి తగ్గించింది.

అసలు ఎవరు వచ్చేరో - వెళ్ళేరో గ్రహించే స్థితిలో లేదు రాధ.

ఇంత కష్టపడ్డా ఫలితం దక్కే సమయానికి రాడీ వెధవలు గడ్లాలతన్నుకుపోయారు - ఆ సంఘటనతోటే మతిపోతోంటే ఊపిరికూడా యిలా - అభిమానంగా మాట్లాడే లోకమ్మేనా! అనిపిస్తోంది.

. అలా దీనంగా కుంచుకుపోయిన రాధని చూస్తూంటే కృష్ణమోహన్‌కి చాలా బాధనిపించింది. యింట్లో మిషనులేక - ఇంతదూరం వచ్చి శ్రమపడినందుకు ఫలితం లేకపోగా -

సహం చేటుకి తన బట్టలు కుట్టించుకొంటూ కూడా యిలా ఎగిరిపడుతోందంటే ఆసిడ మనిషా, పాషాణమా అనిపించిందతనికి.

అనసూయ భర్తకి కృష్ణమోహన్‌కి బజ్జీలు చెరో ప్లేట్లో పట్టుకొచ్చింది. అప్పుడే అనూరాధ నేళ్ళాడేసిన ముఖంతో మెట్లవరకూ వెళ్ళిపోయింది అనసూయ గబగబా వెళ్ళి అనూరాధ చెయ్యి పట్టుకుంది.

"ఒక్కసారి లోపలికి రా రాధా! కాస్త స్థిమితపడి వెళ్దువుగాని" అంది.

"ఉఁహు! యిప్పుడు రాలేను - ఆలస్యం అయితే అమ్మ ఖంగారు పడుతుంది - అసలు యిప్పుడు వెళ్ళద్దంది. ఏమీ అనుకోకు" అంటూ వెళ్ళిపోయింది.

కృష్ణమోహన్‌కి మంచినీళ్ళు కూడా ఎక్కలేదు. మాటిమాటికి ఆ దిగులు మొహమే కళ్ళముందు కదలాడుతోంది.

గోపీ చెప్తాడేమోనని మర్నాడు సాయంత్రంవరకూ చూసి కృష్ణమోహన్ అడిగేశాడు. "అవునండీ" అంటూ జరిగిందంతా చెప్పాడు గోపీ.

"డబ్బు ఎంత కట్టాలి! ఇన్‌స్టాల్‌మెంటులో కట్టచ్చా?"

"ఇంకా ఏం తెలియదండి. నాన్నగారు వెళ్ళి మాట్లాడి వస్తానన్నారు. సెంటరునించి వచ్చే డబ్బువుంది - మరి కొంత తక్కువవుతుందేమో!" క్షణం ఆగి అన్నాడు "మా రాధ చాలా దిగులు పడిపోయిందండి. ఎంత చెప్పినా సర్దుకోలేకపోతోంది. చాలా కష్టపడింది పాపం."

"అంతే ఒక్కొక్కళ్ళ జీవితం" లోపల అనుకోబోయి పైకి అనేశాడు.

మొదట కాస్త వెల్లబోయినా 'అతనిది మంచి మనసు' అనుకొన్నాడు.

గోపీ వెళ్ళబోయే ముందు కృష్ణమోహన్ పిలిచి ఓ కవరు అందించాడు. గోపీకి ఏమిటో అర్థం కాలేదు. ఏమిటని అడిగే లోపల, "చూడు గోపీ! మీరు అడక్కుండా నేనిలా ఇస్తున్నందుకు మరోలా అనుకోవద్దు - నిన్న ఆంజనేయులు ఇంటికెళ్ళాను. అప్పుడు ఆవిడ యిల్లు ఎగిరిపోయేలా కేకలు వేస్తోంది. నాకు చాలా బాధనిపించింది. అనసూయకి సహాయం చేయాలని వుంది - కాని వాళ్ళకి శక్తికి మించినపని. వాళ్ళ కుటుంబం గురించి మీకూ తెల్సుగా! వీళ్ళ కుటుంబం చిన్నదయినా - బాధ్యతలు ఎక్కువ - నిన్న అదే బాధ పడింది - ఈ సంగతి యింట్లో చెప్పకు - అభిమాన పడ్తారు. నేనేం ఊరికే యివ్వటం లేదు - నీకు వీలున్నప్పుడు తీర్చు" అన్నాడు.

గోపీ మనసు కృష్ణమోహన్ పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

మిషను కొంటానంటే రాధ వప్పేస్తున్నదిగా! అందుకే యింట్లో చెప్పద్దన్నాడు అనుకొన్నాడు.

* * *

అనూరాధ సెంటరు మానేసింది. ఉల్లాసంగా తిరుగుతున్న రాధని చూస్తే గోపీకి భయమేసింది. కృష్ణమోహన్

యిచ్చిన డబ్బు యింకా వుంది. మిగతా కొన్నాళ్ళంటే కొంచెం తక్కువవుతుంది. ఇంట్లో ఎవరితోనూ సంప్రదించలేదు, ముందే చెప్తే వద్దంటారని.

తన దగ్గరున్న డబ్బు కట్టేసి - వున్నది వాయిదా పద్ధతిలో యిచ్చేటట్లుగా కుట్టుమిషను తీసుకొచ్చేశాడు.

కనకమ్మ చాలా సంబరపడింది.

రామనాథం 'వాడూ చాలా పెద్దవాడయ్యాడు చెప్తే విందాం' అన్నట్లు మౌనంగా వుండిపోయాడు. ఓ పక్క అంత ఖరీదైన వస్తువు కొంటూ మాటవరసకయినా చెప్పలేదనే బాధవుంది అతని మనసులో.

"ఎలా కొన్నావ్" కృష్ణమోహన్‌కు జరిగిన సంగతి ఎలాగో తెలిసి - ఇచ్చాడనే అనుమానం కలిగి తీక్షణంగా చూస్తూ అడిగింది రాధ.

అలా రాధ అడుగుతుందని గోపీకి తెలుసు.

"ఖాళీ సమయంలో ఓ కొట్లో పద్దులు రాస్తున్నాను. వాళ్ళు నెల నెలా ఇవ్వబోతే ఇవ్వాలనుకున్నది ఒకేసారి ఇమ్మన్నాను - వాళ్ళు అనుకోకుండా ఈరోజే ఇచ్చేరు - ఎవరితో చెప్ప వ్వవసరం లేకపోయింది" అంటూ తండ్రికేసి తిరిగేడు.

రామనాథం మనసు కొడుకుపట్ల ప్రేమతో నిండిపోయింది.

'నా కొడుకు బంగారుకొండ' అనుకొన్నాడు.

'మా నాయన!' అనుకొంది కనకమ్మ.

"నువ్వు వయసుకి వచ్చినవాడివి - నాలుగు మంచి బట్టలు కుట్టించుకోకుండా యిలా పొదుపుచేస్తావా!" అంది అనూరాధ.

"అదేమిటమ్మా రాధా! వాడు అంత అభిమానంతో తీసుకొస్తే అలా అంటావ్! వాడి మనసు బాధపడదూ! బట్టల కేముంది? నేకో జత కుట్టించుకొన్నా సర్దుకుపోతుంది" అన్నాడు రామనాథం.

"కాస్త నవ్వవే తల్లీ!" భయం నటించేడు గోపీ.

అంతా నవ్వుకొన్నారు.

కనకమ్మ బాబుని పంపి గబగబా కొబ్బరికాయ తెప్పించింది.

మిషనుకు పూజచేసి - కొబ్బరికాయ కొట్టేరు.

అందరి భోజనాలూ అయినాక - అక్కడ ఎవరూ లేనప్పుడు గోపీని అడిగింది రాధ, "గోపీ! రెడీమేడ్ షాపుల్లో గౌనులు కుట్టడానికి ఇస్తారని విన్నాను. ఆ వివరాలు ఏవో కాస్త కనుక్కో రాదా."

"నీ కాలూ, చెయ్యీ ఒక్కక్షణం కూడా వూరుకో లేవా రాధా!" అన్నాడు నవ్వుతూ.

"నాకు వూరికే కూర్చుంటే తోచదురా! కొంతమంది మిషను ఎక్కువగా తొక్కితే కాళ్ళు లాగుతాయని - పాదాలు వాస్తాయని అంటారు. నాకెప్పుడూ అలా . అని పించలేదు. కుట్టే కొద్దీ కుట్టాలనిపిస్తుంది. ఆ కాస్త బట్టకే కాస్త అవస్తపడేదాన్ని..."

"పోనిద్దూ పీడా పోయిందే. అంతా మన మంచికే అయింది. ఒక్క బటను కుట్టాలంటే సూది ఎదర వేలులోకి దిగేది. ఇంక లోకమ్మ గురించి, సెంటరు గురించి ఆలోచించకు. మనింట్లో బట్టలు కుడుతుంటే చాలు."

"అంటే కనుక్కోవా?"

"కోప్పడకు. కనుక్కుంటాను. నాకూ సరిగ్గా తెలియదుగా! ఎవరినైనా అడిగి కనుక్కుంటాను. తొందర పడద్దంటున్నాను" అన్నాడు. అలాగే అంది రాధ.

* * *

ఆ దొడ్లో వాళ్ళందరికీ గుండెల్లో రాయి పడింది - ఇంటి ఓనరు ఇల్లు కాళీ చేయమని నోటీస్ ఇచ్చేసరికి. పాతికేళ్ళనుట్టి మూడు వాటాలవాళ్ళు నిశ్చింతగా వున్నారు. వున్న రెండు వాటాలవాళ్ళు బదిలీ మూలంగా మారుతూ వచ్చేరు.

అద్దె తక్కువ - నీళ్ళకి ఇబ్బంది లేదు. మధ్య తరగతి కుటుంబీకులకి ఇంతకన్న ఏం కావాలి? ఎప్పటినించో వున్న మూలంగా ఇంటాయన అద్దెకూడా ఏం పెంచలేదు. ఇప్పుడు ఇల్లు దొరకడం మాటలా! వంద రూపాయలు పెడ్తే రెండు గదులుకూడా దొరకటంలేదు.

దుర్గమ్మ మరీ బాధపడిపోయింది. ఎక్కడికి పోవాలి. ఇక్కడ కొచ్చినప్పటినుండి కాస్త హాయిగా వుంది. ఉన్న నలుగురు కొడుకులు డబ్బు పంపడం మానేసి నాలుగేళ్ళు అవుతోంది. అప్పటినించీ ఆవిడ పని మరీ కటకటగా వుంది. సత్యం ఏ పనీ చేయకుండా జులాయిగా తిరగటంతో వాళ్ళు డబ్బు పంపడం మానేశారు.

ఇంటిగలాయనకూడా వాళ్ళందరినీ లేవగొట్టి ఎక్కువ అద్దెకి మరొకరికి ఇచ్చుకొందామని కాళీ చేయమనలేదు. ఈ మధ్య భారీ వర్షాలకి రెండు వాటాల వంట వసారా కూలి

పోయింది - ఓ వాటాలో ఇల్లాలికి నడ్డి విరిగినంత పనయింది. అసలు ఎప్పటినుంచో ఇల్లు బాగుచేయించాలనుకొంటున్నాడాయన. ఇప్పుడు రేకులు పీకేసి గోడలు లేపి ఏకంగా డాబా వేయాలనుకొన్నాడు.

రామనాథం రెండు మూడిళ్ళు చూశాడు. సూట ఏభై - రెండొందలూను. అతనికి కళ్ళు తిరిగినంత పనయింది. పాతికేళ్ళ క్రితం ఇరవై రూపాయలకి చేరి - యిప్పుడు అరవై రూపాయలిస్తున్నాడు.

ఇల్లు చూసే భారం భార్యకి - కొడుక్కీ వదిలేసి నిశ్చింతగా వున్నాడు.

రెండు వాటాలవాళ్ళు యిళ్ళు చూసుకొని వెళ్ళిపోయారు.

ఓ వాటాలో ఆవిడ యింకోవారం చూసి మా అన్నయ్య యింటికి వెళ్ళిపోయి - అక్కడ వెతుక్కుంటాను అంది. ఆవిడ అన్నగారికి సొంత యిల్లు వుంది. ఆ ధీమా వుంది ఆవిడకి. అన్నట్టుగానే వారం తర్వాత వెళ్ళిపోయింది.

ఇంక రామనాథం, దుర్గమ్మ మిగిలేరు.

"మీతోపాటు నన్నూ గుర్తుంచుకోండి" అంది దుర్గమ్మ. నిత్యం నిశ్చింతగా తిని తిరుగుతున్నాడు.

రెండురోజులు శలవుపెట్టి ఏదో ఒక యిల్లుకి ఎడ్వాన్సు యిచ్చేయాలని తీర్మానించుకున్నాడు గోపి. సాయంత్రం తను వచ్చేసరికి తయారుగా వుండమని అనురాధకి చెప్పేడు. వారంరోజులనుంచి ఇంటిగలాయన కళ్ళల్లో నిప్పులు పోస్తున్నాడు.

సాయంత్రం వచ్చేసరికి అనురాధా, చంద్రాకూడా

తయారుగా వున్నారు. గోపీ వస్తూనే తండ్రికి "నాన్నా! కృష్ణమోహన్‌గారు వాళ్ళ ఔట్‌హౌస్ ఖాళీగానే వుందిట- యింకా రెండు గదులు వాడుకోవచ్చని చెప్పేరు - అసలు యిట్లు వెతుకుతాననుకోండి రెండు రోజులు శెలవు పెట్టేను. మా నాన్నగారికి చెప్తాను అని చెప్పేను" అన్నాడు.

"అద్దె ఎంత అడుగుతాడో! ముందు కనుక్కోకుండా వెళ్తే తర్వాత మొహమాటాలు దెబ్బతింటాయి" అన్నాడు.

"అద్దె ఏమీ తీసుకోడనుకుంటాను. ఒకవేళ తీసుకున్నా మనం ఇవ్వగలిగినంత యివ్వొచ్చు. అయినా నాకూ యిష్టంలేదు. ఒకవేళ ఎక్కడా ఈ వారంలో దొరక్కపోతే అక్కడకి వెళ్ళి, వేరే యింటికి ప్రయత్నించవచ్చు అని..."

"ఇప్పుడు దొరకనిది అప్పుడు దొరుకుతుందా!" అక్కడేవుండి అంతా విన్న అనూరాధ అంది.

"రేపు ఎల్లుండి శెలవు పెట్టేనుకదా ఏదో ఒకటి కుదరకపోదు. అసలు ఆయన చెప్పింది చెప్పాను. నువ్వు రెడీనా" అన్నాడు.

"ఆఁ! చంద్రాకూడా వస్తూంది. టీ పెడ్తానుండు" అంటూ లోపలికి వెళ్ళింది. రామనాథం ఆలోచిస్తున్నాడు. కృష్ణమోహన్ యింటికి వచ్చేడు - తన పరిస్థితి అర్థం చేసుకొనే వుంటాడు కదా! ఒకవేళ అద్దె తీసుకున్నా తన తాహతుమించి తీసుకోడు - అసలు తీసుకోడేమో! అలా అద్దెకి ఇచ్చుకొనేవాడే అయితే యిన్నాళ్ళు ఖాళీగా ఎందుకు వుంచుకొంటాడు? ఒక్కమనిషి - బోలెడంత సంపాదిస్తున్నాడు - దానికితోడు మంచి మనసు అవసరపు ఎవరి సహాయాన్ని ఆశించేవాడు కాదు రామనాథం. కాని ఈ ఆర్థిక

ఇబ్బందులవల్ల అతని ప్లాను - ఆశయాలు తల్లక్రిందులయి నాయి. ఇప్పుడు ఎంత చిన్నదయినా మూడు గదులు తీసుకోవాలి. నూటయాభై ఇవ్వందే రాదు. ఈ పిల్లలది ఉడుకు రక్తం - అభిమానాలు మెండు. కృష్ణమోహన్ యింటికి వెళ్ళడానికి అభిమానపడి ఏ నూటయాభైకో, రెండువందలకో కుదుర్చుకు వచ్చేస్తారేమోనని భయపడ్డాడు కూడా.

గోపీ, చంద్రా, అనూరాధా వెళ్ళి యిళ్ళకోసం తిరిగి, తిరిగి వచ్చేరు. ఇళ్ళు లేవని కాదు రెండు ఇళ్ళు ఖాళీగా వున్నాయి. ఒకటి రెండొందలు - కరెంటుకి, నీళ్ళకి వేరే అన్నారు. ఇంకోటి నూట ఏభై. రెండు గదులు. ఒక్క అల్మారా లేదు. ఒక్క రాక్ లేదు. వంటగదిలోంచి బయటకి దారిలేదు. ఓ సందులో సరసాగ్గా ఆరువాటాలు వున్నాయి. బావి వుంది. నల్లా పెట్టిస్తార.

"ఎగువ నీళ్ళు ఎవరు తోడతారు" ముందే విసుక్కుంది చంద్రా.

వంటగదిలోంచి దొడ్లోకి దారివుండి నల్లావుంటే తల్లిని ఎలాగేనా ఒప్పించవచ్చనుకుంది అనూరాధ.

రామనాథానికి, చంద్రాకి, బాబుకి కృష్ణమోహన్ యింటికి వెళ్ళిపోవాలని వుంది. గోపీకి ఏదో మొహమాటంగా వుంది. కనకమ్మకి తల్లీ కొడుకు ఆలోచించుకొంటారని నిశ్చింతగా వుంది. ఏ కొచ్చీ అనూరాధకి సుతరామూ ఇష్టం లేదు. 'అతను మిషన్ కొనుక్కోమని చెబ్తానంటే వద్దని మానేసి ఇప్పుడు అతనింటికే వెళ్ళడమా? ఎంత లోకువ! అయినా అతన్నెవరూ అడక్కుండానే ఎందుకు చెప్పినట్టో! సహాయం అడిగితే చేయటం వేరు. అది మంచి మనసు అని

పించుకుంటుంది. అడక్కుండా చేస్తే అది అతిగానే కని పిస్తుంది. ఏమయినా సరే ఈ వారంలో ఎలాగో అలాగ ఇల్లు కుదుర్చుకోవాలి' అనుకుంది.

గోపీతో రెండురోజులు ఇంటికోసం తిరిగింది. లాభం లేకపోయింది.

ఓ రోజు రాధ ఒక్కత్తే బయలుదేరింది. చంద్రాని రమ్మంటే రానంది.

అనూరాధ ఎలాగయితేనేం ఓ ఇంటిని చూసి సంతృప్తి పడింది. ఇంటికొచ్చి గబగబా తల్లితో అంది. "అమ్మా ఇల్లు దొరికింది."

"ఎక్కడ - ఎంత ?" అంది. ముందు అద్దె ముఖ్యం

"మూడు గదులు - నూట అరవై - రేకులుకో! ఇక్కడా రేకులేకదా! బాత్రూం పైనే వుంది. లెట్రిన్‌కి కిందకి వెళ్ళాలి..."

"మేడమీదా ?" చంద్రా అడిగింది.

"నీళ్ళు పైకి ఎక్కుతాయా ?" కనకమ్మ అడిగింది.

"అదొక్కటే ఇబ్బంది. కింద బావి, నల్లా రెండూ వున్నాయి. నీళ్ళు పైకి ఎక్కవుట - అందుకని పెట్టించలేదుట. ఇప్పుడే ఎడ్వాన్సు ఇచ్చేయమన్నారు - రేపు సాయంత్రం లోగా ఏ మాటా చెప్పాలన్నారు."

"నూట అరవై పైగా రేకులుమీద సులసులా మాడి చావాలి" విసుగ్గా అన్నాడు రామనాథం.

"నీళ్ళు పైకి మోయలేమే తల్లీ! ఎన్ని నీళ్ళని మోస్తాం" అంది కనకమ్మ.

ఇంక వీళ్ళ దగ్గర లాభం లేదనుకుని గోపీదగ్గర మొద

తెట్టింది. "నాన్నగార్కి నువ్వు చెప్పు గోపీ! ఎందుకో అక్కడికి వెళ్ళడం నా కిష్టంలేదు."

"నీళ్ళకి కష్టమే రాధా! పోసి కింది నాటా అయినా అంత ఏది కాదు. ఆ గోడలు కూడా బాగా కెంపుగున్నాయి. నేను గట్టిగా ఒళ్ళు విరుచుకొన్నానంటే పెచ్చులని రేకులు తగులుతాయి. అయినా కృష్ణమోహన్ ఇంట్లో వూరికే వుంటామా? అతను అద్దె పుచ్చుకోకపోతే వెంటనే ఏదో ఇల్లు చూసుకొందాం" అన్నాడు.

"అక్కడికి వెళ్ళడం ఎందుకో నా కిష్టంలేదు."

"నాకు అతనిగురించి తెలియక అలా అంటున్నావు. అతను చాలా మంచివాడు - ప్రాణం ఇచ్చినట్లు మాట్లాడుతాడు. జీవితంలో బాగా దెబ్బతిన్నవాడిలా వున్నాడు - మాట్లాడుతూ, మాట్లాడుతూ మధ్యలో పరధ్యానంగా వుండిపోవడం నేను చాలాసార్లు గమనించేను. నిన్నకూడా అడిగేడు..." గోపీ చెప్పుకుపోతున్నాడు. అనూరాధ మౌనంగా వుండిపోయింది. తండ్రికి అంత అద్దెలో ఇష్టం లేదు. ఎప్పటినించో వుంటున్నాము. కాంట్రి అరనెలలో యిన్నాళ్ళు నెట్టుకొచ్చాం కాని, యిప్పుడు ఎక్కడయినా ఆ మాత్రం అద్దెలేనిదే యిల్లు దొరకదు. చంద్రాలా తను గట్టిగా - నిశ్చితంగా తండ్రితో మాట్లాడేసింది. తనకి ఒక్క-దానికి తప్ప మిగతా అందరికీ వెళ్ళాలనే వుంది అనుకొంది.

* * *

ఇంటిగలాయన వచ్చి కొంత నిష్ఠూరంగా - మరి కొంత గట్టిగా మాట్లాడి వెళ్ళాడు. రఘునాథం కృష్ణమోహన్‌కి

వస్తున్నామని చెప్పమని గోపీకి చెప్పేడు. భార్యకి సామాను సర్దమని చెప్పేడు.

పిల్లలని పిలిపి యిద్దరూ ఒక్కొక్క సామాన్లూ జాగ్రత్తగా సర్దసాగింది.

అనూరాధ తల్లి దగ్గర "అమ్మా! అతను మంచివాడు కాడని దుర్గమ్మగారు చెప్పింది కదా - అక్కడికే వెళ్ళడం. ఏం మంచిది" అంది.

"మరి ఏం చేయాలి చెప్పు. ఒక్కసారిగా అంత అద్దెలుపోసి వెళ్ళలేం అయినా మన జాగ్రత్తలో మనం వుంటే ఎవరేం చేయగలరు?" అంది.

"మీకు యిల్లు దొరికిందా, సామాను సర్దేస్తున్నారు? అయ్యో, నా మాట మర్చిపోయారా? ఎక్కడా యిల్లు" నవ్వుతుంటూ అడిగింది దుర్గమ్మ.

కౌసల్య ఏదో చెప్పేలోగానే బాబు "మేము కృష్ణమోహన్‌గారింటికి మారిపోతున్నాము. ఆయన రమ్మన్నారు" గర్వంగా అన్నాడు బాబు.

"వాడా!... ఎందుకు. చెప్పుకుంటారు? చస్తున్నాడు ఒక్కడికీ తోచక!" అంటూ వెళ్ళిపోయింది. దుర్గమ్మ దిగులుగా పడుకుంది. తను ఎక్కడికి పోవాలి? ఇంకో నాలుగు రోజులు పోతే ఇంటిగలాయన చెంబు, తప్పేలా బయటికి గిరాటేస్తాడు. ఈ సత్తిగాడు పోతున్న పోతాడు - ఆకలేస్తే సత్ [illegible] తిరిగ వస్తాడు. ఎన్ని తిప్పలు పెడుతున్నావురా దేవుడా! పిచ్చి కుదురులేకపోవడం వల్లనే ఉన్న కొంపకూలు కలిగజేసుకోవడం మానేసింది. ఏమైనా ఓ దారిన పడితే తను

ఎలాగో అలాగ గుప్పెడు గింజలు వుడకేసుకుని బ్రతికేది అని బాధపడింది.

సామాను సర్దడం అయింది.

దుర్గమ్మ ఒళ్ళొద్ది వచ్చింది. కాస్సేపు ఊరుకొన్నట్టే ఊరుకొని, "కనకమ్మా! నేనో మాట చెప్తాను ఏమీ అనుకోకు. ఈ వొచ్చిన పిల్లలు వున్నారు జాగ్రత్త! మరోలా అనుకోకుమా! అయినా నీ పిల్లలు బుద్ధిమంతులు" అని కాస్సేపు ఆగి, "మా సత్తిగాడికే ఏదేనా ఉద్యోగం వుంటే అనూరాధని అడిగి మరి మా సత్యానికి చేసుకోంటామనుకొన్నాను" అంటూ అనూరాధకేసి చూస్తూ – అనూరాధ మొహం తిప్పుకుని తిరస్కరించి వెళ్ళిపోయింది.

మొదటి మాటకు కాస్త చిరాకుపడ్డ కనకమ్మ తర్వాత దుర్గమ్మ అన్నమాటకి తెల్లబోయింది. తర్వాత 'ఆవిడతో ఏమిటి పెద్దావిడ' అనుకుంది.

* * *

రామనాథం వాళ్ళు ఇల్లుమారి నాలుగు రోజులయింది.

అనూరాధ ఒక్కసారికూడా కృష్ణమోహన్‌కి కనపడలేదు. అసలు ఆ రోజు బట్టలు పోయాయని లోకమ్మ కేకలేసినప్పుడు చూడడమే ఆఖరుసారి. అతను యింట్లో వుండేదే చాలా తక్కువ. రామనాథం రెండుసార్లు వచ్చి మాట్లాడి వెళ్ళాడు. బాబు రోజూ 'గుడ్ మార్నింగ్ అంకుల్' అంటూ పలకరిస్తాడు.

చంద్రాకి అతను యిల్లంతా చూడాలని వుంటుంది. కాని, యింట్లో ఏమయినా అంటారేమోనని భయమేసి వూరుకుంది.

కనకమ్మకి యింట్లో చేసుకున్నది ఏదేనా ఇంత అభిమానంగా పెట్టాలని వుంటుంది. మళ్ళీ మన వంటలెంత - ఏమనుకొంటాడో అని పూరుకొంటుంది. యింటిమట్టూ బోలెడంత కాళీ జాగావుంది - రకరకాల పూల మొక్కలు వున్నాయి. అన్నింటికి విరబూసినట్లు చెట్లనిండా పూలే. చంద్రాకి అన్నిపూలు చూసేసరికి కళ్ళు మెరిశాయి. ఎవరూ చూడకుండా ఆ పూలమొక్కల మధ్య తిరుగుతూ చేత్తో పూలని తాకి చూసేది. ఇది ఓసారి కృష్ణమోహన్ కళ్ళ బడింది.

అతను వచ్చి "పూలు కావలిస్తే కోసుకో" అని, "నీ పేరేమిటి?" అని అడిగాడు.

"చంద్రావతి. అందరూ 'చంద్రా' అంటారు" అంది బెదురు లేకుండా.

"ఎన్నిపూలు కావలిస్తే అన్నీ కోసుకో - ఎప్పుడు కావాలంటే అప్పుడు కోసుకో" అనేసి వెళ్ళిపోయాడు.

'ఎంత మంచివాడు' అనుకుంది చంద్రా.

చంద్రాకి తెల్ల చామంతులంటే చాలా యిష్టం. చామంతిమడి అంతా మొగ్గ తొడిగింది. ఇప్పుడిప్పుడే మొగ్గలు విచ్చుకొంటున్నాయి. విడిచినంతవరకూ తెల్ల చామంతులు కోసుకుంది. తల్లికి, అక్కకి కనకాంబరాలు కోసుకుంది. కాస్త మరువంకూడా కోసుకుని సంతోషంగా యింట్లోకి వచ్చింది.

తను కుట్టిన గౌను హేంగర్‌కి తగిలించి - అది చాలా

బాగా కుదిరినందుకు సంబరపడిపోతూ వున్న అనూరాధకి ఒడి నిండా పూలతో సంతోషంగా వచ్చిన చంద్రా కనిపించింది.

"ఏమిటవి ?" అంది.

"పువ్వులు..."

"ఎక్కడివి ?" కనుబొమలు ముడుస్తూ అడిగింది.

"ఎక్కడివేమిటి? అన్ని పూలమొక్కలుంటేనూ! ఆయనే కోసుకోమన్నారు. రోజూ కోసుకోమన్నారు" గబ గబా అంది.

"సిగ్గులేదూ! ఒకరి చెట్లవి కోసుకోడానికి. అసలు అక్కడికి ఎందుకు వెళ్ళావ్" కోపంగా అడిగింది.

"ఊరికే పూలచెట్లు చూస్తున్నాను — ఆయనే వచ్చి కోసుకోమన్నారు."

"ఆశగా చూస్తే అనరూ? రేపట్నించి కోశావంటే మాత్రం మాటదక్కదు. కావలిస్తే వీధిలోకి వచ్చినప్పుడు కొనుక్కో."

"ఇక్కడ వీధిలోకి ఏమీ రావు" నసుగుతున్నట్టుగా అంది.

"వీధిలోకి రాకపోతే బజారెళ్ళి కొనుక్కో" విసుగ్గా అంది.

ఆ మర్నాటినించీ చంద్రా పూలజోలికి పోలేదు.

ఓ సారి చంద్రా కనిపించినప్పుడు కృష్ణమోహన్ అడిగాడు "పూలు కోసుకోవట్లేదా ?" అని. "చెట్లనుంచే నే అందంగా వున్నాయండి — అందుకని" తడబడింది.

ఇంట్లో పెద్దవాళ్ళు - లేక అనూరాధో వద్దని అని

వుంటారు అనుకున్న కృష్ణమోహన్ ఇంకేమీ మాట్లాడలేదు నెలరోజులు గిర్రున తిరిగిపోయినాయి.

ఈ నెలరోజుల్లో రెండుసార్లు అనూరాధ కృష్ణ మోహన్ కళ్ళబడింది. అతన్ని చూస్తూనే తలవంచుకుని వెళ్ళి పోయింది. మొదటిసారి కొంచెం బాధపడ్డాడు. రెండోసారి అదేం లేదు.

"అద్దె ఎంత యిస్తే బాగుంటుందిరా" అని కొడుకుని అడిగాడు రామనాథం.

గోపీ చెప్పలేకపోయాడు. అనూరాధ తప్ప అందరూ తలో సలహా యిచ్చేరు. ఆఖరికి మనీ వందరూపాయలిస్తే బాగుందను - నూటపభై యిస్తే సరి అనుకొన్నారు.

కొడుకుని యిమ్మన్నాడు తండ్రి.

"మీరు పెద్దవారు - మీరివ్వండి" అంటూ గోపీ తప్పించుకొన్నాడు.

రామనాథం ఉదయం కాఫీ తాగగానే వెళ్ళాడు.

కృష్ణమోహన్ అప్పుడే కాఫీ తీసుకొంటున్నాడు. రామనాథం వద్దన్నా వినకుండా రామనాథానికి మరో కప్పు కాఫీ తెప్పించాడు.

కాస్సేపు ఆ కబురు, ఈ కబురు మాట్లాడి, "మీరు అద్దె ఎంతో చెప్పలేదు _ అది అడుగుదామనే వచ్చేను" అంటూ నసిగేడు.

ఓ సారి రామనాథంకేసి చూసి, "నాకు అద్దెకిచ్చు కొనే అలవాటు లేదండీ..."

అతనిమాట పూర్తికాకుండానే రామనాథం అన్నాడు,

"మీరు అలా అంటే కాదు. మాకు మొహమాటంగా వుంటుంది. మీరు చెప్పాలి."

"మీరు యింటికోసం వెతుకుతున్నారు - యిల్లు కాళీగా వుందిగదాని చెప్పేను. అంతేకాని అద్దెకోసం కాదు" అన్నాడు స్థిరంగా.

"మీరలా అనకూడదు. పోనీ యిదన్నా మీరు తీసుకోవాలి" అంటూ తను తెచ్చిన నూటపళ్లై అక్కడేవున్న టిపాయ్ మీద పెట్టబోయాడు.

"వాది ఒకటే మాట - తీసుకొనే వాడినయితే మొదటే తీసుకొనేవాడిని - తీసేసుకోండి" అన్నాడు.

ఇంక రామనాథం ఏం మాట్లాడలేకపోయాడు.

తర్వాత అతని దగ్గర శలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

అందరూ అతనిది వెన్నలాంటి మనసు అనుకొన్నారు. దుర్గమ్మ చెప్పిన మాటలన్నీ అబద్ధాలు అనుకుంది కనకమ్మ.

అనూరాధ అతనిది అంతా నాటకమని - అది ఎప్పుడో అప్పుడు - ఏదో ఒక రూపంలో బయటపడక మానదని అనుకుంది. అంత జాలిగుండె గలవాడే అయితే ఇన్నాళ్ళయింది ఇల్లు కొనుక్కుని, కాళీగా వుంచేశాడేం? ఎవరికేనా ఎందుకివ్వలేదు? అంత మంచి మనసు వుంటే ఎవరూ ఆదుకొనేవారు లేక అల్లాడిపోతోంది దుర్గమ్మ. అద్దె చెల్లించే శక్తిలేదు. పోనీ పరాయివాళ్ళు అంటే అదేం కాదు. చుట్టరికం కూడా వుంది. దుర్గమ్మా ఒక గదిలో వుండు అంటే వుండనంటుందా? కళ్ళకద్దుకుని మళ్ళీ వుంటుంది. ఇది అమ్మావాళ్లు గ్రహించరు. విసుగ్గా అనుకుంది.

తర్వాత గోపీతో అంది. "అతను అద్దె తీసుకోడుట - మరి మనం ఇలాగే ఉందామా?"

"నాన్నగారు అద్దె యిద్దామని తీసుకెళ్తే ఎంత చెప్పినా తీసుకోలేదుట. అదేమిటని నేను అడగబోతే చివాట్లు వేశాడు" అన్నాడు.

"వూరికే వుండడం ఏం బాగుంటుందిరా! మరీ అంత దిగజారిపోయామా?..."

"అంటే!?" ఖంగారుగా అన్నాడు.

"అంత మకీ ఇంటి అద్దె యిచ్చుకోలేనంత హీనస్థితిలో లేంగా! నువ్వు కూడా ఆలోచించు - మీ అందరికీ బాధ లేకపోతే సరే!"

"మరేంచేయాలి? అతను ఒద్దుకాక ఒద్దు అంటోంటే- సరే, కొన్నాళ్ళుచూసి, వేరే వెళ్ళిపోదాం. వెంటనే వెళ్ళిపోతే మరీ మూర్ఖంగా వుంటుంది" అన్నాడు.

అనూరాధ ఏం మాట్లాడలేదు.

* * *

ఆ రోజు వరలక్ష్మీ వ్రతం -

రామనాథం వచ్చి ఈరోజు భోజనానికి రావాలని కృష్ణమోహన్‌తో అన్నాడు.

"నేను ఎప్పుడో వేళతప్పి వస్తూంటాను - మీరు యిలాంటివి పెట్టుకోకండి" అన్నాడు.

"మీరు ఏ టైములో వచ్చినా ఫరవాలేదు - మేము ఏమీ అనుకోము" అని పట్టుబట్టాడు. రామనాథం ఎన్ని చెప్పినా కృష్ణమోహన్ అవీ యివీ చెప్పి ఎలాగయితేనేం రామనాథాన్ని పంపేశాడు.

"అదేమిటి! అతను రానంటే మీరు వచ్చేశారా? ఈ యింట్లోకి వచ్చినప్పటినుండి ఆ అబ్బాయిని భోజనానికి పిలవాలని వుంది. సందర్భం లేకుండా వస్తాడో లేడో అను కుని, వూరుకొన్నారు" అంది. తర్వాత గోపీని తీసుకుని కృష్ణ మోహన్ దగ్గరకి వెళ్ళింది. కనకమ్మ అసలు భర్తతోనే వెళ్ళి చెప్పాలనుకుంది. కృష్ణతో అంత చనువులేక భర్త చెప్తాడు కదా అని వూరుకుంది.

గోపీని చూస్తూనే ఏదో అనబోయిన కృష్ణమోహన్ కనకమ్మని చూస్తూనే చటుక్కున లేచి నిలబడ్డాడు.

"భోజనానికి రమ్మంటే రానన్నారుట. మీరు రాక పోతే నా మనసు చాలా బాధపడుతుంది మీరు ఏ టైముకి వచ్చినా మాకేమీ యిబ్బంది వుండదు" అంది ఎంతో అభి మానంగా.

చాలా యిబ్బందిగా నిలబడ్డాడు కృష్ణమోహన్. భద్రమ్మగారి దగ్గరంటే చనువుంది. వీళ్ళ దగ్గర ఆ చనువు లేదు - వెళ్ళకపోతే ఏమనుకొంటారో! వెళ్దామంటే మొహ మాటం. అతను నెమ్మదిగా ఏదో అనబోయాడు. కాని, కనకమ్మ అతన్ని ఏమీ చెప్పనీయలేదు. "మీరు చెప్పినట్టు మేము విన్నాము. యింక మీరేం చెప్పినా వినం - ఈ పూట మీరు మా యింటికి భోజనానికి రావల్సిందే" అంది చనువుగా నవ్వుతూ.

"మీరు తప్పకుండా రావాలి సార్! లేకపోతే మా అమ్మ చాలా బాధపడుతుంది" అన్నాడు గోపి.

మొత్తానికి అతని చేత "ఊఁ" అనిపించి కదిలింది కనకమ్మ.

కృష్ణమోహన్, గోపి కలిసే వచ్చారు. అప్పటికి రామనాథం వచ్చి పది నిముషాలు అయింది.

అనూరాధ కంచాలు, మంచినీళ్ళు పెట్టింది. పీటలు వాల్చింది. "ఇంక నేను వెళ్ళనా? నువ్వు వడ్డించగలవా?" అంది తల్లితో.

"కాస్త నెయ్యి, మంచినీళ్లు పోద్దువుగాని వుండు" అంది కనకమ్మ.

అనూరాధకి వుండడం ఇష్టం లేదు. "అక్కని పిలుస్తాను" అంది.

"దాని పిల్లలు ఏడుస్తోంటే కాసేపు ఆడించడానికి అటు వెళ్ళిందేమో! అన్నీ నేనే వడ్డిస్తాను. సరిగ్గా నెయ్యి అది అందకపోతే బాగుండదు" అంది కనకమ్మ.

తప్పనిసరిగా నిలబడింది అనూరాధ.

ముగ్గురూ వచ్చి కూర్చున్నారు.

బావ వస్తే భోజనం టైముకి వస్తానన్నాడు కదా, రాలేదేం?" గోపి అడిగాడు.

"రాత్రికి వస్తానని చెప్పాడుట" అంది కనకమ్మ.

కనకమ్మ వడ్డిస్తోంటే అనూరాధ నెయ్యి, మంచినీళ్లు వడ్డిస్తోంది.

కృష్ణమోహన్ మొదట వేసినవి మినహా మళ్ళీ ఏమీ వడ్డించుకోకపోవడం చూసి, కనకమ్మ అతను 'వద్దు వద్దు' అని చెప్తున్నా అడ్డంగా పెట్టేస్తున్నా వేసేసింది. "మీరు చాలా మొహమాటపడుతున్నారు. మీరు ఇంకా కాస్త వేసుకోవలసిందే" అంటూ.

వాళ్ళ భోజనాలు అయినాయి -

ఇంకో పది నిముషాలు ముళ్ళమీద కూర్చున్నట్లుగా కూర్చుని రామనాథం దగ్గర శలవు తీసుకుని కృష్ణ వెళ్ళి పోయాడు.

అనూరాధ ముభావం ఎందుకో అతనికి ఎంత ఆలో చించినా అర్థం కావడంలేదు. తను ఏం చేశాడు. అసందర్భంగా కూడా ఎప్పుడూ ఏమీ మాట్లాడలేదే!

పిల్లలందరికీ అన్నాలు వడ్డిస్తూ కనకమ్మ తనలో అను కొన్నట్టుగా అంది. "మొహమాటస్తుడు. సరిగా భోజనం చేయనేలేదు." అని క్షణం ఆగి, "బుద్ధిమంతుడు డబ్బుందని అసలు గర్వంలేదు. దుర్గమ్మ అలా అందేమిటి? ఆవిడ చెప్పిన లక్షణాలు అతనిలో ఒక్కటి కనిపించలేదు. ఇన్నాళ్ళ యింది. మనం వచ్చి - యిటు వైపుకి ఒక్కసారి కూడా రాలేదు."

'అతని మంచితనం అంతా తెలిసినట్టు మాట్లాడేస్తోంది- అమ్మ' అనుకుంది అనూరాధ. కాని, అతని చెడ్డతనం తనేం చూసిందో మాత్రం రాధ ఆలోచించలేదు. ఆ రోజు తను లోకమ్మ యింట్లో బట్టలు కుట్టుకొంటూ తల ఎత్తేసరికి అతను అనసూయ ఇంట్లో కిటికీ దగ్గర నిలబడి చూడడం - దానికి దుర్గమ్మ మాటలు తోడయినాయి. కాని, తనని చూస్తూనే అతని మనసు ఎంత రిలీఫ్ పొందుతుందో - తను నిరసనగా చూసినప్పుడు అతని మనసు ఎంత బాధపడు తోందో అనూరాధకి తెలియదు. అతను మంచి మనస్సుతో చేసే ప్రతీపని వెనుక ఏదో దురుద్దేశం వున్నట్టుగా అన్పి స్తుంది రాధకి.

ఉన్నట్టుండి శ్రీమతి అంది, "అతని పెద్దవాళ్ళు ఎవరో కనుక్కోని మన రాధని చేసుకోమని అడక్కూడదూ? అతని వరస చూస్తోంటే కట్నం తీసుకోడనిపిస్తోంది. ఒకవేళ తీసుకున్నా పెద్దగా తీసుకోడేమో..."

"అక్కా!" తీవ్రంగా అంది అనూరాధ. అలా ఎప్పుడు అక్కగార్ని కసురుకొన్నట్టుగా మాట్లాడలేదు రాధ.

శ్రీమతి ఆ తీవ్రతకి తెల్లబోయింది.

"నేను తప్పుమాట ఏమన్నాను! ఏం, నీకు యిష్టం లేదా?" అంది నెమ్మదిగా.

'లే' దన్నట్లు గబగబా తల ఆడించింది.

"అసలు అక్కకి ఇక్కడికి రావడమే ఇష్టంలేదు." సందు దొరికింది కదా అని చంద్రా అంది.

ఎక్కడేనా పెళ్ళికొడుకు వున్నాడంటే ఆడపిల్లల తల్లి తండ్రుల దృష్టి అటే వుంటుంది. కాని, యీ అంతస్తులనేవి వెనక్కి లాగుతూ వుంటాయి. కృష్ణమోహన్ రామనాథం దృష్టిలో వున్నా అతనితో సరితూగలేము అనుకుని తన కోరిక మనసులోనే వుంచుకున్నాడు. కనకమ్మకి అయితే కృష్ణమోహన్‌లో దుర్గమ్మ చెప్పిన లక్షణాలు లేకపోవడంతో అతన్ని తన అల్లుణ్ని చేసుకోవాలని వున్నా యీ అంతస్తే నోరు విప్పనీయలేదు. గోపీకి అప్పుడే సంబంధాలు వస్తున్నాయి. కాని, గోపీకి రాధకి, చంద్రాకి వివాహం కానిదే చేసుకోవడం ఇష్టంలేదు. వచ్చినవారు తాంబూలాలు పుచ్చు

కొందామని అంటే రామనాథం మెత్తపడ్డాడు. కాని, గోపీ వినలేదు. రాధకి పెళ్ళి చేయాలంటే కనీసం పదివేలు కావాలి - ఆడపిల్లల పెళ్ళిళ్ళు తలుచుకొంటేనే రామనాథానికి గుండెదడ వస్తుంది.

* * *

మధ్యాహ్నం మూడు గంటలయింది.

కృష్ణమోహన్ అప్పుడే నిద్రలేచి ముఖం కడుక్కొని వచ్చేసరికి రాజు కాఫీ తీసుకొచ్చాడు. అతను కాఫీ తీసుకొంటుండగానే ఆంజనేయులు, అనసూయా వచ్చారు.

"మీ ఇల్లు చూద్దామని వచ్చాను అన్నయ్యగారు" నవ్వుతూ అంది అనసూయ.

"రండి రండి" సంతోషంగా ఆహ్వానించాడు కృష్ణమోహన్.

కృష్ణమోహన్ పార్టీ యిచ్చినప్పుడు అనసూయ ఊళ్ళో లేదు.

చేతికి పచ్చని తోరంతో - కొత్తచీరలో నిండుగా వుంది అనసూయ. ఆ ముఖంలో తృప్తి, ఆనందం వున్నాయి. ఆ నవ్వుముఖం చూస్తే ఎవరయినా తమ బాధల్ని తాత్కాలికంగా కాస్సేపు మర్చిపోతారు. ఉన్నదానిలో సద్దుకుపోవాలనే తత్వం గలది అనసూయ.

ఆప్యాయంగా 'అన్నయ్యగారు' అంటూ అభిమానంగా మాట్లాడే అనసూయతో మొదట మొహమాటంగా మాట్లాడే కృష్ణ యిప్పుడిప్పుడు కాస్త చనువుగానే మాట్లాడుతున్నాడు. అనసూయ మొదట్లో కాస్త

భయపడేది. అతను ఏమనుకొంటాడోనని ఎక్కువగా పలక రించేది కాదు. తర్వాత తర్వాత తనే ధైర్యంచేసి మాట్లా డేది. అనసూయ పదేపదే ఆప్యాయంగా మాట్లాడడంతో ఆ అభిమానానికి మొహమాటం పోయింది. మామూలుగా మాట్లాడసాగాడు. ఆ మధ్య అనూరాధని చూడాలని వున్నప్పుడల్లా ఆంజనేయులు ఇంటికి వెళ్తుండేవాడు. అతను అస్తమానూ రావడంలో అనసూయ బెదురు పూర్తిగా పోయింది.

వాళ్ళకి కూడా కాఫీలు ఇవ్వగానే రాజుని బజారుకి పంపాడు.

"ఇప్పుడు చెప్పండి. ఇన్నాళ్ళకి నా ఇల్లు చూడాలని పించిందా ?" తనుకూడా ఓ కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"నాదేం తప్పు లేదండి! ఇదిగో! ఈయనగారికి బొత్తిగా తీరుబడి వుండడంలేదు పాపం" అంటూ భర్తకేసి చూసి నవ్వింది.

"పాపం! ఆంజనేయులు మరీ బిజీ అయిపోయాడు" అని నవ్వాడు.

"నీకేం నాయనా! కూర్చుని ఎన్ని కబుర్లయినా చెప్తావు. నాలుగు రోజులు వెళ్ళకపోయినా ఫరవాలేదు. నాకు అలాకాదే! ఒక్కపూట మానడానికి కూడా వుండదు" అన్నాడు.

ముగ్గురూ కాస్సేపు మాట్లాడుకున్నారు.

తర్వాత ఇల్లంతా చూసి, అనసూయ చాలా బాగుం దని మెచ్చుకుంది.

"అనూరాధ వాళ్ళు ఎక్కడుంటారు" అని అడిగింది.

"వాళ్ళు ఔటుహౌస్‌లో వుంటున్నారు. వెనుకవైపు ఇంకో రెండుగదులు వున్నాయి. అవికూడా వాడుకొంటు న్నారు" అని చెప్పాడు.

"ఇక్కడ హాయిగా వుండక అనూరాధ ఎందుకు ఇల్లు చూడమంది అన్నావు?" ఆంజనేయులు భార్యని అడిగాడు.

కిటికీ తలుపులు బార్లా తెరుస్తున్న కృష్ణమోహన్, ఆంజనేయులు మాట విని వెనక్కి తిరిగి ప్రశ్నార్థకంగా చూశాడు.

"అన్నయ్యగారు అద్దె తీసుకోమన్నారుట..."

"ఆ విషయాలు వాళ్ళ పెద్దవాళ్ళు చూసుకొంటా రుగా!" ఆంజనేయులు అన్నాడు.

కృష్ణకి అనూరాధ అభిప్రాయం తెలిసి చాలా బాధని పించింది. ఎందుకు తనంటే ఆ అమ్మాయికి యింత నిరసన! తను ఎప్పుడు అసందర్భంగా మాట్లాడటంగాని, ప్రవ ర్తించడంగాని చేయలేదే! తను మాట్లాడింది కూడా కుట్టు మిషను గురించే! అప్పుడు కూడా పెడసరంగానే మాట్లా డింది. ఎందుకో అతనికి అర్థం కాలేదు.

"అసలు ఆ అమ్మాయికి ఇక్కడకి రావడమే ఇష్టం లేనట్టుంది" కిటికీవైపుకి తిరుగుతూ నెమ్మదిగా అన్నాడు కృష్ణ.

"అంటే - యింట్లో వాళ్ళు అనుకొన్నారట - వూరికే

వుంటే ఏం బాగుంటుందని" అనసూయ ఖంగారుగా సర్దేసింది. అనూరాధకే యిష్టంలేదని అనసూయ గ్రహించేసింది.

ఆ మధ్య గోపి అద్దె విషయం అడిగితే కృష్ణ దాని గురించి ఏమీ బాధపడవద్దని చెప్పాడు. యింక కృష్ణకూడా ఏమీ మాట్లాడలేదు. యిక్కడకి వచ్చాక రామనాథం కాస్త నిశ్చింతగా కనిపించాడతనికి.

"కృష్ణ తన అభిప్రాయం చెప్పాడు. వాళ్ళ అభిమానం కోసం కృష్ణ అద్దె తీసుకోవాలా? అద్దె ఎక్కువ యివ్వాలంటే బాధ! ఎవరేనా మంచితనంతో వుండమంటే ఎక్కడలేని అభిమానాలు వచ్చిపడతాయి. కృష్ణ మంచితనం అర్థంచేసుకోలేకపోతే వెళ్ళిపోతారు. అది వాళ్ళయిష్టం." ఆంజనేయులు అన్నాడు.

తర్వాత ముగ్గురూ యింటి విషయాల్లోకి దిగిపోయారు.

కొంతసేపయాక అనసూయ అనూరాధ యింటికి వెళ్తానని వెళ్ళింది.

అనసూయని చూస్తూనే రాధ ఎదురెళ్ళి అనసూయ చెయి పట్టుకుని లోపలకి తీసుకొచ్చింది. అదివరకు బట్టలు కుట్టుకోవడానికి వెళ్ళడం మూలంగా రోజూ కలుసుకొనే వారు. యిప్పుడు యింట్లోనే మిషను వుంది. అయినా అదివరకటికన్న యిల్లు దూరమయింది. యిద్దరికీ ఎన్నాళ్ళో అయి చూసుకొన్నట్లుగా వుంది.

కనకమ్మ ఆప్యాయంగా పలకరించింది.

చాలాసేపు అందరూ కబుర్లు చెప్పుకున్నారు.

తర్వాత కనకమ్మ అంది. "అనసూయా, అతన్నికూడా పిలుచుకురా ఫలహారం చేద్దురుగాని."

"యిప్పుడేం వద్దండి పిన్నిగారు, ఎక్కడా ఖాళీలేదు. యీసారి వచ్చినప్పుడు ఏం పెట్టినా తీసుకుంటాను" అంది.

"అదేం కుదరదు. మీ యింటికి వచ్చినప్పుడల్లా ఏదో ఒకటి పెట్టేదానివి. నేను ఎప్పుడయినా 'ఒద్దు' అన్నానా! నువ్వు తినాల్సిందే! పోనీ రాత్రికి భోజనం మానేయ్" రాధ అంది.

తప్పనిసరి అయి కొద్దిగా తీసుకుంది అనసూయ.

అనసూయ ఓ యిల్లు ఖాళీగా వుందని చెప్పింది.

"యిల్లేమిటి?" కనకమ్మ తెల్లబోతూ అడిగింది.

అనసూయ రాధకేసి చూసింది.

"అదేనమ్మా! అప్పుడు యిల్లు కావాలనుకొన్నాం కదా! అనసూయకి చెప్పాలే యిల్లు ఖాళీగా వుంటే చూడమని" అంది.

"యిక్కడ అన్నీ బాగానే వున్నాయమ్మా అనసూయా! ఎంత చెప్పినా ఆ అబ్బాయి అద్దె తీసుకోవడం లేదు. కనీసం ఓ వందరూపాయలయినా తీసుకొంటే బాగుండేది" అంది కనకమ్మ.

"అన్నయ్యగారిది మంచిమనసు పిన్నిగారూ! ఉన్నవాళ్ళంతా ఉపకారం చేస్తారా? అద్దెకి యిచ్చుకొనే అభిప్రాయమే వుంటే ఎప్పుడో యిచ్చుకొనేవారు కదా!" అంది.

"అవుననుకో" అంది యింకేమీ అనలేక.

యింక వెళ్తానని అనసూయ లేచింది.

కనకమ్మ బొట్టుపెట్టి తాంబూలం యిచ్చింది.

అనసూయ వెనకాల రాధకూడా వెళ్ళింది. తల్లి వాళ్లు ఎవరూ రావటం లేదని గ్రహించి - అనసూయని అడిగింది. "ఎక్కడ యిల్లు కాళీగా వుందన్నావు ?"

"ఆంజనేయస్వామి గుడిలేదు ? దానికి దగ్గరే! రెండేసి గదులు రెండువాటాలు వున్నాయి. చాలా చిన్న గదులు వందరూపాయలు — రెండువాటాలు కలిసి తీసుకొంటే పదో పాతికో తగ్గిస్తారేమో!" అని క్షణం ఆగి, మళ్ళీ అంది. "యిక్కడ మీకు బాగానే వుందిగా రాధా! అద్దె మీరు యివ్వనసడంలేదు - అతనే వద్దు అన్నప్పుడు మీరెందుకు బాధపడడం ?"

"వూరికే వుండాలంటే ఎవరికయినా అభిమానంగానే వుంటుంది — ఒకమాట అడుగుతాను ఏమీ అనుకోకు. మీకు వాళ్ళకి బాగా స్నేహం — మిమ్మల్ని వచ్చి వూరికే వుండమంటే వచ్చి వుండగలరా ?" అని అడిగింది.

"అభిమానంగా రమ్మన్నప్పుడు సంతోషంగా వచ్చి వుంటాము. వున్న యిల్లు వదిలేసి కారణం లేకుండా రాము కదా! యీ విషయం గురించి నువ్వు అనవసరంగా బాధపడుతున్నావు - అతను చాలా మంచివాడు - యిప్పుడు వుండమని ముందు ముందు ఏదయినా అంటాడని భయపడక్కరలేదు - అలాంటి మనిషికాడు చాలా రోజులుగా అతను తెలుసు" అంది.

అనూరాధ యింకేమీ మాట్లాడలేదు.

అనసూయ రాధని ఓసారి రమ్మని చెప్పి వచ్చేసింది.

"నువెళ్ళి అక్కడ కూర్చున్నావు. నీ కోసం మీ అన్నయ్య స్వీట్ తెప్పించాడు. పోనీ తెప్పించినవాడు నాకు పెట్టాడా? నువ్వు వచ్చేవరకూ ఆ పాకెట్టుని చూస్తూ కూర్చోమన్నాడు" ఆంజనేయులు అమాయకంగా ముఖం పెట్టాడు.

"బాధపడకు. నీకు ఎక్కువే పెడతాలే" అన్నాడు కృష్ణ.

"యిప్పుడు ఎందుకు తెప్పించారు అన్నయ్యగారు" అంది.

"మీరు నా యింటికి మొట్టమొదటిసారి వచ్చారు. నేను మీ యింటికి వచ్చినప్పుడల్లా కాఫీ టిఫిన్ తీసుకోకుండా ఎప్పుడయినా వెళ్ళనిచ్చారా?" అని అడిగాడు.

"సరిగ్గా అనురాధా యిలాగే అంది. టిఫిన్ తినేవరకూ వదిలిపెట్టలేదు" అంది.

"అన్నట్టు ఆ అమ్మాయికి యింటి సంగతి చెప్పావా? లేకపోతే యింటికెళ్ళగానే 'అయ్యో మర్చిపోయాను' అంటే మళ్ళీ తీసుకురావడం నా వల్ల కాదు" ఆంజనేయులు అన్నాడు.

"ఓసారి చూశానంటే నన్ను ఎవరూ తీసుకు రానక్కరలేదు. యింటి విషయం చెప్పాను. ఆవిడ తెల్లబోయింది. యిక్కడ అంతా బాగానేవుంది అంది" అని, అక్కడ జరిగినదంతా చెప్పింది.

అనసూయ చెప్పినదంతా కృష్ణ విన్నాడు.

అతనికి అనూరాధ మీద మొదటిసారిగా కోపం వచ్చింది.

'తనవల్ల ఏదయినా తప్పంటే ఎంత కోపం వచ్చినా భరించవచ్చు - అకారణంగా ఆ కోపాన్ని భరించాలంటే చాలా కష్టం' అనుకున్నాడు.

"అయిదు అవుతోంది. ఇంకా లేస్తావా, లేదా?" అన్నాడు ఆంజనేయులు.

"అప్పుడే అయిదు అయిందా!" అని, "ఇంక వస్తాం అన్నయ్యగారు" అని లేచి నిలబడింది.

"వచ్చేటప్పుడు నా డ్యూటీ అయిపోతుంది - వెళ్ళేటప్పుడు బేబి డ్యూటీ నీది! టింగు రంగా అని నడుద్దామనుకొంటున్నావేమో! అదేం కుదర్దు" అన్నాడు.

"బేబిని నేనే ఎత్తుకుంటాను, మీరేం భయపడకండి" అంది.

రాజు ట్రే తీసుకొచ్చి అక్కడున్న టీపాయ్‌మీద పెట్టాడు. దాంట్లో యాపిల్ పళ్ళు, స్వీట్ బాక్స్, బిస్కెట్ పాకెట్లు వున్నాయి.

కృష్ణమోహన్ పర్సు తీసి నూటపదహార్లు ట్రేలో పెడుతూ "తీసుకోండి అనసూయా!" అన్నాడు. అతను పేరుపెట్టి పిలవడం యిదే ప్రథమం.

"యివన్నీ ఏమిటి?" భార్యాభర్తలిద్దరూ ఒకేసారి అన్నారు.

"యింక మీరేమీ అభ్యంతరం చెప్పద్దు" అంటూ ఆంజనేయులుకేసి తిరుగుతూ, "మా చెల్లాయికి నా యిష్ట

మెచ్చినంత యిస్తాను - మధ్యలో నువ్వు అడ్డువస్తే మహా పాపం చుట్టుకొంటుంది" అన్నాడు నవ్వుతూ.

"పళ్ళు స్వీటు తీసుకొంటాను అన్నయ్యగారూ !" నెమ్మదిగా అంది అనసూయ.

"మీ అన్నయ్యలు ఇస్తే తీసుకోరా!" అన్నాడు.

"నాకంత అదృష్టంలేదు - మీరే నా అన్నయ్య."

"చాలా సంతోషం - మరి యింకేమీ అభ్యంతరం చెప్పకండి" అన్నాడు వెంటనే.

అనసూయ భర్తకేసి చూసింది.

ఆంజనేయులు తీసుకో అన్నట్లు చూశాడు.

సంతోషంగా వాటిని అందుకుంది అనసూయ. తర్వాత అతని కాళ్ళకి నమస్కరించింది. అతను ఖంగారుగా వెనక్కి కదిలాడు. యథాలాపంగా నిలబడిన అతను అనసూయ అలా చేస్తుందనుకోలేదు.

"యిదేమిటి, నాకెందుకు ?" తెల్లబోతూ అన్నాడు.

"అన్నయ్యకి చెల్లెలు నమస్కరిస్తే వద్దు అనకూడదు- మహాపాపం చుట్టుకొంటుంది." అన్నాడు ఆంజనేయులు.

ముగ్గురూ నవ్వుకున్నారు.

* * *

"యిల్లు ఎప్పుడు కాళీ చేస్తున్నారు !"

ఉలికిపడి వెనక్కి తిరిగింది అనూరాధ.

కృష్ణమోహన్ నిలబడివున్నాడు.

అతను అక్కడకి ఎప్పుడు వచ్చిందీ రాధ చూడలేదు. హఠాత్తుగా అతను అలా అడిగేసరికి అసలు అతను అన్న

దేమిటో మొదట అర్థంకాలేదు. అర్థమయినాక తల తిరిగి పోయింది. 'ఛీ!' యితనిచేత యిలా అడిగించుకోవలసివచ్చింది' అనిపించి చాలా బాధపడింది. రాధ ఏదో సమాధానం చెప్పే లోగా అతను మళ్ళీ అడిగాడు. "యిల్లు ఎప్పుడు ఖాళీ చేస్తున్నారు" అని.

అతను అలా రెట్టించి అడిగేసరికి అనూరాధకి చాలా రోషం వచ్చింది. తడుముకోకుండా వెంటనే అంది. "చేస్తాం! ఎల్లకాలం మీ పంచనే వుండిపోము."

"ఆహాఁ! అలాగా! ఎల్లకాలం యిక్కడే వుండి పోతారేమోనని భయపడ్డాడు. ఎన్నాళ్ళల్లో ఖాళీ చేస్తారో చెప్తే - విని హాయిగా గాలి పీల్చుకొంటాను" నిదానంగా అన్నాడు.

"అద్దెయిస్తే తిరకొట్టడం ఎందుకు - యిలా అడగడం ఎందుకు." 'ఎంత అవమానం - యిలా నిలబెట్టి అడిగేస్తాడా! ఛీ, ఛీ!' అనుకుంది.

"అద్దె తీసుకొచ్చింది మీరు కాదుగా!"

"యింటికి పెద్ద మా నాన్నగారు యిచ్చారుగా! మా యింట్లో అన్నీ పెద్దవాళ్లు చూసుకోవడమే అలవాటు - అంతేగాని..."

"యిల్లుకూడా పెద్దవాళ్ళే చూసుకొనేవారుగా? మధ్య నీకెందుకు, యిల్లు చూడాలనే తాపత్రయం - యిల్లు మారిపోవాలనే పట్టుదలా!" నిలదీసినట్టు అడిగాడు.

అతను పెద్ద ఏదో అధికారం వున్నట్టుగా మాట్లాడుతోంటే రాధకి ఒళ్ళు మండిపోయింది. ఏదయినా చాలా

ఘాటుగానే జవాబు యివ్వాలనుకుంది. సమయానికి ఏం మాట్లాడాలో తోచలేదు.

రాధ ఏమీ మాట్లాడకపోయేసరికి కృష్ణ మళ్ళీ అన్నాడు, "నేను మీ నాన్నగారికి, గోపీకి కూడా చెప్పాను. వాళ్ళు వూరుకొన్నారు - మధ్య నీకు పట్టుదలగా వుంది, యిల్లు మారిపోవాలని. నేను నిన్నేం చేశాను?" అతని స్వరంలో బాధ స్పష్టంగా తెలుస్తోంది.

అతను హఠాత్తుగా - జడివానలా - మాటలు విసురుతోంటే తిరిగి తను ఏమందామన్నా మాటలు దొరకటం లేదు. అతనికి ఘాటుగా ఏం జవాబు చెప్పకుండా అక్కడే నిలబడడం చాలా అవమానంగా అనిపించి వెంటనే విసురుగా లోపలికి వెళ్ళిపోయింది. తను బయటకి వెళ్ళడమే తప్పయిందని బాధపడింది. అసలు సాధారణంగా ఎప్పుడూ వెళ్ళదు. శ్రీమతి వెళ్ళిపోతోంటే పిల్లలతో ఒక్కత్తి వెళ్ళలేదని కనకమ్మ శ్రీమతితో వెళ్ళింది. చంద్రా నిద్రపోతోంది. గోపీ, రామనాథం ఆఫీసుకి వెళ్ళారు. బాబు స్కూలునుండి రాలేదు. కృష్ణమోహన్ ఆ టైములో యింట్లో వుండడని - ఏమీ తోచక పూలమొక్కలు చూస్తూ తిరుగుతోంది.

యిది కృష్ణ చూశాడు.

క్రితంరోజు అనసూయ చెప్పినప్పటినుండి అతనిమనసు మండిపోతోంది. రాధని చూడగానే గబగబా బయటకి వచ్చాడు.

కృష్ణ యింట్లోకొచ్చిన వెంటనే డ్రస్ అయి బయటకి వెళ్ళిపోయాడు.

అనూరాధ యింట్లో కాలుకాలిన పిల్లిలా తిరుగుతోంది. 'అతను అడిగేవరకూ యింట్లోంచి కదలకపోవడం ఎంత సిగ్గుచేటు - ఛీ! అతను అంతటివాడు అని పొగడటమే గాని, ఒక్కరూ అతని నిజస్వరూపం తెలుసుకోడానికి ప్రయత్నించరేం? ఇన్నాళ్ళు చూశాడు. వీళ్ళు లొంగే ఘటం కాదురా బాబూ! వీళ్ళకి ఇల్లు ఇవ్వడం శుద్ధదండగ - లాభంలేదు అనుకొని వుంటాడు - ఇప్పుడు అమ్మా, నాన్నా ఏమంటారో చూడాలి - అసలు విషయం విని తల్లక్రిందులవుతారేమో!' అనుకుంది.

మళ్ళీ అంతలోనే ఎలా చెప్పాలి? చెప్తే నమ్ముతారా? నమ్మినా నమ్మకపోయినా చెప్పితీరాలి అనుకుంది.

రామనాథం ఆలస్యంగా వస్తానని చెప్పి వెళ్ళాడు.

గోపీ రాగానే ఏమాత్రం ఆలస్యం చేయకుండా అనేసింది రాధ "ఏరా! అనసూయ ఇల్లు కాళీగా వుందని చెప్పిందంటే నువ్వూ, నాన్నగారు మాట్లాడలేదు. ఆ ఇల్లు కాస్తా ఎవరో ఎగరేసుకుపోతారు. ఇల్లు మారడం వుందా, లేదా? లేకపోతే అతను పొమ్మనేదాకా వుండిపోదామా?"

"నువ్వు అనసూయకి చెప్పావా, ఆ అనసూయ నిన్న ఆయనతో అందిట. ఆయన నన్ను పిలిచి చివాట్లు పెట్టాడు. పదిసార్లు చెప్పించుకోవడంకూడా అసహ్యంగా వుంటుందే! పైగా గర్వం అనుకొంటాడు కూడా. ఇప్పట్లో ఇల్లు మారే ప్రసక్తిలేదు - అయినా ఆ తిప్పలేవో నేను పడతాను! నువ్వు నిశ్చింతగా ఉండు" అన్నాడు తాపీగా.

"ఇక్కడ ఏదో నిశ్చింతగా వుందని మురిసిపోతున్నారు

మీరంతా. అతను ఎప్పుడో హఠాత్తుగా 'మీరు ఇల్లు ఎప్పుడు ఖాళీచేస్తారు' అని అడుగుతాడనుకో! అప్పుడు మీ ముఖాలు చూస్తాలే!" రోషంగా అంది.

"అరే, ఎందుకు అతనంటే అంత కోపం? ఆయన ఈ రోజుకూడా చెప్పేను? అసలు అతను అలా అంటాడని ఎందుకు అనుకొంటున్నావ్! ఆయన్ని నువ్వు సరిగా అర్థం చేసుకోలేవు — అందుకే ఎప్పుడో ఏదో హఠాత్తుగా అనేస్తాడని భయపడుతున్నావు...మా బంగారు తల్లివిగా! కాస్త టీ పెట్టు" బతిమాలే ధోరణిలో అంటూ కాళ్ళు కడుక్కోవడానికి బాత్రూంలోకి వెళ్ళాడు.

* * *

"ఎవరో అయ్యగారు, అమ్మగారు వచ్చారు సార్!" అన్నాడు రాజు.

"ఎవరు" అంటూ బయటకి వచ్చాడు కృష్ణ.

కాత్యాయని, ఆమె భర్తా వచ్చారు.

కృష్ణ వాళ్ళకి గబగబా ఎదురు వెళ్ళాడు.

కాత్యాయిని కృష్ణ ఒంటిమీద ప్రేమగా చెయివేస్తూ అడిగింది "బాగున్నావా కృష్ణా!" అని అడిగింది. ఆవిడకి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కృష్ణ మనసుకూడా అదోలా అయిపోయింది.

"రండి లోపలికి మామయ్యా!" మేనమామతో అని మేనత్త చెయి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళాడు. "ఏమిటి మరీ ఇలా అయిపోయావు?" అని అడిగాడు కాత్యాయినిని.

"పెద్దదాన్ని అయిపోతున్నాను కదరా! ఇంకెలా

వుంటాను ?" అంది నవ్వుతూ. అప్పటికి, ఇప్పటికి మేనత్తలో చాలా మార్పు కనిపించింది. ఒక్కసారిగా ముసలి వాలకం వచ్చినట్టుగా కనపడుతోంది.

"ఎన్ని ఉత్తరాలు రాశాను అత్తయ్యా! ఒక్కసారి వచ్చి వెళ్ళమని." అభిమానంగా అన్నాడు.

"సంసార సాగరంలో మునిగితే ఇంక తేలటం అంటూ వుండదురా కృష్ణా" అని, "నేను పెద్దదాన్ని అయిపోయాను. ఎన్ని ఉత్తరాలు రాయించాను? ఒక్కసారి ఈ అత్తయ్యని చూడడానికి రాలేకపోయావా?" నిష్ఠూరంగా అంది.

"నాకు రెండు ఉత్తరాలు అందాయి..."

"అదేమిటి? ఏడు, ఎనిమిది ఉత్తరాలు రాశాను" అంటూ భర్తకేసి తిరిగి, "ఏమండి రాయలేదా?" అంది.

అతను తడబడ్డాడు. మళ్ళీ వెంటనే, "రాయకపోవడం ఏమిటి? రాశాము - ఒకొక్కసారి అందవు - పోస్టలు వాళ్ళని అసలు నమ్మకూడదు" అన్నాడు గంభీరంగా ముఖం పెట్టి.

ఎంత పెద్దవాడయినా ఆయనకి ఆ బుద్ధిపోలేదు.

ఆయన తడబాటు కృష్ణ, కాత్యాయిని కూడా గ్రహించారు.

"నేను సప్తజాతకుణ్ణని - నేను ఎక్కడకి వెళ్ళితే అక్కడ అరిష్టం పుడుతుందని నా మీద అనేక వాదులన్నాయి అత్తయ్యా! నేను ఎక్కడికీ వచ్చి - ఎవర్నీ బాధపెట్టదలుచుకోలేదు..."

"అదేమిటి కృష్ణా! నేను కూడా అలా అన్నానా? నువ్వు..."

"నిన్ను అనుకున్నవాళ్ళది మహా పాపం అత్తయ్యా! లేచి ముందు స్నానంచేయండి" అన్నాడు.

"కాఫీ పడందే బండి కదలదోయ్ అల్లుడూ!" అన్నాడాయన.

మాటల్లోనే రాజు ముగ్గురికీ కాఫీలు తీసుకొచ్చాడు.

"మీ కాఫీ ధోరణి ఈ అబ్బాయికి కూడా తెలిసిందిలా వుంది, నోటిలో మాట నోట్లో వుండగానే కాఫీ తీసుకొచ్చాడు" అంది కాత్యాయిని.

* * *

మేనత్త చెప్పిందంతా విని కృష్ణమోహన్ బాధపడ్డాడు.

"ఈ రోజుల్లో డబ్బంకోసమే తల్లి, తండ్రి. వాళ్ళని హాస్టల్లో వుంచి ఎంతెంత చదువులు చెప్పించాడు బాబాయ్! ఇప్పుడు వాడిదగ్గర నయాపైసా లేదని తెలిసి తొంగి చూసి ఒంగి వాలటం లేదు. నెలకుమా నాలుగు పదులు పంపితే అవుతుందా? కట్నం డబ్బు ఇవ్వలేదని ఈశ్వర్ని కాపరానికి తీసుకెళ్ళలేదు. మంచంలో అతుక్కుపోతున్నాడు" బాధగా - అంది.

"ఎన్నాళ్ళయింది పక్షవాతం వచ్చి?" అని అడిగాడు కృష్ణ.

"నాలుగు నెలలయిందిట. అప్పటినుంచీ వద్దామంటే కుదిరింది కాదు. నన్ను చూస్తూనే రెండు చేతులూ పట్టుకుని బావురుమన్నాడు. ఈశ్వరి నాతో వస్తానంది" అని ఆగింది.

"వాళ్ళు వద్దని అనుంటారు" పళ్ళబిగువున అన్నాడు.

"లేదురా! నువ్వు నమ్ముతావో నమ్మవో కాని చాలా మారిపోయారు వాళ్ళు. పిన్ని ఎప్పుడూ పైకి తేలేది కాదనుకో! బాబయ్య మాత్రం నాకు తగిన శిక్షే వేశాడు భగవంతుడు అంటూ ఒకటే గోల. నువ్వు వాళ్ళమీద చాలా కోపంగా వున్నావనుకొని ఇప్పుడు సర్దుకున్నారు."

"కొడుకులు వదిలేశారు - తమ్ముళ్ళు కలగజేసుకోలేదా? అందులో ఒకాయన డాక్టరుకూడా..."

"ఎవరేనా అంతా బాగున్నప్పుడే! వారం వారం వస్తానంటాట్ట - ఇరవైరోజులకి కాని రాడుట. మారిపోయింది అంటాడుట పైగా. కాని నా దగ్గిర వుండు అన్న మాట అనలేదుట" బాధగా అంది. ఎంత చెడ్డా అన్నగారు. తనని రమ్మని ఎప్పుడూ అనకపోయినా - ఒక్కసారి క్షేమ సమాచారాలు తెల్పుతూ ఒక్క కార్డు రాయకపోయినా రామబ్రహ్మాన్ని చూసేసరికి కడుపు తరుక్కుపోయింది కాత్యాయినికి. తను కాస్తన్నా సహాయం చేయచ్చు. తన వల్ల అయేటని కాదు. భర్త చేయును. చూడానికి తీసుకు రావడానికే తెగ మూలుక్కుని ఇన్నాళ్ళకి తీసుకొచ్చేడు.

కృష్ణమోహన్ ఎవరికో ఫోనుచేసి వచ్చేడు.

తర్వాత రాజుని పంపి టాక్సీ తెప్పించేడు. ఆ టాక్సీలో కృష్ణ, కాత్యాయిని, ఆమె భర్తా బయలుదేరారు.

టాక్సీ ఓ డాక్టర్ గారింటి ముందు ఆగింది.

కాస్సేపు మామూలు విషయాలు మాట్లాడుకొన్నాక

కృష్ణ ఆ డాక్టరుగారితో విడిగా అన్నివిషయాలు వివరంగా మాట్లాడేడు.

"నీ మేనల్లుడు చాలా గొప్పవాడే అయాడు - ఏమిటో అనుకొన్నాను." అన్నాడు.

భర్తమాటలు కాత్యాయినికి వినపడలేదు. ఆవిడ దృష్టి అంతా కృష్ణ ఆ డాక్టరుతో ఎందుకు మాట్లాడు తున్నాడా అని ఆలోచిస్తోంది. అసలు ఎందుకు తీసుకొచ్చేడు? మొదట టాక్సీ తెప్పించి తనూ బయలుదేరుతుంటే రామ బ్రహ్మం ఇంటికనుకుంది.

ఆ డాక్టరు కృష్ణ వచ్చి కూర్చున్నారు.

కాఫీలు తీసుకోవడం అయింది.

"ఇంక బయలుదేరుదామా" అన్నాడు కృష్ణ.

డాక్టరు లేచి లోపలకి వెళ్ళాడు.

డాక్టరు లోపలకెళ్ళగానే కృష్ణ మేనత్తతో అన్నాడు, "ఈయన చాలా మంచి డాక్టర్ అత్తయ్యా! పక్షవాతం కేసులు ఎన్నో నయం చేశారు. నేను అన్నీ మాట్లాడేను. అక్కడ అన్నీ వివరంగా చెప్పమను..."

"ఒరే, ఈయన పెద్దడాక్టర్‌లా వున్నాడు - డబ్బు ఎంత..."

"అవన్నీ నేను చూసుకొంటాను - నేను అన్నీ మాట్లాడేనన్నానుగా! అక్కడ మీరేం ఇవ్వద్దు...కాని, ఒక్కటి అత్తయ్యా! నువ్వే నీ అన్నగారికి వైద్యం చేయి స్తున్నావు."

"అంటే!" అర్థంగాక అడిగింది.

"నా సంగతి అక్కడ చెప్పద్దు - నాకిష్టంలేదు."

"అదేమిట్రా! ఇంత మంచి మనసుతో చేస్తూ - మధ్య నాకా మంచిపేరు? నీమీద వాళ్ళకి వెనకటి భావం లేదురా నువ్వు నమ్మట్లేదు."

"వాళ్ళకి నామీద ప్రేమ వుందని తెలిసికాదు - వుండాలనే ఆశచేతా కాదు - ఆయన మంచంలో అలుక్కుపోతున్నాడని చెప్పేవు - బాధపడ్డావు. సాటిమనిషిగా చేస్తున్నానంతే! నువ్వు చెప్పద్దు - చెప్పేవంటే నీ దగ్గరకి ఎప్పుడూ రాను" చివరి మాటని నవ్వుతూ తేల్చేశాడు.

డాక్టరు మెడికల్ బాగ్‌తో తిరిగివచ్చేడు.

డాక్టరు, కాంపౌండరూ, కాత్యాయినీ, భర్తా టాక్సీలో కూర్చున్నారు.

"నువు రావా?" ఆశ్చర్యంగా అడిగింది కాత్యాయిని.

"ఇప్పుడు కాదు" అని, "డబ్బు ఏమైనా కావాలా?" అని అడిగాడు.

కాత్యాయిని మాట్లాడలేదు. ఇంత చేస్తున్నవాడు తను కూడా వస్తే బాగుండేది. అన్నయ్య పూర్తిగా మారిపోయాడు అని బాధపడింది.

అత్తయ్య మొహమాట పడుతోంది అనుకుని పర్సులోంచి మూడువందలు తీసి ఇస్తూ "ఎందుకేనా అవసరం అవుతుందేమో - ఖర్చుపెట్టు" అన్నాడు. ఆవిడ మౌనంగా అందుకుంది.

టాక్సీ కదిలి వెళ్ళిపోయింది.

ఎక్కడ చూసినా ఫ్లూ జ్వరాలే! ఏ హాస్పిటల్లో చూసినా కిటకిటలాడుతూ వున్నారు జనం. ఓ యింట్లో ఒకరికి

జ్వరం వచ్చింవండే ఆ యింట్లో ప్రతీ ఒక్కరినీ పలకరించి మరీ వెళ్తోంది.

మొదట చంద్రాకి, బాబుకి వచ్చింది జ్వరం.

కనకమ్మ, రామనాథం వూళ్ళో లేరు. కనకమ్మ అక్క కూతురి పెళ్ళి. వాళ్ల యింట్లో ఏ పెళ్ళిళ్ళకి ఏదో ఒక యిబ్బందితో కనకమ్మ పెళ్ళిళ్ళకి వెళ్ళలేదు. ఇప్పుడు ఆఖరి కూతురి పెళ్ళి. అక్కగారు ఘాటుగా వుత్తరం రాసింది. యీ పెళ్ళికి కనుక మీరు రాకపోతే యికముందు మీ ఇంట్లో ఏ శుభకార్యాలకి రాను అని. కనకమ్మ వాళ్లందరినీ చూసి అయిదారేళ్లయింది. తమ్ముళ్ళుకూడా రెండు నెలలపాటు వుండేలా రమ్మన్నారు.

"అమ్మా! హాయిగా వెళ్ళిరా! వాళ్లంత అభిమానంగా రమ్మన్నప్పుడు ఒక్కసారయినా వెళ్లకపోతే బాగుండదు. మా కోసం ఏమీ దిగులు పడద్దు - మేము చక్కగా వండుకు తింటాము" పిల్లలు ధైర్యంగా చెప్పడంతో కనకమ్మ, రామనాథం వెళ్ళారు. వాళ్ళు వెళ్ళి పదిరోజులయింది. గోపి తండ్రికి వుత్తరం రాయలేదు. యీ వుత్తరం చూస్తే ఇన్నాళ్ళకి వెళ్ళినవాళ్ళు వెంటనే వచ్చేస్తారని.

గోపీ యిద్దర్ని డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళి తీసుకొస్తున్నాడు. ఓరోజు చంద్రా లేవలేకపోయింది. "యీ చలితో నేను రాలేను అన్నయ్యా" అంది.

గోపీ డాక్టర్ని యింటికి తీసుకొచ్చాడు.

మొదట రెండురోజులు కృష్ణమోహన్‌కి తెలియదు. తర్వాత తెలిసి డాక్టరుకో తనుకూడా లోపలకి వచ్చాడు.

కృష్ణని చూస్తూనే అనూరాధ లోపలకి వెళ్ళిపోయింది.

చంద్రాకి, బాబుకి తగ్గేసరికి గోపీకి వచ్చేసింది. ఆ మర్నాడు అనూరాధకి వచ్చేసింది. గోపీ ఓపికచేసుకుని లేచి రాధని లేపాడు. కాని, రాధ మూసినకన్ను తెరవలేదు.

"బాబూ! గేట్లో నిలబడి కాళీ రిక్షా వెళ్తోంటే పిలు. వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను" అన్నాడు గోపీ.

"నేను వెళ్ళి తీసుకొస్తాను అన్నయ్యా" అన్నాడు బాబు.

"ఒద్దు. నిన్ననే పత్యం తిన్నావు — నీరసంమీద కళ్ళు తిరుగుతాయి. వెళ్ళి కాళీ రిక్షా వెళ్తోంటే పిలు" అన్నాడు.

బాబు గేటు దగ్గర నిలబడ్డాడు.

అప్పుడే- యింటికొచ్చిన కృష్ణమోహన్ బాబుని చూసి, "అప్పుడే ఓపిక వచ్చిందా ఇక్కడ నిలబడ్డావు?" అన్నాడు నవ్వుతూ.

"మా రాధక్కకి కూడా జ్వరం. అసలు కళ్ళు తెరవడం లేదు" అన్నాడు.

'రాధకి జ్వరమా' "ఎప్పటి నుండి" అని అడిగాడు.

"ఈ పూటే."

గోపీకి జ్వరమని తెలుసు. ఆఫీసుకు రానని బాబుచేత కబురు చేస్తే వెళ్ళి చూసి వచ్చాడు. రాధకి జ్వరం అని తెలియదు.

"ఇక్కడెందుకు నిలబడ్డావు?" అని అడిగాడు.

బాబు చెప్పాడు.

"నేను తీసుకొస్తాలే! నువ్వు లోపలికి వెళ్ళు" అన్నాడు.

బాబు లోపలికి వెళ్ళిపోయాడు.

కృష్ణ స్కూటరు లోపలపెట్టి వచ్చాడు. కృష్ణని చూస్తూనే గోపీ లేచి కూర్చోబోయాడు.

"పడుకో లేవకు" అంటూ రాధ మంచంకేసి చూశాడు. రాధ ముడుచుకుని పడుకుంది.

"కూర్చోండి అంకుల్" అని బాబు కుర్చీ జరిపాడు.

"మా రాధకి కూడా జ్వరం. డాక్టర్ని తీసుకొద్దామని" అన్నాడు.

కృష్ణ రాధమీంచి చూపులు మళ్ళించకుండానే అన్నాడు "బాబు చెప్పాడు. నేను వెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను."

కృష్ణ వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు.

అంత జ్వరంలోనూ కృష్ణని చూస్తూనే ముడుచుకుపోయింది.

తర్వాత కృష్ణ గోపీతో అన్నాడు, "ఇంట్లో వంట చేయొద్దని చెప్పు. రాజు వండి తీసుకొస్తాడు."

"అబ్బే! వద్దండి. వాళ్ళిద్దరేగా! చంద్రా చేస్తుంది" మొహమాటంగా అన్నాడు.

"ఫరవాలేదు. బాబు నా అతిథి. ఆ అమ్మాయి మొహమాటపడుతుందేమో - రాజు ఇక్కడకి తీసుకొస్తాడు." అన్నాడు.

గోపీ వద్దని మళ్ళీ ఎక్కడ అంటాడోనని చంద్రాకి భయమేసింది. చంద్రాకి కాఫీ కాచి ఇచ్చే ఓపికకూడా

లేదు. 'వెధవ జ్వరం. అమ్మ ఊళ్ళో లేనప్పుడే రావాలా' అని బాధపడింది.

కృష్ణ లోపలికి వచ్చాడు.

ఈజీఛైర్‌లో పడుకున్నాడు.

అతని మనసు అంతా గందరగోళంగా వుంది.

'అసలు ఈ జ్వరాలు ఎందుకొస్తాయి' అనుకున్నాడు. 'తనకి ఎప్పుడూ జ్వరం రాదు. తనది రాయిలాంటి శరీరం' అనుకున్నాడు. రాధ అలా మూసిన కన్ను తెరవకుండా పడుకుంటే అతనికి పిచ్చి ఎక్కినట్టుగా మతిపోతున్నట్టుగా వుంది. రాధని చూసి వచ్చినప్పటినుంచీ పసిపిల్లాడిలా 'అసలు జ్వరాలు ఎందుకొస్తాయి' అనుకోసాగాడు.

చంద్రాకి - బాబుకి - గోపీకి జ్వరం వస్తే వెళ్ళి చూసి వచ్చాడు. తనకి చేతనయిన సహాయం చేశాడు. ఇప్పుడు రాధకి జ్వరం వచ్చిందంటే అతని మనసు నిలవటం లేదు. నుదురు తాకి చూడాలని - ఎలా వుందో స్వయంగా అడిగి తెలుసుకోవాలని అతని మనసు ఆరాటపడుతోంది. తనని చూసి రాధ మొహం చిట్లించుకోవడం కూడా కృష్ణ గమనించలేదు. ముడుచుకు పడుకున్న రాధకేసి బాధగా, దిగులుగా చూశాడు.

కృష్ణమోహన్ రెండు పూటలా చూసి వస్తున్నాడు.

జ్వరంలో వుండగానే రాధకి అతనిరాక విసుగ్గా వుంది. జ్వరం కాస్త తగ్గాక భరింపరానిదిగా వుంది. 'తనతో ఆ రోజు ఇల్లు ఎప్పుడు ఖాళీ చేస్తారని అడిగిన పెద్దమనిషి మళ్ళీ ఈ సహాయం ఎందుకు? పిల్లో, వెర్రి ముఖాలు. ఎప్పుడో

బోల్తా పడతారు. అతని నిజస్వరూపం తెలిసి అప్పుడు నెత్తి మొత్తుకొంటారు' అంతా తనకి తెలిసినట్టే అనుకుంది రాధ.

రాధకి జ్వరం తగ్గింది. తేలిగ్గా లేచి కూర్చుంది.

కృష్ణమోహన్ తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు.

"చంద్రా! ఈ రోజు ఇక్కడే వంటచేయి. అయినా నాకూ తేలిగ్గానేవుంది. నేనుకూడా సహాయం చేస్తాను" అంది. గోపీ క్రితంరోజే పథ్యం తిన్నాడు.

"ఇంకా నయంలే! నువ్వు వంట చేస్తావా? నేను చేయగలను" అంది చంద్రా.

అప్పుడే లోపలికి వస్తున్న కృష్ణ ఈ మాటలు విన్నాడు. అక్కడ గోపీ లేడు. "కూర్చోండి" అంటూ చంద్రా కుర్చీ జరిపింది.

"రెండు రోజులు పోయాక మీరే చేసుకుందురుగాని-ఈ పూట వంట చేయద్దు చంద్రా" అన్నాడు కృష్ణ.

అతన్ని చూస్తూనే లేవబోయింది రాధ. కాని, కళ్ళు గిర్రున తిరిగాయి. లేచి లోపలికి వెళ్ళే ఓపికలేక మోకాళ్ళ మీద గడ్డం ఆన్చుకుని అలాగే కూర్చుంది.

అతను వంట చేయద్దు అనేసరికి వెంటనే అంది తల ఎత్తకుండానే "వద్దు - ఇంక మేము చేసుకుంటాము."

"చంద్రా ఇంకా నీరసంగా వుంది. వంట ఏం చేయ గలదు?" రాధని పరీక్షగా చూస్తూ అన్నాడు.

"నేను చేస్తాను" వెంటనే అంది.

"ఏమిటి! పథ్యం తినకుండానేనా?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

అసలు అతన్తో అన్ని మాటలు మాట్లాడ్డమే తప్పు అనుకున్న రాధ ఇంకేమీ మాట్లాడలేదు. గోపీ వచ్చేక కాస్సేపు మాట్లాడి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళగానే "అతను వద్దంటే మనం వంట చేసుకోవడం మానేయడమేనా గోపీ! అదివరకు మనం ఎప్పుడూ చేసుకోలేదా?" కోపంగా అంది.

"అమ్మ ఊళ్ళోలేదని - చంద్రా నీరసంగా వుంది, చిన్నపిల్లని ఆయన అన్నారు..."

"అంటే అమ్మ వచ్చేవరకూ అతను పంపిస్తుంటే తింటూ కూర్చుందామా?"

"ఛ, అలా ఎందుకు చేస్తాం" అని, "సర్లే! నేను సాయంత్రం ఆయనకి నచ్చచెప్తాను" అన్నాడు. కృష్ణమోహన్ పేరు ఎత్తితేనే రాధకి ఎందుకు కోపమో గోపీకి అర్థం కాలేదు. 'అంతే ఒక్కొక్కరికి ఒక్కొక్కరు నచ్చరు. వాళ్ళంటే పడదు' అనుకొన్నాడు. సాయంత్రం ఆరు అవుతోంది. 'గోపీ ఇంకా రాలేదు. గోపీ నీరసంగా వున్నాడుగా- అతను స్కూటరుమీద తీసుకొస్తాడేమో. గోపీ రాకుండానే తను వెళ్ళి, రాజుకు చెప్పేయాలి - గోపీ వచ్చేకంటే - అతనేదో అంటాడు. బాగుండదంటూ గోపీ మొహమాట పడిపోతాడు' అనుకుంది రాధ.

రాధ నెమ్మదిగా లేచింది. కూర్చుని లేచిందంటే కళ్ళు తిరుగుతున్నాయి. లేచి నాలుగడుగులు వేసిందంటే ఓ పక్కకి విసిరేసినట్టుగా - తేలిపోతున్నట్టుగా వుంది.

ఎలాగో ఓపిక చేసుకుని లేచి నిలబడింది.

వంటగదిలోకి వెళ్ళి కొంచెం మంచినీళ్ళు తాగింది.

నెమ్మదిగా కృష్ణమోహన్ ఇంటికేసి వచ్చింది.

అతను ఈ టైములో వుండడు. 'అతను వస్తే గోపీ ఈ పాటికి వచ్చేవాడే! గోపీ, అతనూ రాకుండా చెప్పేయాలి' అనుకుంది.

నెమ్మదిగా లోపలికి వెళ్ళింది.

రాధ ఎప్పుడూ కృష్ణమోహన్ ఇంట్లోకి రాలేదు. శ్రీమతి 'అతని ఇల్లు చూద్దాం రా' అంటే కూడా 'అతనిల్లు చూసేదేమిటి' అని రాలేదు. శ్రీమతి చంద్రాని తీసుకెళ్ళి చూసి వచ్చింది.

'రాజు ఎక్కడ వుంటాడో' అనుకొంటూ హాలుదాటి లోపలికి వెళ్ళింది.

లోపలనించి ఏవో గిన్నెల చప్పుడు వినిపించింది.

ఆ శబ్దం వచ్చినవైపు నెమ్మదిగా వెళ్ళింది. ఎందుకో కాళ్ళు వణికాయి.

రాజు అల్మారా దగ్గర వున్నాడు.

ఆ రూమ్‌లో డైనింగ్ టేబుల్ వుంది. ఓ ప్రక్కగా ఫ్రిజ్ వుంది.

"ఇదిగో రాజూ" పిల్చింది. తను గట్టిగా మాట్లాడేనను కొంటోంది. కాని రాధ మాట్లాడిన మాట శ్రద్ధగా వింటే గాని వినేవాళ్ళకి అర్థం కానంత నీరసంగా వస్తోంది.

రాజుకి వినపడలేదులా వుంది ఇటు తిరగలేదు.

"రాజూ!" గట్టిగా పిల్చింది. ఆ కాస్త గట్టిగా పిల్చినందుకే నీరసం వచ్చేసింది.

ఎవరో పిల్చినట్టయి ఇటు తిరిగాడు. రాధని చూసి గబగబా వచ్చేడు. వస్తూనే "వంట చేసేస్తున్నానమ్మా! అవగానే తీసుకొస్తాను" అన్నాడు.

'ఛీ! తను వంట అయిందా అని అడగడానికి వచ్చాననుకొన్నాడులా వుంది.' అనుకుని, "వంట మాకు చేయద్దు, అది చెప్పడానికే వచ్చాను, చేసేస్తావేమోనని." ఆగింది.

"మీరు చాలా నీరసంగా వున్నారు - అమ్మగారు కూడా వూళ్ళోలేరు" అన్నాడు.

"ఫరవాలేదు. చెల్లెలు వుంది. అయినా నాకు తగ్గిపోయింది. ఇంక చేయకు."

"అయ్యగారితో చెప్పండి. ఆయన నన్ను తిడ్తారు" ఇంక చెప్పినా వినట్లేదని అలా అన్నాడు రాజు.

"సరే! చెప్తాలే! నువ్వు మాత్రం చేయకు. అనవసరంగా వృథా అవుతుంది" అని ఇవతలకి వచ్చేసింది. హాల్లోకి వచ్చేసరికి గది గుమ్మంలో కృష్ణమోహన్ నిలబడి వున్నాడు.

అతన్ని చూసేసరికి పాదాలు టక్కున ఆగిపోయినాయి.

'ఇంట్లోనే వున్నాడా?...వుండనీ' అనుకుని ముందుకి కదలబోయింది.

"చెప్పకుండానే వెళ్ళిపోతున్నారేం?" అన్నాడు నిదానంగా చూస్తూ. అతనికి చాలా కోపంగా వుంది. నీరసంగా వుందని వూరుకొన్నాడు గాని అసలు తన తప్పేమిటో అడిగి తెలుసుకోవాని వుంది.

"ఇక్కడే వుండి అన్నీ విన్నారుగా!" నిబ్బరంగా చెప్దామన్నా గొంతు వణికింది. అతను ఇంట్లో వున్నట్లు తెలిస్తే తను రాకపోను.

"నేను వినలేదు."

"రాజుకు చెప్పేను..."

"ఈ ఇంట్లో రాజుడి కాదు పెత్తనం" అని, "నీకు పనికి రాకపోతే వేరే వండుకు తిను. వాళ్ళు ఇక్కడే తింటారు. నీలా మొండివాళ్ళు కారు వాళ్ళు" కాస్త గట్టిగానే అన్నాడు.

అతను 'నువ్వు' అంటున్నాడని గ్రహించింది. ఒళ్ళు మండింది.

"మాటల్లో మర్యాద ఇవ్వడం నేర్చుకోండి. చనువు లేనివారితో చనువుగా మాట్లాడా నుకోవడం ఏమంత మంచిది కాదు." తీవ్రంగా అంది.

అతనికి మొదట రాధ అన్నది ఏమిటో అర్థం కాలేదు. అర్థం అయినాక చాలా బాధపడ్డాడు. ఆ వెంటనే "సారీ!" అన్నాడు.

అతను అలా అనేస్తాడని రాధ అనుకోలేదు. అలా అన కుండా వుండవలసింది. తను అతనికన్న చిన్నది. అన్నా తప్పు లేదు. అతను 'మీరు' అని మర్యాదగా మాట్లాడినంత మాత్రాన అతను మంచివాడనా అర్థం! అనుకుంది.

రాధ నిలబడలేకుండా వుంది. గోడమీద చెయ్యి ఆన్చుకుంది.

"ఒంట్లో ఎలా వుంది" అతను మాట మారుస్తూ అడి గాడు.

అతను ఒక్కసారిగా అదోలా అయినట్టు కనబడడంతో 'ఛ! ఎందుకొచ్చాను?' అనుకుంది. అతను అడిగిన దానికి సమాధానంగా తం 'బాగానే వుంది' అన్నట్లుగా వూపి వచ్చేసింది.

కృష్ణమోహన్ గదిలోకి వచ్చి కిటికీ దగ్గర నిలబడ్డాడు.

అనూరాధ చూపులు - మాటలు అతన్ని చాలా బాధపెడ్తున్నాయి.

రాధికలా వున్న రాధని చూసి ఆశ్చర్యపోయాడు. తరుచు చూడాలనే ఆత్రుతని అణుచుకోలేకపోయాడు.

తనంటే రాధకి నిరసన భావన అని తెలుసుకుని ఇంక అలా వెళ్ళకూడదు - దేనిలోనూ ఇరుక్కోకూడదు అనుకొంటూనే-ఎందుకో అందుకు కలగజేసుకొంటూ వచ్చేడు - తనంటే రాధకి విసుగు, నిరసన భావం. తనింట్లో వుండాలంటే బాధ ? తనింట్లో తయారయిన వంటకం తినాలంటే రాధకి ప్రాణంమీదికి వచ్చినట్టుగా వుంటుంది. ఇన్ని గ్రహిస్తూ కూడా ఎందుకు తనింతవరకూ తీసుకొచ్చేడు ? బాధగా కిటికీ వూచలకి తల ఆన్చుకున్నాడు కృష్ణమోహన్.

* * *

కనకమ్మ, గాంమనాథం వూరునుంచి తిరిగి వచ్చేరు. వచ్చినప్పటినుంచి కబుర్లు చెప్పుకుంటున్నా కబుర్లు తెమలట్లేదు.

కనకమ్మ పూతరేకుల చుట్టలు, మినపసున్ని, కొబ్బరి కాయలు, అరటికాయలు వూరినించి తెచ్చిన వాటిల్లో తలో కాస్త తీసుకుని తనే స్వయంగా కృష్ణకి ఇవ్వాలని తీసుకొచ్చింది.

"ఇన్ని నేనొక్కడిని ఏం చేసుకొంటానండి" అన్నాడు మొహమాటంగా.

"ఎన్ని వున్నాయి. ఆట్టే లేవు" అంది.

కనకమ్మ అలా వెళ్ళిందో, లేదో కాత్యాయిని ఈశ్వరిని తీసుకొచ్చింది.

"వీడేనే కృష్ణ అన్నయ్య. వూళ్ళో వుండీకూడా ఒకర్నొకరికి పరిచయం చేయాల్సి వస్తోంది" అంది.

వీడేనే కృష్ణ అన్నయ్య అనగానే నవ్వబోయిన ఈశ్వరి మేనత్త మిగతా మాటలు అనేసరికి సిగ్గుపడి తల వంచుకుంది.

"కూర్చో ఈశ్వరీ" అన్నాడు కృష్ణ అభిమానంగా.

ఈశ్వరి కూర్చుంది.

కృష్ణ అడిగినవాటికే జవాబులు చెప్పసాగింది. ఈశ్వరి బెదురుతోందని గ్రహించేడు.

ఈశ్వరికి ఇల్లంతా తిప్పి చూపించేడు. ఈశ్వరి సంతోషంగా చూసింది.

"నేను ఇన్ని మాట్లాడుతోంటే నువ్వు ఒక్కటీ మాట్లాడవేం ఈశ్వరీ!" అన్నాడు నవ్వుతూ. కృష్ణ అంత ప్రాణం ఇచ్చినట్టుగా మాట్లాడుతోంటే ఆశ్చర్యంతో-ఆనందంతో నోటమాట రావటంలేదు ఈశ్వరికి. "మా మీద నీ కస్సలు కోపం లేదా అన్నయ్యా!" అని ఆశ్చర్యంగా అడిగింది.

"ఎందుకు కోపం?" అన్నాడు.

ఇంక ఈశ్వరికి ఎలా అడగాలో అర్ధంకాలేదు. ఇప్పుడు కోపం లేదు కదా అని సంతోషించింది.

"ఎలా వుందే ఈశ్వరీ మీ అన్నయ్య ఇల్లు?" కాత్యాయిని అడిగింది.

"అన్నయ్య ఇల్లు బాగుండక ఇంక ఎవరి ఇల్లు బాగుం

టుంది!" అంది సంతోషంగా నవ్వుతూ. ఈశ్వరి పువ్వులు కోసుకుంటానని వెళ్ళింది.

ఈశ్వరి అటు వెళ్ళగా చూసి కాత్యాయిని అంది, "నీ కోపం వస్తుందో ఏమోరా కృష్ణా! మరి తప్పింది కాదు."

కిటికీదగ్గర నిలబడి పూలుకోసుకుంటున్న ఈశ్వరిని అభిమానంగా చూస్తున్న కృష్ణమోహన్ ఇటు తిరక్కుండానే "ఏమిటి" అన్నాడు.

"ఎంత చెప్పకుండా దాద్దామన్నా కుదరలేదురా! అన్నయ్యకి అనుమానం కలిగింది. తనమీద ఒట్టుపెట్టి చెప్పమన్నాడు. చెప్పేవరకూ పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టనని భీష్మించుకూర్చున్నాడు. ఏం చేయను చెప్పు" సంజాయిషీ ధోరణిలో అంది.

కృష్ణ పూర్తిగా ఇటు తిరిగాడు.

"అసలు ఆ అనుమానం ఎందుకు వచ్చింది?" అని అడిగాడు.

"నేను డాక్టర్ని తీసుకొచ్చి వైద్యం చేయిస్తున్నానంటే ఎవరు నమ్ముతారు? మీ మామయ్య సంగతి వాడికి తెలియదా? ఈపూట పట్టు పట్టుకూర్చున్నాడు. ఇంక చెప్పక తప్పింది కాదు. ఇంక వాడి ఆరాటం చూడాలి. ఆ మాటలు వినాలి. మీ పిన్నికి జ్వరం. నిన్ననే పత్యం తీసుకుంది. వాడి ధోరణి చూసి ఖంగారు పడిపోయింది. మీరేం ఖంగారు పడకండి. నేను తెలివిగానే మాట్లాడుతున్నాను. వాడికి ఇంట్లో శుభకార్యాలకి కూడా శుభలేఖలు వేయలేదు. వాడికెందు

కింత అభిమానం నా మీద అంటాడు. ఇప్పుడు నుంచున్న మటంగా వెళ్ళాలంటాడు. నాకు చాలా ఓపిక వచ్చింది. వాడి దగ్గరకి వెళ్ళాలి అంటూ కూర్చున్నాడు. వాడికి సర్దిచెప్పి ఇలా వచ్చేము." అంతా చెప్పి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది.

కృష్ణమోహన్ ఏమీ మాట్లాడలేదు. వచ్చి మేనత్త ఎదురుగా కూర్చున్నాడు.

ఈశ్వరి పువ్వులు కోసుకొచ్చింది. "దారం వుందా అన్నయ్యా!" అంది.

ఈశ్వరి 'అన్నయ్యా - అన్నయ్యా' అని పిలుస్తోంటే అనిర్వచనీయమైన భావంతో అతని మనసు నిండిపోయింది. రక్త సంబంధీకులు ఇంతమంది వుండికూడా తను ఇన్నాళ్ళూ ఒంటరిగా బ్రతికేడు. లేచి దారపుకోలు తీసుకొచ్చి ఇచ్చేడు.

ఈశ్వరి చకచకా మాల కడుతోంటే అలాగే చూస్తూ వుండిపోయాడు.

* * *

"ఇదిగో ఈ కవరు వాళ్ళకి అందజేయి" అంటూ ఓ పొడుగాటి కవరు మేనత్త చేతుల్లో పెట్టేడు కృష్ణమోహన్.

కాత్యాయిని అందుకొంటూ "ఏమిటివి" అంది అనుమానంగా.

"పొలం తాలూకు దస్తావేజులు..."

"అంటే" తెల్లబోయి అడిగింది.

"లేకపోతే నాకెందుకవి — నేనేం డబ్బుకోసం చేశానా? నేను చేసిన ఈ పనికి ఆ లోకంలో వున్న నా తల్లితండ్రులు నన్ను క్షమిస్తారనే చేశానా? నా మనసు మండి

చేశాను. ఆయన నోటికి హద్దూపద్దూ లేకుండా పోతోంటే భరించలేక చేశాను..." క్షణం ఆగేడు.

కాత్యాయిని ఏం మాట్లాడలేకపోయింది.

"ఆయన్ని ఎప్పుడూ పల్లెత్తు మాటని ఎరుగను. వాళ్ళ నెత్తిమీదికెళ్ళి కూర్చోలేదు. నాకేం చేయలేదనికూడా నేను ఎవరి గురించీ ఎప్పుడూ అనుకోలేదు, అనలేదు. ఆయన కెందుకు నా మీద అంత కక్ష కట్టేడు? నన్ను గురించి ఎలాంటి ప్రచారం చేసినా సహించేను. నేను ఆయన కళ్ళ పడ్డానంటే - ఆయన హేళనకి అడ్డుండదు - అయినా భరించేను. నాకు ఏమాత్రం - పరిచయం వున్న వ్యక్తయినా ఆయన్ని కలవడం మహాపాపం - వాళ్ళ దగ్గర నా గురించో పంచాంగం విప్పడం - ఆయనతో ఏమిటని దానికీ వూరుకొన్నాను. కాని - రాధిక...రాధిక - తన గురించి కూడా ఆయన ఎంత దుష్ప్రచారం చేశాడో ఎవరికీ తెలియదు..." అతని గొంతు భారంగా అయిపోయింది. చటుక్కున అక్కడ నించి లేచి కిటికీ దగ్గరకి వెళ్ళిపోయాడు.

అక్కడనించే మెల్లగా అన్నాడు, "ఇంక అప్పుడు నేను సహించలేకపోయానత్తయ్యా! ఇవి వాళ్ళకి ఎలా అందజేయాలా అని ఆలోచిస్తున్నాను - సరే! అంతలో నువ్వు వచ్చేవు" అన్నాడు.

"అవునురా కృష్ణా! మీ మామయ్య వచ్చి చెప్పేసరికి నేనెంత బాధపడిపోయానో తెలుసా? అప్పుడు అన్నయ్య అంటున్న మాటలు తెలిసి వివరంగా వుత్తరం

రాశానుకూడా - ఏమిటో వాడి తత్వం మొదటినించీ అంతే! ఇప్పుడు మంచంలో పడ్డాక అన్నీ తెలుసుకొన్నాడు" బాధగా అంది.

కృష్ణ ఏదో అనబోతూ ఇటు తిరిగాడు.

గుమ్మంలో ఈశ్వరి నిలబడివుంది. కన్నీటితో చెంపలు తడిసివున్నాయి.

"ఈశ్వరీ" గబగబా దగ్గరకెళ్తూ ఖంగారుగా అన్నాడు.

"అంతా విన్నానన్నయ్యా! నీ గురించి అందరూ అన్నవి నిజమేనేమో అనుకొనేదాన్ని - మా నాన్న గురించి కూడా యీ విధంగా తలచలేదు. మా నాన్న తరఫున నేను..."

"ఈశ్వరీ" భుజం తడ్తూ, "ఇంక ఆ విషయాలు నువ్వేం తలవద్దు - ఏదో ఆ సంగతులు గుర్తుకొచ్చి - నేనూ అన్నాను. నువ్వు కంటతడి ఎప్పుడూ పెట్టకూడదు. ఇంటి ఆడ బడుచు అందర్నీ అధారిటీ చేస్తూ, నవ్వుతూ వుండాలి. తెలిసిందా?" అన్నాడు.

కన్నీటి తెరలమధ్యనే సంతోషంగా నవ్వింది ఈశ్వరి.

తర్వాత మేనత్తతో అన్నాడు కృష్ణమోహన్, "ఎలాగూ వచ్చేవు - ఇక్కడకూడా కొన్నాళ్ళుండి వెళ్ళు అత్తయ్యా!"

"ఎందుకు వుండను రా! ఆఖరి మజిలీ నీ దగ్గరే!" అందావిడ.

ఈశ్వరికేసి తిరుగుతూ "అత్తయ్యతో నువ్వూ రావాలి ఈశ్వరీ" అన్నాడు.

"అన్నయ్యా! ఇప్పుడు మాతో రావా?" అని అడిగింది.

"వస్తానన్నాక రాకుండా వుండను. రావలుచుకోబోతే వస్తానని మాట ఇవ్వను. కాని ఇప్పుడు కాదు. ఇప్పుడు ఆయన దేనికీ ఉద్రేకపడకూడదు..."

"ఇంకా వాడు వెనుకటి మనిషనుకొంటున్నా వేమిటిరా" అని కాత్యాయని,

"నాన్న చాలా మారిపోయారన్నయ్యా!" అని ఈశ్వరి ఒకేసారి అన్నారు.

"అందుకే చెప్తున్నాను. నన్ను చూడగానే ఆయన ఆ ఆనందంలో - తను అదివరకు చేసినవన్నీ ఏకరవు బెట్టి హైరానా పడిపోతాడు. ఇప్పుడు ఆయనకి విశ్రాంతి కావాలి" అన్నాడు.

"ఇప్పుడు నువ్వు రాకపోతే నీ కింకా తనమీద కోపం పోలేదనుకుని ఇంకా బాధ పడతారన్నయ్యా!" అంది మెల్లగా ఈశ్వరి

"ఈ రోజే అర్జంటుగా వూరు వెళ్తున్నానని - పది రోజుల్లో వస్తానని — రాగానే వస్తాడని చెప్పు! నేను డాక్టర్ గారితో మాట్లాడేను. తగ్గుతుందని చెప్పేడు. ఇంట్లో తిరుగుతూ ఆయన పనులు ఆయన చేసుకోగలిగితే చాలు. ఆయన మానసికంగా బాధపడకుండా చూడండి" అన్నాడు.

* * *

మూడునెలలు తీర్థయాత్రలు చేసి ప్రకాశరావు పార్వతి తిరిగి ఇంటికి వెళ్ళేముందు కృష్ణమోహన్ దగ్గరకి వచ్చేరు.

అదివరకులా వాళ్ళరాక కృష్ణమోహన్‌కి ఆనందం కలిగించలేదు.

మనసులో బెదురుని కనపడనీయకుండా వారిని సంతోషంగా ఆహ్వానించేడు.

ఇక్కడ అనూరాధని చూసి పార్వతి ఏ విధంగా ఫీలవుతుందోనని అతని భయం. రాధ అప్పుడు జ్వరం వచ్చేక-మళ్ళీ అతని కంటబడలేదు.

రాధని చూడాలనే ఆతృతని అతనూ నొక్కిపెట్టి, ఆలోచించడం మానేశాడు.

వాళ్ళు వచ్చి స్నానాలయి కాఫీలు తాగేసరికి కాత్యాయిని వచ్చింది.

"ఈశ్వరి రాలేదా అత్తయ్యా!" అని అడిగాడు కృష్ణ.

"వదిన అన్నయ్యలు, వదినగార్లు వచ్చేరు. అమ్మ ఒక్కత్తీ చేసుకోలేదు. నాలుగు రోజులు పోయాకా వస్తానని చెప్పి అన్నయ్యకి అంది" అని చెప్పింది.

కాత్యాయిని ప్రకాశరావుని గుర్తు పట్టింది గాని పార్వతిని గుర్తు పట్టలేదు.

తర్వాత తెలిశాక ఒకరొకరు ఆప్యాయంగా పలకరించుకొన్నారు.

"మీ అన్నగారికి ఇప్పుడు కులాసాగా వుందా" అంటూ పార్వతి అడిగింది.

"ఇప్పుడు కాస్త మెరుగే! రావడమంటే క్షణాల మీద వస్తుంది గాని - తగ్గడానికి సంవత్సరాలు పడతాయి" అంది కాత్యాయిని.

ఫలహారాలు అయినాక కృష్ణమోహన్ బయటకి వెళ్తూ "నేను ఓ గంటలో వచ్చేస్తాను. ఒకవేళ ఆలస్య మయినా నా కోసం కూర్చోకండి మీరు భోజనం చేసే యండి" అన్నాడు.

"ఎంత పొద్దుపోయినా ఫరవాలేదు. అందరూ కలిసే చేద్దాం" అన్నారు పార్వతి, కాత్యాయిని. అతను వెళ్ళి పోయాడు.

* * *

భోజనాలయి అందరూ కాసేపు కబుర్లు చెప్పుకుని తలోచోటా పడుకొన్నారు.

మూడు గంటలయింది. కాత్యాయినికి మెలుకువ వచ్చి లేచి కూర్చుంది.

ఇంకా పార్వతి నిద్రపోతోంది. ప్రయాణాలు చేసి చేసి వుండేమో చాలా అలసిపోయినట్టుగా వుంది. పార్వతిని లేపకుండా యివతలికి వచ్చేసింది కాత్యాయిని.

'చెట్లనిండా పూలే! పెట్టుకొనే వాళ్ళు ఏరి!' అనుకుంది. పెళ్ళిసంగతి కృష్ణదగ్గర ఎలా కదపాలో ఆవిడకి అర్ధంకావటం లేదు. వాడి మనసు బాధపడకుండా కదపాలి_ అనుకుంది.

రెండు లైన్లు బారుగా బంతిచెట్లు. వాటినిండా ముద్ద బంతిపూలు ఎరుపువి పసుపువి విరబూసి వున్నాయి. పోసీ బంతిపూలు కోసి దండలుకట్టి గుమ్మాలకి కడదామని లోపలికి వెళ్ళి ఓ పళ్ళెం తీసుకొచ్చింది.

కాత్యాయిని ముందు చెట్లవి కోయలేదు. చూడ్డానికి

అందంగా వుంటాయని వాటిని వుంచేసింది. వెనక చెట్లవి కోద్దామని వెళ్ళింది.

కాత్యాయిని పూలు కోస్తోంటే ఎవరిదో పరిచయం వున్న గొంతులా వినిపించింది. అవుట్ హౌస్‌లో ఎవరో వున్నారని చెప్పేడు కృష్ణ. వాళ్ళు తనకి తెలిసున్నవాళ్ళా అని ఆలోచిస్తున్నంతలోనే ఆ పరిచయంవున్న గొంతు మళ్ళీ వినిపించింది.

'దుర్గమ్మ గొంతులా వుందే! దుర్గమ్మే వుంటే ఎవరో అని ఎందుకు చెప్పేడు కృష్ణ' అనుకొంటూ అటు అడుగులు వేసింది.

దుర్గమ్మ నోటివెంట కృష్ణప్రసక్తి వచ్చేసరికి టక్కున ఆగిపోయింది.

"ఒక్కొక్కళ్ళ బ్రతుకంతేనమ్మా కనకమ్మా! పిన తండ్రి ఆస్థి అంతా వేసుకొన్నాడు. పాపం వాడు పక్షవాతం వచ్చి మంచంలో పడి వీడి ఉసురున ఏడుస్తున్నాడు. వీడి ఉసురున పడి ఎవరూ ఏడవలేగులే! ఆ మేనమామ మేనత్త పిల్ల చచ్చి అలా ఏడుస్తున్నారా? వీడి మూలంగానే అది చచ్చింది? ఇంతమందిని ఏడిపించి వీడు మాత్రం ఎన్నా....."

దూకుడుగా లోపలికి వచ్చింది కాత్యాయిని.

కొత్త వ్యక్తిని చూసి కనకమ్మ ఎవరా అని లేచి నిలబడింది.

కనకమ్మ అలా లేచి నిలబడడంతో తనూ ఇటు తిరిగింది దుర్గమ్మ.

మొదట ఎవరో అనుకుంది. ఆ ఉగ్రరూపం చూసి

హాశలిపోయింది. తనూ లేచి నిలబడుతూ "నువ్వాటే కాత్యాయినీ! ఎప్పుడొచ్చావు? ఎన్నాళ్ళయిందే నిన్ను..."

"ఛీ, నోరుముయ్యి! ఇంకా నువ్వు తంపులు పెట్టడం మానలేదూ! కృష్ణ పేరెత్తడానికి కూడా నీకు అర్హత లేదు..." ఆయాసంగా ఆగింది.

దుర్గమ్మ నవ్వుతూ తెల్లబోయింది. కాత్యాయిని వినే స్థితిలో లేదు.

"నీకు ఒకరిచేత చెప్పించుకొనే వయస్సా! పుట్టుకతో వచ్చిన బుద్ధి చివరికంటా పోదని రుజువు చేయాలనుకొన్నావులా వుంది. ఆ పిల్ల ఎలా చచ్చిందో చూసినట్టే చెప్తున్నావే! వీడిమూలంగా చస్తే ఆ పిల్ల తలిదండ్రులు వీడి గడప తొక్కుతారా? వాళ్ళూ వచ్చేరు ఈ పూట - వచ్చి చూడు."

దుర్గమ్మకి కళ్ళు తిరిగినట్టయ్యింది. 'ఇంతమందిలో అవమానం.'

ఆఖరి అస్త్రంగా అంది దుర్గమ్మ, "ఎన్ని కబుర్లు నేర్చేవే! మీ వదినమీద ఎన్ని చెప్పి ఏడ్చేదానివి..."

"అవును. చిన్నతనంలో చేసిన తప్పు గ్రహించి బుద్ధిగా మసులు కొంటున్నానే గాని నీలా గడ్డి తినటంలేదు. పో ఇక్కడ్నించి" హుంకరించింది.

సణుక్కుంటూ విసవిసా వెళ్ళిపోయింది దుర్గమ్మ. తలెత్తి కనకమ్మకేసి చూడలేకపోయింది. ఈ గొడవకి లోపల గదిలోవున్న అనూరాధ చంద్రా వచ్చారు.

కనకమ్మ అదివరకు దుర్గమ్మ మాటలు నిజమేనేమో అనుకుంది. కాని ఇక్కడికి వచ్చేక కృష్ణ ప్రవర్తనలో వంక

పెట్టడానికి లేదని ఎప్పుడో గ్రహించింది. దుర్గమ్మ చంద్రా బజారెడితే కనిపించి కూడా వచ్చింది. వచ్చినప్పటినుండి కృష్ణ గురించి చెప్తూ ఆడపిల్లలు జాగ్రత్తని చెప్తోంటే విసుగ్గా వున్నా భరిస్తోంది.

కాత్యాయిని కేకలూ విని అప్పుడే లేచి ఇవతలకి వచ్చిన పార్వతి 'ఎవరిమీద ఈవిడ అంత కేకలేస్తోంది. కృష్ణా – మేన మామా అంటోంది' అనుకొంటూ వచ్చింది.

దుర్గమ్మ అవమానభారంతో గబగబా వెళ్తూ పార్వతిని చూసింది. ముహం తిప్పుకుని గబగబా వెళ్ళిపోయింది.

కాత్యాయిని కనకమ్మతో అంటోంది.

"కృష్ణ నా మేనల్లుడేనండీ! అన్న కొడుకు. చిన్నప్పటి నుండీ ఈ అన్నయ్యదగ్గరే వుండేదాన్ని. మా వదిన్ని తెగ బాధపెట్టేది. అసలు ఆవిడ బుద్ధే అంత" అప్పుడే అక్కడ కొచ్చిన పార్వతిని చూసి, "ఈవిడే కృష్ణ మేనమామ భార్య. వీళ్ళే కృష్ణని దగ్గరుంచుకొని చదువు చెప్పించారు" అంది.

"రండి లోపలికి" అంటూ వాళ్ళిద్దరినీ లోపలికి తీసు కెళ్ళింది కనకమ్మ.

కాత్యాయిని కూర్చుంది.

"కూర్చోండి" కనకమ్మ అంది.

"కూర్చోవమ్మా" అంది కాత్యాయిని. కాత్యాయినికి ఇంకా ఆయాసం పూర్తిగా తగ్గలేదు. వీళ్ళమాటలేవీ పార్వతికి వినపడలేదు.

దుర్గమ్మ మాటలని ఖండిస్తూ కాత్యాయిని అన్న

మాటలు యింకా రాధ చెవుల్లో గింగురుమంటున్నాయి. పరాగ్గా గుమ్మం దగ్గర అలాగే నిలబడింది.

పార్వతి కళ్ళు రాధ మీదనే నిలిచివున్నాయి. కలలో లేచి నడుస్తున్నదానిలా నడిచి రాధ దగ్గరకి వెళ్ళింది. పరాగ్గా వున్న రాధ వులికిపడింది.

కనకమ్మకి పార్వతి అలా ఎందుకు వెళుతోందో అర్థం కాక "రండి కూర్చోండి" అంది మళ్ళీ. కాత్యాయిని రాధని అంత పరీక్షగా చూడలేదు. అయినా రాధికని ఎప్పుడో చాలా రోజుల క్రితం చూసింది. అందుకని రాధని మామూలుగా చూడ్డంలో ఆవిడ కేమీ రాధిక పోలికలు గుర్తించలేదు.

పార్వతి రెండుచేతులూ రాధ భుజాలమీద వేసింది.

ఆవిడ పెదాలు అదురుతున్నాయి. కాళ్ళు పట్టు తప్పిపోతున్నట్టుగా అనిపించింది. రాధ చెయి అలా పట్టుకుని నిలుచున్న చోట అలాగే కూర్చుండిపోయింది. పార్వతితో సమానంగా రాధకూడా కూర్చుండిపోయింది.

రాధకి అంతా అయోమయంగా అన్పించసాగింది.

"అక్కయ్యా! ఏమిటమ్మా ఇదీ?" కాత్యాయిని దగ్గరకొచ్చి అంది చెయి పట్టుకొంటూ.

"చూడు కాత్యాయినీ! రాధిక... రాధికలా లేదూ?" అంటూ రాధతో "నీ పేరేమిటమ్మా!" అంది పార్వతి

కంఠం వణికింది. ముచ్చెమటలు పోస్తున్నాయి. బలవంతంగా వుగ్గబెట్టుకున్నట్టుగా కూర్చుంది.

కాత్యాయిని అనూరాధని అప్పుడు పరీక్షగా చూసింది. లంగా ఓణీతో తనింటికొచ్చిన రాధికని గుర్తు తెచ్చుకొంది. 'అవును - రాధికని అప్పుడు చూసినవాళ్ళు ఇప్పుడు ఈ రాధని చూస్తే కాలం తెచ్చిన మార్పు తప్ప ఏం తేడా అనిపించదు.

కాత్యాయిని నిట్టూర్చింది. పార్వతి చేయి అందిపుచ్చుకొంటూ "లే, అక్కయ్యా! ఇంట్లోకి వెళ్దాంరా!" అంది లాలింపుగా. అనూరాధకి అంతా అయోమయంగా వుంది. బొమ్మలా అలాగే కూర్చుంది.

కనకమ్మ గబగబా అంది, "కాఫీ తీసుకుని వెళ్ళురుగాని. ఆవిడ్ని యిలా కాస్సేపు పడుకోనివ్వండి" అంటూ పక్క దులిపి దిండు సరిగా వేసింది.

"మరోసారి వస్తాంలెండి. ఆవిడ అదోలా అయిపోతోంది. వాళ్ళమ్మాయే పోయింది. ఆ అమ్మాయి గురించే దుర్గమ్మ కల్పించి చెప్తోంది. వీళ్ళమ్మాయి అచ్చు మీా అమ్మాయిలానే వుండేది. అందుకే అక్కయ్య అలా అయిపోతోంది" అని, "లే అక్కయ్యా!" అంది.

పార్వతి లేవలేదు. రాధనే చూస్తూ "నీ పేరేమిటమ్మా!" అంది మళ్ళీ.

"అనూరాధండీ!" అంది మెల్లగా రాధ.

చంద్రా గబగబా కాఫీ పెట్టి తీసుకొచ్చింది.

"యిప్పుడెందుకండీ యివన్నీ" అంది కాత్యాయిని.

"కాఫీదేముంది తీసుకోండి" అంది కనకమ్మ.

పార్వతి మారు మాట్లాడకుండా కాఫీ తీసుకుంది.

పార్వతిని ఎలాగయితేనేం అక్కడనించి లేవదీసి యింట్లోకి తీసుకొచ్చింది.

వాళ్ళు వచ్చేసరికి కృష్ణమోహన్ కాలుగాలిన పిల్లిలా హాల్లో తిరుగుతున్నాడు.

ప్రకాశరావుకి యిదేం తెలియక "ఎక్కడకి వెళ్ళార్రా వాళ్ళు" అని అడిగాడు.

వీళ్ళని చూడగానే ఖంగారుగా దగ్గరగా వచ్చేడు కృష్ణ.

కృష్ణ దగ్గరకి రాగానే పార్వతి మొదటి ప్రశ్న "యిన్నాళ్ళు నాకు చెప్పలేదేం కృష్ణా!" అని.

కృష్ణమోహన్ మాట్లాడలేదు. వెళ్ళి మంచంమీద పార్వతి కూర్చోడానికి వీలుగా దిండ్లు అమర్చసాగాడు. కాత్యాయిని పార్వతిని మంచం దగ్గరకి తీసుకొచ్చింది.

"ఏమిటి, ఏమయింది?" ఖంగారుగా అడిగాడు ప్రకాశరావు.

భర్త రెండుచేతులూ పట్టుకుని ఆవేశంగా అంటోంది "రాధికండీ! మన రాధిక..."

"రాధికేమిటి - యింకెక్కడ రాధిక" అతను బాధగా అంటూ కాత్యాయని కేసి తిరిగి, "మీరు చెప్పండి. ఏం జరిగిందసలు ?" ఆతృతగా అడిగాడు. కాత్యాయిని జరిగింది చెప్పింది.

"నువ్వు కాస్సేపు విశ్రాంతి తీసుకో పార్వతీ !" అను నయంగా అన్నాడు.

యిదేం వినిపించుకొన్నట్టు లేదు పార్వతి. తన ధోరణిలో అంటోంది. "అచ్చు రాధికలా వుండండి. రాధికలా ఏమిటి - మన రాధికే ! మనమీద కోపం వచ్చివుంటుంది. అసలే అదోలా వుందిగా ! పిక్నిక్‌కి వెళ్ళనంటోంటే నేనేగా దిగులుగా వుందని బలవంతంగా పంపేను ? అందుకు కోపం వచ్చి...కోపం వచ్చి..." రెండు చేతుల్లో మొహం దాచు కుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

వాళ్ళకి కాస్త ఎడంగా రాయిలా నిలబడ్డాడు కృష్ణ మోహన్.

ప్రకాశరావు ఏమీ మాట్లాడలేని వాడిలా వుండి పోయాడు.

కాత్యాయిని ఓదార్చగా ఓదార్చగా కొంతసేపటికి తేరుకుంది.

చాలాసేపు అందరూ మౌనంగా వుండిపోయారు.

కాత్యాయినే చొరవగా ఏదో ఒకటి మాట్లాడ

సాగింది. ఏదో మర్యాదకోసం ఒకరికొకరు సమాధానాలు చెప్పుకోవడమేగాని - సహజత్వం లేదు.

సాయంత్రం అయిపోయింది.

బొత్తిగా మాటలు రానివాడిలా - మూగగా వుండి పోయిన కృష్ణమోహన్‌ని అప్పుడు గమనించింది పార్వతి. తను తొందరపడి బయటపడి పోయానని అప్పుడు గ్రహించింది. అలా గ్రహించిన మరుక్షణంనించీ తనే ఏదో ఒకటి కల్పించుకుని మాట్లాడసాగింది.

ఒక్కసారిగా పార్వతిలో మార్పుచూసి ప్రకాశరావ్, కాత్యాయిని మొదట కొంచెం ఖంగారు పడ్డా తర్వాత 'అమ్మయ్య' అని తేలిగ్గా వూపిరిపీల్చుకున్నారు. యింత తొందరగా ఆవిడ తేరుకొంటుందని వాళ్ళు అనుకోలేదు.

"బంతిపూలు దండలు గుచ్చుదాం రా అక్కయ్యా!" అంది కాత్యాయిని. పార్వతి వెంటనే సరే అని కాత్యాయినితో సమానంగా దండలు గుచ్చి అన్ని గుమ్మాలకూ కట్టింది. తర్వాత ఎవరూ చూడకుండా అవుట్‌హౌస్‌కేసి నెమ్మదిగా వెళ్ళింది.

కనకమ్మ లోపల వంట పనిలో వుంది. అనూరాధ కుర్చీలో బొమ్మలా కూర్చుని వుంది.

పార్వతిని చూడగానే లేచి నిలబడి "రండి" అంటూ ఆహ్వానించింది.

"ఏం చేస్తున్నావమ్మా!" అంటూ నవ్వుతూ పలకరించి తను తెచ్చిన తెల్లచామంతుల మాలని రాధ తలలో పెట్టింది. రాధ సంతోషంగా పెట్టించుకుంది.

పార్వతి అభిమానంగా కబుర్లు చెప్తోంటే అనూరాధ అప్పుడప్పుడు తగిన విధంగా నవ్వుతూ జవాబులిస్తోంది.

కాత్యాయిని పార్వతి ఇంట్లో కనపడక ఖంగారుగా వచ్చింది. పార్వతి నవ్వుతూ మాట్లాడటం చూసి, "యిక్కడున్నావా?" అంది తేలిగ్గా వూపిరి పీల్చుకుంటూ.

"అమ్మాయికి పువ్వులు ఇద్దామని వచ్చేను కాత్యాయినీ!" అంది.

* * *

కాత్యాయిని, పార్వతి ద్వారా రాధిక ఎలా పోయిందో తెలిసింది అనూరాధకి.

రాధిక బ్రతికి బాగుంటే కృష్ణమోహన్‌కి ఇచ్చి పెళ్ళి చేసేవారనీ తెలుసుకుంది.

ఇన్ని సంగతులు తెలుసుకున్న అనూరాధకి మతిపోయినట్లయింది. తను కృష్ణమోహన్‌ని ప్రతీ విషయానికి ఎంత అపార్థం చేసుకుందో తల్చుకొంటే తనమీద తనకే అసహ్యం కలగసాగింది. అతను తనపట్ల చూపే ఆదరణని, శ్రద్ధని తను ప్రతీదానికి వేరే అర్థాలు కల్పించుకుంది. అమ్మపాటి తను ఆలోచించలేకపోయిందా!- అనుకుని బాధపడింది. పార్వతి 'రా అమ్మాయీ! కాస్సేపు కూర్చుందుగాని'

...తని ఎదురుపడలేక మౌనం వహించింది. ఏ ...మొహం పెట్టుకుని అతని ఎదురుగా వెళ్ళగలదు.

...ను, రాను అనూరాధకి మనోవేదన ఎక్కువయి పోయింది. మనసుకి ఎంత సర్ది చెప్పుకోందామన్నా సర్ది చెప్పుకోలేకపోతోంది.

ఒక్కసారి అతని దగ్గరకెళ్ళి "నన్ను క్షమించండి" అనేస్తే ఈ బాధ తగ్గిపోను.

కాని, ఎలా? అతనితో తనకేం చనువు వుందని వెళ్ళి చెప్పగలదు?

* * *

కృష్ణమోహన్ షోకేస్ దగ్గర నిలబడి వున్నాడు.

అతని చేతిలో లేడీస్ వాచీ వుంది - దానికి 'కీ' ఇస్తున్నాడు.

అది తను ఆనాడు ఇంటర్వ్యూకి వెళ్ళినప్పుడు రాధికకి కొన్న వాచీ - తను వచ్చేసరికి రాధికే ఎదురు పడాలని - తను రాధికకోసం ప్రెజంటేషనుగా తెచ్చిన వాచీ రాధిక మణికట్టుకి అమర్చి - ఆ కళ్ళల్లో విరజిమ్మే వింతకాంతుల్ని చూడాలని ఉవ్విళ్ళూరుతూ — తెచ్చిన వాచీ అది.

ఆ చిన్న షో కేస్‌లో రాధిక ఫోటో వుంటుంది. ఆ ఫోటోకి రోజూ ఓ తెల్లగులాబి పెట్టి - ఆ వాచీకి 'కీ' ఇవ్వడం అతని దినచర్యలో ముఖ్యమైంది.

రాధిక ఫోటోకి ఓ తెల్ల గులాబి
ఇచ్చి పల్చని సిల్కు తెరని - రాధిక ఫోటో ఆ
వచ్చినా కనపడకుండా లాగేస్తాడు.

అతనికి రాధిక ఫోటోని ఎవరూ చూడటం యిష్టం వుండదు. చూసినవాళ్ళు చూసినట్టు వూరుకోరు. ఎవరినుండి ఎటువంటి సానుభూతిని అతను భరించలేడు.

*   *   *

అతను గదిలోంచి యివతలకి వచ్చేసరికి పార్వతి కనకమ్మతో కబుర్లు చెప్తోంది. కృష్ణ రాగానే లేచి నిలబడ బోయింది కనకమ్మ.

"కూర్చోండి. చిన్నవాడు కృష్ణ వస్తే లేవటం ఏమిటి" అంది పార్వతి.

"మీరు కూర్చోండి" అంటూ అతను మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయాడు.

ఈసారి పార్వతి వెళ్తానని తొందర పడటం లేదు. అదివరకులా వాళ్ళు ఇంకో నాలుగు రోజులు వుండాలని కృష్ణ కోరుకోవటం లేదు. అనూరాధ మాట తలవందే పార్వతి నోటివెంట మాటరాదు. అతను వెళ్ళమని చెప్ప లేడు. వాళ్ళు వెళ్తామంటే వెంటనే 'ఊఁ' అనడానికి సిద్ధంగా వున్నాడు.

పనిమీద రవిశంకర్‌తో వూరు వెళ్ళాడు కృష్ణ మోహన్.

అతను వూరు వెళ్ళాక ధైర్యంగా రాన వచ్చి పార్వతి దగ్గర కూర్చోసాగింది. అదివరకు పార్వతి ఎన్నిసార్లు రమ్మన్నా రావడానికి ధైర్యం చాలలేదు. ఇప్పుడు అతను వూళ్ళో లేకపోవడంతో ధైర్యంగా వచ్చింది.

పార్వతి ఎన్ని కబుర్లు చెప్పినా విసుగు లేకుండా వింటుంది. పార్వతి బలవంతంమీద ఒక్కొక్కసారి ఇక్కడే భోజనం చేస్తోంది.

ఆ రోజు శుక్రవారం. రాధ తలకి పోసుకుని తోటలో పూలు కోసి తల్లికి కాసిని ఇచ్చి పార్వతికి కూడా పట్టు కొచ్చింది.

పార్వతి అప్పుడే పూజ చేసుకుందామని పూజకి సిద్ధం చేసుకుంటోంది. రాధని చూసి, "వచ్చేవా! ఇప్పుడే రాజుని పంపిద్దామనుకుంటున్నాను." అంది.

"ఎందుకంట?" అంది, తను తెచ్చిన పూలు అక్కడ పెడ్తూ.

"ఈ రోజు నువ్వు పాట పాడుతోంటే పూజ చేయా లనిపించింది" అంది నవ్వుతూ.

"నాకు పాటలు సరిగా రావటే?" మొహమాటపడ్తూ అంది.

"దేవుడు దగ్గర తప్పులు పోకుండా పాడటమే లెక్క. అంతేకాని గొంతుకతో ప్రమేయం లేదు. అయినా అందరూ ఒకేలా ఎలా పాడగలరు చెప్పు! అసలు వచ్చింది పాడుతూ

వుంటేనే ఏదేనా రాణింపుకు వస్తుంది. బాగా రాదేమో - ఎవరేనా నవ్వుతారేమో అని భయపడుతూంటే ఆ బెదురు అలాగే వుండిపోతుంది" అంది. ఇంక అనూరాధ ఏమీ అన లేదు.

పార్వతి పూజకి సిద్ధం చేసుకొంటోంటే తను కొన్ని పూలు మాలగా కట్టి ఆవిడ కిస్తూ "కృష్ణ విగ్రహానికి వేయండి పిన్నిగారూ" అంది.

"నువ్వు తలకి పోసుకున్నావుగా! నువ్వు వేయచ్చు - వేయి. ఈ లోపున నేను అన్నీ సిద్ధం చేసుకొంటాను" అంది.

ఆవిడ అలా ఎందుకు అందా అని ఓసారి ఆవిడకేసి చూసింది. పార్వతి తన పనిలో నిమగ్నురాలయి వుంది.

అనూరాధ తను తయారు చేసిన కదంబమాలని ఓసారి చూసింది. మెల్లగా కదల్లి కృష్ణవిగ్రహం దగ్గరకెళ్ళి నిలబడి పోయింది.

మురళి వాయిస్తున్న ఆ శిల్పని విగ్రహంకేసి చూసింది.

మురళి వాయిస్తున్న గోపాలకృష్ణుడు కళ్ళల్లో కొంటె తనం స్పష్టంగా తెలుస్తోంది. తదేకంగా అలాగే చూస్తూ వుండిపోయింది.

అలా ఎంతసేపు నిలబడిపోయిందో -

"అయిందా" అని పార్వతి పిలిచేసరికి తేరుకుంది.

తన చేతిలో కదంబమాలని ఆ కృష్ణ విగ్రహానికి

వేసి భక్తిగా నమస్కరించింది. పార్వతి పూజ మొదలు పెట్టబోతూ "నీకు వచ్చిన పాట ఏదేనా పాడు" అంది. రాధ ప్రతిమాలించుకోలేదు. తనకి నచ్చిన పాట కృష్ణునిమీద పాట నెమ్మదిగా - శ్రావ్యంగా పాట అందుకుంది. వీళ్ళు పూజ హడావిడిలో వున్నారు. కృష్ణ వచ్చింది వాళ్ళు చూడలేదు. రాజు చెప్పలేదు. పూజ చేసుకొంటోంటే మాట్లాడించ కూడదేమోనని.

కృష్ణ వస్తూనే రాధ పాట విన్నాడు. అతను రాధ అనుకోలేదు. రాధ ఆ రోజు రాజుని వంట చేయవద్దని చెప్ప డానికే ఒక్కసారి వచ్చింది. మళ్ళా ఎప్పుడూ రాగా అతను చూడలేదు. అతను ఈశ్వరి వచ్చిందేమో అనుకున్నాడు. 'ఈశ్వరి ఇంత బాగా పాడుతుందా?' అనుకున్నాడు. వెంటనే షూ విప్పి - కాళ్ళు కడుక్కుని పూజగదికేసి వచ్చేడు. ఆ దృశ్యం చూసి. తెల్లబోయాడు - ఆశ్చర్యపడ్డాడు.

పార్వతి పూజ చేస్తోంది - అనూరాధ రెండుచేతులూ జోడించి - కళ్ళు మూసుకుని తన్మయంగా పాట పాడుతోంది. అతను నిశ్శబ్దంగా వెనక్కి వచ్చేశాడు.

పార్వతి పూజ అయింది - నైవేద్యం పెట్టింది.

రాజు వచ్చి "అయ్యగారు వచ్చేరు" అని చెప్పేడు.

అనూరాధ ఉలికిపడింది.

పార్వతి ఇచ్చిన ప్రసాదం తీసుకుని "వస్తా, పిన్ని గారూ" అంది.

"రాధా ! ఈ పూట నీ భోజనం ఇక్కడే" అంది.

"మీరు చెప్పినప్పుడల్లా చేస్తూనే వున్నాను - ఇంక ఇప్పుడు బలవంతం పెట్టకండి" పార్వతిని ఎలాగయితే ఒప్పించి వెళ్ళిపోయింది.

కృష్ణ ఎదురు పడ్డాలంటే ఏదో బెదురుగా వుంది. అతని మనసు చాలా గాయపడిందని అతని ముఖం చూస్తేనే తెలుస్తోంది. ఆ రోజు రాజుకి అన్నం వండద్దని చెప్పడానికి వచ్చినప్పటినించి అతని మనసు మరీ గాయపడిందని అనూ రాధ గ్రహించింది. అసలు సంగతులు తెలిసినప్పటినించీ - అనూరాధ కృష్ణని తను చూసినప్పటినించీ ప్రతీదీ గుర్తుకు చేసుకోసాగింది. ఆఖరికి మొన్నీమధ్య అనుమానం కలి గోపీని అడిగింది, "మనను కొన్న డబ్బు కృష్ణమోహ చ్చిందే కదూ" అని. గోపీ చెప్పలేదు. "నీకెందుకొచ్చ అనుమానం" అని అడిగాడు. "నిజం చెప్పు-నేనేం అనను అంది. గోపీకి ధైర్యం వచ్చి అసలు సంగతి చెప్పి "ఏం, అలా అడుగుతున్నావు" అని అడిగాడు. "ఏం లే"దని వచ్చేసింది. ఇలా ప్రతీదీ గుర్తు చేసుకొంటోంటే తనంటే అతనికి ఎంత ఆరాధనో - శ్రద్ధో గ్రహించేసరికి ఒక్కసారి అతని దగ్గర వెళ్ళి "నన్ను క్షమించండి" అనేస్తే గాని మనసు కుదుట లా లేదు. కాని, ఎలా? అతనితో తనకి పరిచయం ఏదీ? తన కళ్ళ పడితేనే తను ముఖం ముడుచుకుపోయేది.

ఇంట్లోకి వచ్చిన అనూరాధకి మనసు కుదురు లేదు. పుస్తకం చదవాలని ప్రయత్నించి విఫలురాలయింది. ఆఖరికి క్రీతంరోజు సహం కుట్టి ఆపుచేసిన గౌను కుడదామని ప్రయత్నించింది. అదీ సాధ్యం కాలేదు.

* * *

అందరికీ జ్వరం వస్తుంది — తనది రాయిలాంటి శరీరమని రాధకి జ్వరం వచ్చినప్పుడు కృష్ణ అమాయకంగా అనుకొన్నాడు. అతని కోరిక తీర్చడానికా అన్నట్లు అతనికి జ్వరం వచ్చింది. వూరిలో బయలు దేరేటప్పుడే అతనికి బధకంగా అన్పించింది వచ్చినపూట ఏదో బడలికలే అనుకుని వచ్చిన పూట భోజనం చేశాడు. రాత్రికి ఒళ్ళు తెలియని జ్వరం వచ్చేసింది. పార్వతికి ఒకటే ఖంగారు. ప్రకాశరావు డాక్టరు దగ్గరకి బయలుదేరబోతోంటే గోపీ వచ్చేడు. సంగతి తెలుసుకుని ప్రకాశరావుని వుండమని తను వెళ్ళి డాక్టరుని తీసుకొచ్చేడు.

కృష్ణకి జ్వరమని తెలిసిన రాధకి కాలు నిలవలేదు. అలా అని చొరవగా వెళ్ళి పలకరించే చనువు లేదు-ధైర్యం లేదు. యాంత్రికంగా ఇంట్లో పనులు చేస్తోందేగాని మనసు అంతా కృష్ణమీదే వుంది.

పదిగంటలవేళ ఇంక నిలవలేక - ఎలాగో ధైర్యం చేసి వెళ్ళింది. అప్పటికి తల్లీ, తండ్రీ, బాబు వెళ్ళి చూసి వచ్చేరు.

పార్వతి కృష్ణ మంచం దగ్గరే కూర్చుంది. ప్రకాశ రావు హాల్లో ఏదో చదువుకొంటూ కూర్చున్నాడు. రాధ నెమ్మదిగా రాజునడిగింది, పార్వతి ఎక్కడుందని.

కృష్ణ గదిలో వుందని రాజు చెప్పేడు.

ఈ లోపల ప్రకాశరావు పార్వతిని ఉద్దేశించి "పార్వతీ! రాధ వచ్చింది" అంటూ పిల్చేడు.

"ఊరికేనే వచ్చేను కూర్చోనీయండి" అంది మెల్లగా.

పార్వతి ఇవతలకి వచ్చింది. పార్వతి ముఖమంతా వాడిపోయినట్లుంది. రాత్రంతా కృష్ణ మూలుగుతోంటే ఆవిడ అలా మేలుకునే వుంది.

* * *

నాలుగు రోజులు భారంగా గడిచిపోయినాయి.

అనూరాధకి ఈ నాలుగు రోజులు నాలుగు యుగాల్లా గడిచినాయి.

మొదటిరోజు సంకోచంగా అతని ఎదురు పడటానికి జంకి వెళ్ళిపోయింది. కాని తర్వాత ధైర్యం తెచ్చుకుని పార్వతికి సాయంగా ఇక్కడే వుండిపోయింది. పార్వతి దిగులుతో అన్నం తినకపోతే "నా చేత్తో పెట్టినా తినరా" అంటూ మారాం చేసి పార్వతి చేత అన్నం తినిపించింది.

"నువ్వు గాబట్టి ఆవిడచేత తినిపించేవు - అదే

నయితే పచ్చి మంచినీళ్ళు కూడా తాగించలేను" అన్నాడు ప్రకాశరావు.

కృష్ణకి కూడా కాఫీ కావాలన్నా-అతనికి ఏది కావాలన్నా పార్వతి చేయబోతోంటే "మీరు కూర్చోండమ్మా! నేను తెస్తాను" అనేది. రాధ అలా 'అమ్మా' అన్నప్పుడు బాధ - మరేదో ఊరట - రాధచేత 'అమ్మా' అని ంచుకోవాలని - అంతలోనే మళ్ళీ ఏదో బెరుకు. రాధకేసి త్తి చూస్తే చూపులు మరల్చుకోవాలని వుండదు పార్వతికి. కృష్ణ అంగీకారం అయితే - కృష్ణకి రాధని ఇచ్చి చేస్తే బాగుంటుందని మహా ఇదిగా వుందావిడకి. కాని రాధ మాట ఎత్తేసరికి కృష్ణ ప్రసన్నంగా మాట్లాడుతున్నవాడు అదోలా అయిపోనటంతో ఎందుకో ఆవిడకి అర్థంకాలేదు. భర్తతో అని చూసింది - "తొందర పనికిరాదు. చెబ్దాం" అన్నాడు.

కృష్ణకి జ్వరం తగ్గి కాస్త లేచి కూర్చునేసరికి పార్వతికి మనసు కుదుటపడింది. కృష్ణ మొహం కడుక్కుని వచ్చేసరికి రాధ కాఫీ కప్పు తీసుకుని గుమ్మంవరకూ వచ్చి ఆగిపోయింది.

"రా, రాధా! ఫరవాలేదు రామ్మా" అంది పార్వతి.

కృష్ణ తలెత్తి చూసేసరికి రాధ అప్పుడే బెదురు-కళ్ళెత్తి చూసింది. అతని కళ్ళల్లో లీలగా ఆశ్చర్యం లాడింది. వెంటనే చూపులు మరల్చుకున్నాడు.

రాధ కాఫీ తీసుకొచ్చి పార్వతి చేతికి ఇచ్చింది. పార్వతి కృష్ణకి ఇచ్చింది. అతను యాంత్రికంగా అందు కున్నాడు.

రాధ పార్వతికి ఇవ్వగానే వెంటనే అక్కడనించి వెళ్ళిపోయింది.

పార్వతి చెప్తోంది - ఈ అయిదారు రోజులుగా ... తనకి ఎంత సహాయం చేసినదీ - రాధ కనక ధైర్యం చెప్ప... పోతే తను ఈ మాత్రం తిరగలేక పోయేదాన్నని చెప్పింది. కృష్ణకి మొదట అయోమయంగా అన్పించింది. తర్వాత అత్తయ్య బాధ చూడలేక - అత్తయ్యని ఓదార్చటానికి వచ్చి వుంటుంది. 'పోనీ! అత్తయ్యతో కూడా మాట్లాడ కుండా ఆవిడ మనసు నొప్పించలేదు - నయం కదూ!' అను కున్నాడు.

కృష్ణ పత్నం తిన్నాడు. రెండు రోజులు ఇంట్లో విశ్రాంతిగా వుండిపోయాడు.

అతను హాల్లో వున్నప్పుడు - అతని పక్కనించే వెళ్ళా ...టే ఏదో బెదురుగా - జంకుగా అన్పించినా ధైర్యం తెచ్చు ... తల ఒంచుకుని లోపలకి వెడుతోంది.

రాధ అలా ఇంట్లో తిరుగుతో ...టే మనసుకి ఏదో రిలీఫ్‌గా ... మళ్ళీ అంతలో ఏదో దిగులుగా అన్పించిం దతనికి.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B194 |
| పుస్తకం పేరు | అనగనగా |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 221 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేవి పేజీలు | 1-8 |
| తయారు చేసినది | Haseema |
| పేజీలు విడదీసినది | Haseema |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |